సంపాదకురాలు: పర్నా శారదాదేవి

సలహా సంఘసభ్యులు: బ్రహ్మశ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రి గారు

,, వేలూరి శివరామశాస్త్రి గారు

,, పల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

,, డా॥ గిడుగు సీతాపతి గారు

,, విశ్వనాథ సత్యనారాయణ గారు

,, రాయప్రోలు సుబ్బారావుగారు

,, శివశంకర స్వామి గారు

,, వసంతరావు వెంకట్రావు గారు

,, డా॥ పుట్టపర్తి శ్రీనివాసచార్యులుగారు

,, దేవులపల్లి రామానుజరావు గారు



# వేదవాఙ్మయము

తిరుమల శ్రీనివాసశర్మ

( ఆంధ్రోపాధ్యాయుడు, ఉన్నతపాఠశాల అలంపురము )



సంస్కృతి నికేతనము

హైదరాబాద.

చందాదారులకు 1-4-0

ఇతరులకు 1-8-0

# విషయసూచిక



ఈ విషయమున ఉత్తమ సాహిత్యము వెలువడుచు పాశ్చాత్యులు చేసిన కృషి యెంతయు శ్లాఘనీయము.

ఏభాషలోనైన యమూల్య విషయమున్నను దానిని వినియోగించుకొని తెలుగు వారి కొరకును గురుతో నిది యనువదింపబడినది. ఈ పుస్తకము "వేద-ఔర్ ఉనకా సాహిత్య" అను హిందీ గ్రంథమున కనువాదము. ఇది యథాతథముగ ననువదింపబడక సందర్భము మార్పులకును లోనైనది. నేను నేతత్ మూలగ్రంథ కర్తలకు కృతజ్ఞతలర్పించుచున్నాను.

ఈ పుస్తకమును ఆంధ్రమహాజనుల హస్తములకందించు నవకాశము లభించుటచే నాకెంతయు సంతసము కలిగినది. ఇట్టి పనిలో నాకు మార్గదర్శకులై యనేక విధముల తోడ్పడి ఇంత యల్ప కాలములో దీనిని ప్రసిద్ధి పరచిన శ్రేయస్సు "సుజాత", శ్రీ గడియారము రామకృష్ణ శర్మ గారలకు జెందియున్నది.

సంస్కృతి, సంప్రదాయముల పునరుద్ధరించు నాశయముతో సేవ జేయుచు నీ గ్రంథ మాలికన ప్రజా సేవయొనర్చుట కవకాశమిచ్చిన సంస్కృతీ నికేతనమున కెంతయు ఋణపడితిని.

సహృదయులు సాహిత్యము నందలి ఉత్తమ కృతుల ననువదింపజేసి దిక్కు దిక్కులకు ప్రబలునట్లు జేయవలయునని యాశించుచున్నాను.

అనువాదకుడు
తిరుమల శ్రీనివాసశర్మ

అలంపురము
14 నవంబరు 1953.

# వేదవాఙ్మయము

౧

## వేదములు

వేదములత్యంత ప్రాచీనములై మిక్కిలి ప్రాశస్త్యమందిన పవిత్ర గ్రంథములు; నేటికిని ఆర్యసంస్కృతిని చాటుచు, హైందవధర్మమునకు మార్గదర్శకములుగ నున్నవి. అనేక సంప్రదాయముల చేతను, విభిన్న సంస్కృతులతోడను వస్తవ్యస్తమగుచున్న హిందూజాతి నేడుకూడ వేదములముందు సాగిలి మ్రొక్కుచున్నది. ఇవియింత గొప్పవని తెలిసి నప్పటికిని పరమగోప్యములై గహనములై, యజ్ఞేయములైయున్నవి. కావున నిప్పుడిట్టి వేదముల సామాన్యపరిచయము కొన్ని యధ్యాయములలో చేయ వలెనని మా సంకల్పము.

వేదములార్యుల సాహిత్యములో ప్రాచీనతమమైనవి. పాశ్చాత్యులలోని గొప్పవిద్వాంసులును ఋగ్వేదము మానవసంస్కృతిని బోధించు నాది గ్రంథమని యొప్పుకొని యున్నారు. మహర్షి దయానందులు వేదముల కాలము 1960852984 అని చాటిరి. సాయణ భాష్యకారులదియు నిదేయభిప్రాయము. వేద మీశ్వరకృత సాహిత్యమనియు, సృష్ట్యాదినిది యుదయించెననియు నీ విద్వాంసుల తలంపైయున్నది. తిలక మహాశయుడు జ్యోతిర్గణితముల నాధారముగగొని వేదములు క్రీ. పూ. 6000సం॥ క్రిందివని సిద్ధముచేసెను. పాశ్చాత్యపండితు లితని సిద్ధాంతమునే చాలావర కంగీకరించుచున్నారు.

మధ్యకాలములో వేదములకు సంబంధించిన విజ్ఞాన స్వరూపమును భారతవర్షము మరచియుండెను. వేదములు – కర్మఠులు – అందందు, విశేషముగ దక్షిణపువారు, వేదసూత్రముల వల్లెవేయుచుండిరి. అయిన నామంత్రార్థాదికజ్ఞాన మేకొందరికో యుండెడిది. ఆకాలమున సైరోపా

ఖండము సంస్కృత సాహిత్యజ్ఞానము నేమాత్రము గలిగియుండలేదు.
కావుననే ఆదినములలో భారతదేశమునకు వచ్చిన శ్వేతముఖులకు సంస్కృత
సాహిత్యము అందు వేదవిషయము బొత్తిగా తెలియకపోయెను. ఇది
యటుండ వేదముల యాథార్థ్యము నెఱుంగని భారతీయ విద్వాంసులును
(కొందరు) వాటిని మ్లేచ్ఛులబారినుండి సంపూర్ణముగ రక్షించుచుండిరి.

గడచిన వందసంవత్సరములలో పాశ్చాత్యవిద్వాంసులు ప్రాచీన
సంస్కృతసాహిత్యమును పునరుజ్జీవింపజేసి దాని గొప్పదనమును లోక
మునకు చాటిరనుట యతిశయోక్తి కాజాలదు. సుమారొక శతాబ్దము
క్రిందట సర్. విలియమ్‌జోన్స్ 'శకుంతల' ననువదించి సంస్కృత
సాహిత్యమును స్వదేశీయులకు పరిచితము గావించుటయేగాక వారిమనముల
నా వైపాకర్షింపజేసెను. ఇతడు తనభూమికలో 'ఆసియాఖండపు సాహి
త్యమున ప్రకాశితులైన యద్భుతవస్తువులలో నిదియొకటి. మరియు నిది
మానవ కల్పనాఫలితమగు రచనలలో నతికోమలమును సుందరము నైనది.
దీనివలె నే యుగమందును, నేదేశమునను, నేకాలమునను, నేదియు రచింప
బడలేదు.' ఇతని యనంతరము ప్రసిద్ధుడగు 'గేటే' కవియు నీనాటకమును
గొప్పగాకీర్తించెను.

తరువాత సర్. విలియమ్‌జోన్స్ ఏషియాటిక్ సొసైటిని స్థాపించి
మనుస్మృతి ననువదించెను. తరువాత ప్రాచీనసంస్కృత భాండారము
నెవ్విధమునను బడయజాలడయ్యెను. అతడు కేవలము బుద్ధుని యనంతర
సాహిత్యముననే పరిశోధింపసాగెను.

కోల్‌బ్రూక్ పండితుడుకూడ నిదేవిధమున పనిజేయ నారంభించెను.
ఇతడు గొప్ప గణితజ్ఞుడుగ నుండి యూరోపాఖండలి సంస్కృత విద్వాం
సులలో మిన్నయైయుండెను. వేదాంతము, బీజగణితము, హిందూగణిత
సిద్ధాంతములపై ననేక గ్రంథములవ్రాసి 1805లో యూరోపీయులకు నితడు
వేదములకు పరిచితమొనర్చెను. అయిన కోల్‌బ్రూక్‌గారు వేదముల
మూల్యము నంతవరకు దెలియజాలరైరి, అతడొకచో అనువాదకుని శ్రమ
యటుండని, పాఠకులకైనను తమ కష్టమూల్యములభించుట కఠినమేయని
వ్రాసెను.

డాక్టర్ H. H. విల్సన్ కోల్‌బ్రూకు ననుసరించుచు ఋగ్వేద సంహితను ఆంగ్లమున ననువదించెను. ఇదిగాక సంస్కృతనాటకములను, మేఘదూత, విష్ణుపురాణాదికముల ననువదించెను.

ఇదేసమయమున ఫ్రాన్సులో 'బర్నఫ్' అనునొక గొప్ప విద్వాంసు డుండెను. ఇతడు 'జెందావస్తా' మరియు వేదముల తారతమ్యమును గమనింపజేయుచు నొక వ్యాకరణమును రచించెను. ఋగ్వేదమునకు వ్యాఖ్య వ్రాయుచు దానిమూలమున నితడార్యుల ఇతిహాసముపై వెలుతురుసారించి 'సీరియా'లోని శంఖులిపినిగూడ చదివెను. ఇదిగాక, బౌద్ధవాఙ్మయమును కూడ నితడుద్ధరించెను. ఈతడు పాతికేండ్లవరకు నైరోపాదేశీయులకు ప్రాచీనసంస్కృత సాహిత్యవిషయముల గరపెను. వేదవాఙ్మయమును విశదపరచిన 'రాథ్' మరియు ప్రొఫెసర్ మాక్సుమూలరు లితని శిష్యకోటి లోనివారు.

ఇటీవల జర్మను పండితులీవిషయమై ఎక్కువకృషిసల్పిరి. రాజా రామమోహనరాయల సమకాలికుడగు 'రోజన' పండితుడు ఋగ్వేదములోని మొదటి యష్టకమును లాటిన్ భాషలో ననువదించెను. దీనిని పూర్తిగా ననువదించు సంకల్పమితని యకాలమరణమున నెరవేరదయ్యెను. ఆనాటి సుప్రసిద్ధవిద్వాంసులు 'బాప్', 'గ్రిమ్' 'హంబోల్ట్'ల ప్రయత్నముచే యుగమును మార్చునంతటి తత్త్వములు ప్రకటితములయ్యెను. ఈపండితులు సంస్కృతము, జెంద్, గ్రీకు, లాటిను, స్లేవ్, ట్యూటన్, కెల్టిక్, భాషలు పరస్పర సంబంధమును గలిగి యొకమూలమునకు జెందినవను విషయమును పాశ్చాత్యులొప్పుకొనునట్లు చేసిరి.

దీనివలన సంస్కృత మన్నిభాషలకు తల్లియను ప్రమాణ మేర్పడెను. ఆశతాబ్దపు ప్రసిద్ధ విద్వాంసుడగు 'రాథ్' యాస్కుని నిరుక్తమునకు టిప్పణము వ్రాసి, దాని సంపాదకుడయ్యెను. దీని తరువాత నితడు 'హితనీ' సహాయమున 'అథర్వణ' వేద సంపాదకుడై 'బహలిక్'ని తోడ్పాటుతో సంస్కృతభాషకు నొక పూర్ణకోశమును సిద్ధపరచెను. దీనితరువాత 'లెసన్' పండితుని గొప్ప పుస్తకము Indische Alterthumskunde ప్రకాశితమయ్యెను, శుక్ల యజుర్వేదము, దాని బ్రాహ్మణములు, మరియు

సూత్రములను 'వేబరు' వెలయించెను, ఇతడనేక సందిగ్ధ విషయములను తన Indischesludion లో వ్యాఖ్యానించుచు సంస్కృత సాహిత్య ప్రామాణిక వృత్తాంతములను ప్రకాశింప జేసెను. దీనితరువాత 'వేనఫీ' సామవేదమునకొక విలువైన సంస్కరణమును ప్రకటించెను.

చివరకు ప్రో. మ్యాక్స్‌మూలర్ సమస్త ప్రాచీన సంస్కృత సాహిత్యమునకు, సమయము ననుసరించి, 1859 లో క్రమపట్టికను సిద్ధముచేసెను. తరువాత సాయణభాష్యమును, వెనువెంటనే ఋగ్వేద భాష్యమును ప్రకాశింపజేసెను. ఈ ప్రకారముగ దుర్లభమును, పరమ గోప్యమునైన వైదిక సాహిత్యము విద్యార్థులకు సులభమయ్యెను.

భారత దేశమున డాక్టర్ హాంగ్ ఐతరేయ బ్రాహ్మణము ననువదించి ప్రకటించెను, దీని తరువాత ఋషి దయానంద సరస్వతి ఋగ్వేద సంహితను తొలుత హిందీలో ననువదించెను, పిదప యజుర్వేదముకూడ సులభముగ హిందీభాషలో వీరిచేతనే పరివర్తితమైనది. వంగ పండితుడు సత్యవ్రత సామశ్రమి సాయణభాష్యముతో గూడిన సామవేదపు మంచిసంస్కరణము నొకదానిని వెలయింప జేసెను. ఇతడు 'మహీధర' వ్యాఖ్యతోనున్న శుక్ల యజుర్వేదమునకు గూడ సంపాదకుడై 'నిరుక్త'మునకొక చక్కని సంస్కరణమును వెలికి తెచ్చెను.

ఇట్లు దుర్ధర్షములగు వేదములు 100 సం॥లలో నందరి యందుబాటులోనికి వచ్చినవి.

దేశ దేశములలో వేదముల విషయమై విద్వాంసులలో భిన్నాభిప్రాయములుండినవి. మొదటిది బ్రహ్మవాది మతము. దీని యభిప్రాయమేమన పరమాత్ముడు సృష్ట్యాదిని నలువురు సమాధిస్థ ఋషుల హృదయసీమలలో వేదముల ప్రకటింపజేసెను. ఇది చాలా ప్రాచీనమైనది, దీనికి బ్రాహ్మణములు, ఉపనిషత్తులు సూత్రములు పుష్టిచేకూర్చినవి. సాయణ, దయానందులును దీని ననుగమించిరి. ఋగ్వేదము 10. 90. 9, యజు 31.7 మరియు 34.5, అథర్వణము 90-4. 7.20 శతపథము 14-5.4.10 మను 1.13, 12.94, నుండి 12,100 వరకు, నిరుక్తము అ 2, మున్నగు

నుదాహరణములచే పైవిషయము సమర్థింపబడుచున్నది. రెండవది దార్శనికము, దీనిలో వేదము సాది, నిత్యము ను విషయములు నమ్మబడవు. వాటికిని యుత్పత్తికలదని భావింపబడును. దీనికి తోడ్పడుటలో సాంఖ్యము 5.45-51 వరకు యోగము 1,24 (వ్యాసభాష్యము మరియు వాచస్పతి మిశ్రిని తర్కము) న్యాయము 2.67, వైశేషికము 1.1.3, వేదాంతము 1.3, మీమాంస 1, 1, 18, ఉదాహృతములగును. మూడవది నిరుక్త మతము, అది మొదటి యభిప్రాయముతో నించుమించు నేకీభవించును. కౌత్సమతము నాలవది. ఇది "వేదములు నిరర్థకములు, వాటి యర్థము స్పష్టముగ దెలియబడదు," నిరుక్తకారుడిద్దానిని విరోధించెను.

అయిదవది యాజ్ఞిక మతము. దీని యభిప్రాయమేమనగా వేదములు కేవలము నలువురు ఋషుల హృదయములలోనే ప్రకటితములు కాలేదు. కాని ఈ మంత్రద్రష్టలగు ఋషుల హృదయములలోనే యవి ప్రకటితములైనవి. మరియు నిప్డే యవి ప్రకటితము లగుచుండును. వేదము లిప్పటికిని సంపూర్ణములు కావు. ఈ మతము వారు వేదస్థ దేవతలను సచేతనులుగ నమ్ముదురు. శంకరుల వారీ మతానుయాయులు. ఋగ్వేదపు 10.71.11 లోని మంత్రము మరియు ఋ. 10.90.16 వ మంత్రము దీనిని పుష్టీకరించును. దీనిని బ్రాహ్మణములును బలపరుచును. అయిన నిరుక్తకారుడు దీనిని విరోధించును.

ఐతిహాసిక మారవది. ఇది వేదములలో నీశ్వరీయ విజ్ఞానమును విశ్వసింపక వాటిలో ఆర్యసంస్కృతి యొక్క ప్రాచీనైతిహాసమును మాత్రము స్వీకరించును. ఈపక్షము తన పరముగ ఋగ్వేదమున 1.32.0 1.32.11 - 3 33.5 - 3.33.6 - 10.98 5 - 10.98.6-7_47 - 7.4.8 - 1.105.9.1.104.1-1.126.7 3.53.14 - 4.30.18 - మంత్రముల నుదహరించును.

7 వ మతము పాశ్చాత్య విద్వాంసులది. వీరు వేదములనుండి ఆర్యుల మూలము మరియు నుద్గమ స్థానముల బరిశోధింతురు. తమ గవేషణలో వీరు గాథా, వ్యుత్పత్తి, పురాతత్వ మస్తిష్క, మానవీయ భూస్తర, ప్రాణ్యవశేషాదిక శాస్త్రముల సహాయమును పొందుదురు. తిలకు పక్షమీ మతమునకు సంబంధించినది.

| | | |
|---|---|---|
| వేదకాలము - మృగశిర కాలము | క్రీ.పూ. 10 వేల నుండి 8 వేల సం॥ల వరకు | |
| ,, ,, ,, | ,, ,, | 6000—2500 వరకు |
| ,, కృత్తిక ,, | ,, ,, | 2500—1400 ,, |
| తైత్తిరీయ సంహిత (బ్రాహ్మణము) | ,, ,, | 2500—1400 ,, |
| ,, (అరణ్యకము) | ,, ,, | 2000—1400 ,, |
| జ్ఞానపరములగు నుపనిషత్తులు | ,, ,, | 1900—1600 ,, |
| అర్వాచీనో పనిషత్తులు | ,, ,, | 700 —600 ,, |

దర్శనము మిక్కిలి బుద్ధిగమ్యమగు శాస్త్రమేయైనను వేదములను గురించి దానివర్ణనలస్పష్టములు. ఇంతయేగాక సకల దర్శనకారులయు నొక్క యభిప్రాయముకాదు. వేదాంత సూత్రకారులు వానికి భాష్య కారులునగు వ్యాస శంకరులకథన మిట్లున్నది. 'వస్తుజాతివాచకములగు శబ్దములజాతి నిత్యమైనది.' నైయాయికులు వేదములు స్వతఃప్రమాణములని యందురు. వైశేషికములు ఈశ్వరకృతములనియు, సాంఖ్యులాది పురుషుని నుండి పుట్టినవనియు నమ్మెదరు. మీమాంసకారులు వేదార్థమే నిత్యమని యందురు. ఇవన్నియు బ్రహ్మవాదిమతమునకే యనుకూలించుచున్నవి.

తిలకుమతమును గమనించినచో ఇంతవరకు ప్రకాశితములగు మతము లన్నిటికంటెను ప్రమాణయుక్తమగుటు-భూగర్భశాస్త్రవేత్తల యనుసారముత్తరధృవములోనిహిమప్రళయకాలము 10,12, వేల ఏళ్ల క్రితమువగుట తిలకు వాదము దెబ్బతినుచున్నది. ఐన వేదములను సమర్థించు విద్వాంసుడు సత్యవ్రత సామశ్రమీ తిలకు మతమును పూర్ణముగ విరోధించెను. ఈ విరోధములో పటుత్వము కాని వివేచనా తర్కముల బలముకాని లేదని నాకనిపించును.

తిలకు తన 'ఓరియను' గ్రంథమున అంకగణిత, జ్యోతిష సిద్ధాంతముల నాధారముగగొని ఇతిహాసమున కందనివైదిక కాలమునీవిధముగ తలపోసి యున్నాడు.

నైతిహాసికులలో ప్రసిద్ధుడగు రమేశచంద్రదత్తు వేదకాలము క్రీస్తుకు పూర్వము 2000 సం॥ నుండి 1400 వరకని విశ్వసించెను. ఆర్యులు సింధు

లోయలలో నున్నప్పుడు ఋగ్వేదము వెలువడినదని యితని యభిప్రాయము. వేద భాష్యకారుడగు సాయనాచార్యుడును ఋగ్వేద మతి ప్రాచీనమని నమ్ముచున్నాడు. పాశ్చాత్య విద్వాంసులును ఋగ్వేదపుటధికాంశము ఆర్యులు సింధు తీరమున నున్నప్పుడే రచింప బడినదని తలంచు చున్నారు. తక్కిన యంశములు తరువాత విరచితములైనవని వారి యభిప్రాయము. విశ్వామిత్రుని పుత్రుడగు మధుచ్ఛందుడు మరియు దశమ రుండలపు ఋషిబృందము ఋక్కుల వెలయించిన ఋషులలో నాధునికులని తోచుచున్నది. వ్యాకరణాచార్యుడగు 'పాణిని' క్రీ. పూ. 4 వ శ॥ ములో నుండెననుట నిర్వివాదమైనది. ఇది సూత్రములకు మధ్యయుగము. శౌనకుని 'బృహద్దేవత' లో 'యాస్కుని' యభిప్రాయములు ఉల్లేఖింప బడుటచే యాస్కుని తరువాతనే నిరుక్తమునకు ఋగ్వేదపు విశేష శాఖలను శౌనకుడు రచించెనని బోధపడుచున్నది. దీని వలన యాస్కుడు పాణిని కన్న నించుమించు 150 సం॥ లు తరువాత వాడుగ నుండెననుట స్పష్టమగును. జైన బౌద్ధదర్శన శాస్త్రములు హిందూ దర్శన శాస్త్రములకు ప్రతివాదమూలకములగుట సూత్రముల యారంభ కాలము బుద్ధునకు మొదటిదై యున్నది. ఇవియునుపనిషత్తుల యాధారము పైననే రచింపబడినవి. ఉపనిషత్తులు, బ్రాహ్మణముల పరిశిష్టములరణ్యకముల క్రమ వికాసమే. లేకున్న 2, 3 శతాబ్దములలో నిట్టి విశ్వసాహిత్యము వికసింప జాలదు.

బ్రాహ్మణముల రచనాకాలము క్రీ. పూ. 800 నుండి 600 సం॥ పూర్వమని మ్యాక్సుమూలరు విశ్వాసము. అయిన నీకాల నిర్ణయము కేవలము నిరర్థకమగు యుక్తివాదము పైననే యాధార పడియున్నది. జర్మన్ పండితుడగు 'యాకోబీ' మరియు తిలకు ప్రముఖుల జ్యోతిష సిద్ధాంతముల తరువాత పాశ్చాత్య విద్వాంసులు సైతము మ్యాక్సుమూలరు వాదమును తృణీకరించిరి.

జ్యోతిషము ననుసరించి కాల నిర్ణయమగుట లెస్స. పృథివి సూర్యుని ముందు పరిభ్రమించినంత కాలమొక దినముగను, చంద్రుడు భూమిచుట్టు తిరిగినంత కాలమొక మాసముగను చెన్న బడును. అయిన జ్యోతిషము గంభీరముగ చెప్పునదేమన : రెండమవసల నడుమగల సమయమునకు కొంత ముందుగనే

చంద్రుడు భూమిని చుట్టుచున్నాడు. మొదట చెప్పిన సమయము 30 దినముల కన్న తక్కువ మరియు తరువాత చెప్పినలెక్కలో 27 దినముల కన్న తక్కువ యగుచున్నది. కావున ప్రాచీన కార్తాంతికులు జ్యోతిశ్చక్రమును 27 భాగములుగ విభజించి, ఒక్కొక్క భాగమునకు 'నక్షత్ర' మని పేరిడిరి. నేటి కాలమున నక్షత్రముల లెక్క 'అశ్విని' నుండి యారంభింపబడుచున్నది. ఏ బిందువున నక్షత్ర మెట్టి విషువద్రేఖతో గలసి ఉత్తరాభి ముఖమగునో ఆ బిందువశ్విని నక్షత్రమునకు మొదటి బిందువగును. నక్షత్రముల పేర్లు: అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పూర్వాఫల్గుణి, ఉత్తరాఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్రపద, ఉత్తరాభాద్రపద, రేవతి. ఈ రీతిగ జ్యోతిశ్చక్రమున ప్రత్యేక భాగమునకు నక్షత్రముల పేరు కలిగినది. తారాగణ మెప్పటికిని జ్యోతిర్మయ మైనది, అయినను కొన్ని అంధకారమున పట్టుబడియుండును. వాటి నే గ్రహములందురు. అవి సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు, మంగళుడు, బృహస్పతి శనియనునవి. ప్రాచీన విద్వాంసులు సూర్యచంద్రులనే గ్రహములని తలచిరి, ఆ కాలమున నొక్కొక్క గ్రహ మొక్కొక పరి జ్యోతిశ్చక్రమ్మున తిరిగివచ్చుకాలమే నిర్దిష్టమైయుండెను. ఆకాసమున నుత్తరభాగమున నొక కదలికలేని చుక్కకనబడును. ఇది ఇతర గ్రహములవలె నక్షత్ర మండలమున తిరుగుటగాని, నక్షత్రములవలె పుడమికి నలువైపులను తిరగవచ్చుట కాని యెరుగదు. అదియ "ధృవ" నక్షత్రము. దీనికిక్రింద గ్రహసమూహముల పైభాగమున సప్తఋషి మండలమను పేరుతో నేడు ప్రకాశమానములగు నక్షత్రము లగుపడును. ఈ ఏడు నక్షత్రచక్రముకుండి వేరుగనున్నవి. జ్యోతిశ్చక్రమున వీటి గమనమే లెక్కకురాదు. అయిన సప్త ఋషిమండలపు 2 నక్షత్రములు 'ధృవ' నక్షత్రమునకు సమరేఖ పైనుండియేయితర నక్షత్రములతో గూడి యుండునో సప్తర్షి మండలమంతయు వాటి వెంబడే యుండును. కురుక్షేత్రయుద్ధసమయమున సప్తర్షి మండలము 'మఘా' నక్షత్రముతో గూడికొనియుండెనట. నేడును సప్తఋషిమండలము 'మఘ' తో గూడి యున్నది.

సప్తఋషిమండలమునకు చలనములేకపోయినను ప్రాచీనులు దానికి గతియున్నట్లెంచి తద్వారా సమయనిర్ణయము చేయుటకొక యుపాయమును

గని పెట్టిరి. సప్తఋషిమండల మొక్కొక్క నక్షత్రములో 100 సం॥ వరకుండునని వారు తలచియుండిరి.

ఋగ్వేదసంహితలో విషువద్రేఖపై 'మృగశిర' నక్షత్రముండినట్లు వ్రాయబడినది. బ్రాహ్మణయుగములోగూడ నిదేరేఖపై 'కృత్తికా' నక్షత్ర ముండినట్లు తెలియుచున్నది. క్రీ. పూ. 2500 సం॥ కృత్తికలో మరియు 4500 సం॥ తోలుత మృగశిరలో మహావిశ్వసంక్రాంతియై యుండినదని తిలకుగారును, జర్మన్ శాస్త్రవేత్త యాకోబియును ప్రకటపరచుచున్నారు.

శ్రీ. శే. తిలకుగారు జ్యోతిర్విజ్ఞానము నాధారముగనొని వేదవిషయ మున జేసిన గవేషణాఫలితములనదగు రెండు పరిణామములివి. ఒకటి వేద నిర్మాణకాలము క్రీ. పూ. 8000 నుండి 10000 సం॥ లు వెనుకటిదనియు, రెండవది వేదములనిర్మాణ ముత్తరధ్రువమనగా 'సుమేరువు' పై నైనదనియు స్పష్టములైనవి. ఋగ్వేదపు 1.24.10 యొక్క మంత్రము తిలకుగారి వాదనకు ముఖ్యమైనది.

శ్లో. అమీయ ఋక్షానిహితాస ఉచ్చానక్తం దదృశ్రేకుహ
చిద్దివేయుః, అదబ్ధాని వరుణ్యస్యవ్రతాని విచాకశాచ్చంద్ర
మానక్తమేతి ।

ఈమంత్రమున కర్థమిది: మన తలపైనున్న సప్తర్షి నక్షత్రములు రాత్రియగపడును. మరియు పగలదృశ్యమగును. చంద్రుడుకూడ రాత్రియే గనబడును. ఇవి వరుణుని అక్షయకర్మలు.

ఈమంత్రమున తలపైనున్న సప్తఋషుల వర్ణనమున్నది. ఈ సప్త ఋషులుత్తర ధ్రువముననే కేవలము తలపైనున్నట్లగపడుదురు. ఇదేవిధమగు వర్ణన ఋగ్వేదపు 10.89 లోని 18 ఋచలు సూర్యస్తుతి సూక్తముల యొక్కయు, దాని రెండవఋచయొక్కయు మొదటి యర్థములోనున్నది.

'ససూర్యః పర్యురూవరాం స్యేన్ద్రోవవృత్యాద్రథ్యేవచక్రా.' ఆలో చింపదగిన రెండవ విషయమేమనగా ఋగ్వేదమున పలుచోట్ల దీర్ఘమగు

ఉషావర్ణనలున్నవి. వీటినిగురించి ముందుచదివెదరు. ఋగ్వేదము 7.76.3లో
చూడుడు. "తానీదహాని బహులాన్యాసన్యా ప్రాచీనముదితా సూర్య
స్యాయతః పరిజార ఇవాచరం త్యుషోదదృక్షేన పునర్యతీవ." ఉషస్సు
ప్రకటితమై సూర్యోదయము వరకు నేకదినములైనది. ప్రియుని నలువైపుల
దిరిగిజారుమ స్త్రీవలె నది [ఉషస్సు] పరిభ్రమించుచున్నది. ఈ నలువైపుల
తిరుగుచున్న 'నుమ' యెట్టిది? ఇదేవిధమగు ప్రమాణములు ఋగ్వేదమున
8.41, 3-1.113.10-11, 12.13 - 1.174.7-2. 15.6-3.28.9- లో
దొరకును. వీటిలో దీర్ఘకాలము వరకు నుషస్సుండినట్లు చెప్పబడినది.
ఈ మంత్రములో నుషస్సు బహువచనములో వర్ణింపబడినది. అథర్వణ
వేదము 7.22,7 మరియు తైత్తిరీయ సంహితయొక్క 4ప్ర. 3, అ.11.లో
30 భాగములలో పరిభ్రమించుచున్న 'ఉషా' వర్ణనకలదు. ఈ యుషస్సులు
ప్రతిదినమగునవి కాక ఉత్తరధృవమందు రెండు నెలలవరకుండు నట్టివగుట
వలననే సూక్తులబలికిన ఋషు లవశ్యముగ దీనిని చూచియుండిరి. ఇదిగాక
నైతరేయబ్రాహ్మణమున 2-2-5లో అగ్నిష్టొమాదియజ్ఞములలో ప్రాతః
కాలమున పశువుల మేల్కొనకముందే ప్రాతరనువాకపు వేయిఋచలను
పఠింపవలెను. అయిన వేయిఋచలు 1 లేక $1\frac{1}{2}$ గంట ప్రభాతములో
నెట్లు పఠింపబడగలవు? దీనికై దీర్ఘమగు ప్రభాతమవసరము.

ప్రభాతము మరియు నుషస్సులవలె దీర్ఘములగు రాత్రుల వర్ణనలు
గూడ దొరకుచున్నవి. ఋ 1.32,10లో దీర్ఘతమః, అను శబ్దములు
వచ్చినవి. ఇదేవిధముగ ఋ2.27.14లో 'దీర్ఘాఃతమిస్రాః' శబ్దములున్నవి.
37.67.2.లో మిక్కిలిహర్షముతో వశిష్టులు 'మనకు తమస్సు అంతమై
యుషస్సుయొక్క ధ్వజ మగుపించుచున్నది' అని నుడివిరి. ఇట్టిమాటలే
ఋ. 10.124.1 మరియు ఋ. 2.2.2-10.927 లో మున్నవి. ఈ
ప్రాంతములలో మహారాత్రివర్ణన కలదు. మ్యాక్సుమూలర్ దీనికి 'నిరంతర
రాత్రి'యని యర్థముచేసియున్నాడు. వేరు చోట్లలోగూడ నిట్లే వర్ణ
నలుకలవు.

దీర్ఘరాత్రివలె దీర్ఘ దినవర్ణనయు ఋ. 5.45.5-10.138,3-2.87.
5లో కలదు.

ఈ మాటలకు పుష్టి తైత్తిరీయ బ్రాహ్మణము 3.9.22.2 నుండి కలుగుచున్నది. "ఏకంవా ఏతద్దేవానామాహః యత్సంవత్సరః" అనగా దేవతల దినమొక సంవత్సరమునై యుండెడిది. ఇదే మాటమనుస్మృతి 1.67లో చెప్పబడినది. మహాభారతము అరణ్య పర్వము 161-12 లో గూడ దీనివర్ణనయున్నది. పైజెప్పినవర్ణనలు ప్రమాణముల యాధారముపై తిలకుమహాశయుడు వేదనిర్మాణస్థాన ముత్తరధృవ మనియు, వాటి కాలము క్రీ. పు 8-10 సంవత్సరముల పూర్వమనియు నిర్ణయించియున్నాడు.

అయిన కొన్ని యంశములు మావిచార సరణిని మార్చునట్టివిగ నున్నవి. అవి వేదములలోని భారత దేశపు నదీనద ప్రదేశాదిక వర్ణనలు, ఋగ్వేదమున 360 దినముల సంవత్సర విషయము స్పష్టముగ తెలుప బడినవి. భారత దేశమున ప్రస్తుత ఢిల్లీ ప్రాంతమునుండి వాయువ్య భాగ వర్ణనలు మున్నగునవి కలవు. ఈ సంగతులన్నియు వేదములు భారత వర్షమునసే పుట్టినవని సప్రమాణముగ ఘోషించుచున్నవి. మంత్రములలో "వద్రంగి రథమును చేయునట్లు క్రొత్తసూక్తముల నల్లిరి. సూక్తములు క్రొత్తవైనను దేవతలు ప్రాచీనులే." "మా పూర్వపితృలు" మున్నగువాక్యములనుండి వేదములలో వాటి నిర్మాణముకన్న పూర్వస్మృతియు కలదు. ఇంద్రునికి "పూర్వ్య," "పూర్వ్యాణి," అశ్వినీ కుమారులకు "పూర్వ్యాణి" అను శబ్దముల ప్రయోగము ఇంద్రునికన్న నత్యంత పూర్వ పరిచితములని తెలుపుచున్నది. ఋగ్వేదము 8.59.6 లో మిక్కిలి ప్రాచీనకాలపు ఋషులను గురించిన స్మరణమే కలదు. ఒకవేళ వేదసాహిత్యము ఋషుల కలనసే నిర్మింప బడియుండిన నది యొకేకాలమున గాక, శీఘ్రముగాక, సుదీర్ఘకాలమున శతాబ్దములలో సిద్ధమైనది. ఆ కాలమును రెండు భాగములుగ జేయవచ్చును. ఒకటి హిమ పూర్వ కాలము, రెండవది హిమోత్తర కాలము. దీర్ఘోషాదిక వర్ణనలు అతి ప్రాచీనములు. ఆర్యుల ఆదిపురుషు లుత్తర ధృవమున నున్నప్పుడు అనగా హిమ పూర్వ కాలమునాటివి, మరియు ననార్యులతో జగడములు, ఇంద్రుడు మున్నగు దేవతల వర్ణనలు హిమోత్తర కాలమున ననగా ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చి సరస్వతీ తీరమునుండి 'ఈరాను' వరకు వ్యాపించిన కాలమునాటివి. అయిన నార్యులొక పరి ప్రబల జలౌఘములందును మరియొక పరి ఉత్తర హిమవన్నగ శిఖరాగ్రి

ములందును చేరి యచట చాలా కాలమువరకుండి, తరువాత క్రమమున దిగి సమస్తమగు నుత్తరఖండమును పిదప దక్షిణాపథ పరిచయమును చేసి కొనగలిగిరి.

గృహ్యా సూత్రములలో వివాహ సమయమున 'ధ్రువదర్శన'మును గురించిన సంగతికలదు. ఈ ప్రక్రియ నేడును వాచారమున నున్నది. అయిన నే వేదముననను 'ధ్రువుని'ని గురించిన ప్రస్తావనయే లేదు.

పురాణములు మరియు మహాభారతమునుండి పరీక్షితుని కాలమున సప్తర్షి మండలము 'మఘ' నక్షత్రమున నుండినదని తేటబడుచున్నది. ప్రాచీన విద్వాంసులకు 100 సంవత్సరములకొకపరి యొక్కొక్క నక్షత్ర ములో సప్తఋషిమండల ముండుననను విషయముగూడ జ్ఞప్తియందుండెడిది. దీని ననుసరించి కడపటి నందుని రాజ్యాభిషేక సమయమును గుణించి పంచాంగకారులా సమయమున సప్తఋషిమండలము 'పూర్వాషాఢ' నక్ష త్రమున నున్నట్లు వ్రాసిరి. ఈ ప్రకారము పరీక్షితుని జననమునుండి మహాపద్ముని పట్టము వరకు 1015 సం॥ లగును. పరీక్షితుడు జన్మించిన కాలమే కలి ప్రారంభ కాలము. ఈ ప్రకారముగ క్రీస్తుకు 1500 సం॥లకు పూర్వము కలికాల మారంభమైన ట్లెంచవలెను.

వశిష్ఠ, విశ్వామిత్రులు సమకాలికులనుట నిర్వివాదమైనది. వీరిరు పురుమ [పంజాబునేలిన] సూర్యవంశపు రాజగు 'సుదాసు'ని కాలమున నుండిరి. సుదాసుని చే వీరు యజ్ఞముల చేయించిరి. వశిష్ఠుని పుత్రుడు శక్తి, శక్తికి పరాశరుడు - పరాశరునకు వ్యాసుడు - వ్యాసునికి శుకుడు గలిగిరి. వ్యాసుని శిష్యుడే వైశంపాయనుడు. గాధికి విశ్వామిత్రుడు, ఇతనికి మధుచ్ఛందుడు పుట్టిరి. ఈ లెక్కను మహాభారత కారుడగు వ్యాసుడు వైదికఋషి వశిష్ఠుని నాలవ లేక యైదవ తరమువాడని సిద్ధమగు చున్నది. మహాభారతపు రచనాకాలముపై దృష్టిసారించిన నది 'పాణిని' కన్న పూర్వపుదని తెల్లమగును. పాణిని తన వ్యాకరణమున నారవ యధ్యాయములో మహాభారతములోని పాత్రల నుదాహరణముగా వివరించి యున్నాడు. ఆశ్వలాయన గృహ్యా సూత్రములలో గూడ మహాభారతము దాహృతమైనది. ఇటులగుట మహాభారతములోనే యంశములకు సంబం

ధించిన విషయములన్నను నది సూత్రయుగమునకు మొదటిదై యున్నది. ఇంచుమించు దర్శనములును సూత్రయుగములోనివే అయిన మహాభారతమును కూడ దర్శన కాలమున వెలసిన గ్రంథమనిన నభ్యంతరము లేదు. వీనికి మొద లుపనిషత్తులై, ఉపనిషత్తులకు పూర్వము బ్రాహ్మణములై వాటికి మొదలు వైదిక యుగములును వెలసినవి. ఉపనిషద్బ్రాహ్మణ యుగములకు మధ్యకాలమును గుర్తించుట కష్టముగ నున్నది. బ్రాహ్మణములు, ఉపనిషత్తులొకే యుగమునకు జెందినవని విశ్వసించుచున్నాము. బ్రాహ్మణములు కర్మకాండీయులగు - బ్రాహ్మణుల - సాహిత్యమై యున్నవి. అటులే యుపనిషత్తులు జ్ఞానకాండీయులగు క్షత్రియుల సాహిత్యము. ఋగ్వేదము లోని దశమమండలము, అథర్వణ వేదములోని రచనలీ యుగమునకు జెందినవియే. ఈ సమయములనే ఆర్యులు క్షత్రియులు తమలో దాము గొప్పదనమునకై ఘోరముగ పోరాడిరి. చంద్రవంశజులగు రాజులతో 'భృగుముని'కి విరోధముండుటయు, క్షత్రియులకు బ్రాహ్మణులపై వైషమ్యముండుటచే గాబోలు బ్రహ్మవిద్యను గుప్తముగ నుంచవలెననుటకు పెక్కు ప్రమాణములు గలవు. ఈ విషయము మున్ముందు విస్తారముగ జదువగలరు.

ప్రో. అవినాశ చంద్రదాసు, కలకత్తా యూనివర్సిటి లెక్చరార్ - తన "ఋగ్వేదిక్ ఇండియా"లో ప్రకటించిన భావములివి.

"ప్రాకృతికములును, నాకస్మికములును నగు పరిణామములకును, భోజన, వసతి, ఋతు సంబంధములగు పరిస్థితులకును వివశులై 'ఆర్యులు' స్థాన పరివర్తనముల జేయుచు, తిరుగుచుండిరి. హిమయుగ మహాపరివర్తనముల కారణముగ వనౌషధులను, పశువులను స్థానచలనము జేయక తప్పలేదు. నిరంతరము మార్పులకు లోనగు భౌతిక, భౌగోళిక పరిస్థితుల కారణముగ నార్యుల వాస్తవిక స్థానమును గురించి తెలియుట కఠినమైనది. కావున నది సప్తసింధు, ఉత్తరధ్రువము, ఉత్తర ఐరోపా, మధ్యఆశియా, మధ్యఅఫ్రికా మరియు నేదో విలుప్త మహాద్వీపముకూడా కావచ్చును."

ఋగ్వేదపు గొన్ని మంత్రముల నుండి సప్తసింధు ప్రాంతపు జలస్థల విభాగమును గురించి కొంత తెలియుచున్నది. భూగర్భ శాస్త్ర

ములందును చేరి యచట చాలా కాలమువరకుండి, తరువాత క్రమమున వారి సమస్తమగు నుత్తరఖండమును పిదప దక్షిణాపథ ఆక్రమణమును చేసి కొనసాగిరి.

గృహ్య సూత్రములలో వివాహ సమయమున 'ధ్రువదర్శన'మును గురించిన సంగతి కలదు. ఈ ప్రక్రియ నేడును ఆచారమున నున్నది. అయిన వేదములను 'ధ్రువుని'ని గురించిన ప్రస్తావనయే లేదు.

పురాణములు మరియు మహాభారతమునుండి పరీక్షితుని కాలమున సప్తర్షి మండలము 'మఘ' నక్షత్రమున నుండినదని తెలియబడుచున్నది. ప్రాచీన విద్వాంసులకు 100 సంవత్సరములకొకపరి యొక్కొక్క నక్షత్రములో సప్తఋషిమండల ముండుటను విషయముగూడ దృష్టియందుంచెడిది. దీని ననుసరించి కడపటి నందుని రాజ్యాభిషేక సమయమును గుణించి పంచాంగకారులు సమయమున సప్తఋషిమండలము 'పూర్వాషాఢ' నక్షత్రమున నున్నట్లు వ్రాసిరి. ఈ ప్రకారము పరీక్షితుని జననమునుండి మహాపద్మని పట్టము వరకు 1015 సం॥ అగును. పరీక్షితుడు జన్మించిన కాలమే కలి ప్రారంభకాలము. ఈ ప్రకారముగ క్రీస్తుకు 1500 సం॥లకు పూర్వము కలికాల మారంభమైన ట్లెంచవలెను.

వశిష్ఠ, విశ్వామిత్రులు సమకాలికులనుట నిర్వివాదమైనది. వీరిరు పురును [పంజాబుకేలిన] సూర్యవంశపు రాజగు 'సుదాసు'ని కాలమున నుండిరి. సుదాసునిచే వీరు యజ్ఞముల చేయించిరి. వశిష్ఠుని పుత్రుడు శక్తి, శక్తికి పరాశరుడు - పరాశరునకు వ్యాసుడు - వ్యాసునికి శుకుడు జనించిరి. వ్యాసుని శిష్యుడే వైశంపాయనుడు. గాధికి విశ్వామిత్రుడు, ఇతనికి మధుచ్ఛందుడు పుట్టిరి. ఈ లెక్కను మహాభారత కారుడగు వ్యాసుడు వైదిక ఋషి వశిష్ఠుని నాలవ లేక యైదవ తరమువాడని సిద్ధమగుచున్నది. మహాభారతము రచనా కాలముపై దృష్టిసారించిన నది 'పాణిని' కన్న పూర్వపుదని తెల్లమగును. పాణిని తన వ్యాకరణమున నారవ యధ్యాయములో మహాభారతములోని పాత్రల నుదాహరణముగా వివరించి యున్నాడు. ఆశ్వలాయన గృహ్య సూత్రములలో గూడ మహాభారతము ప్రాశస్త్యమైనది. ఇటువంటి మహాభారతములోనే యంశములకు సంబం

ధించిన విషయములున్నను నది సూత్రయుగమునకు మొదటిదై యున్నది. ఇంచుమించు దర్శనములును సూత్రయుగములోనివే అయిన మహాభారతమును గూడ వర్ణన కాలమున వెలసిన గ్రంథమనిన నభ్యంతరములేదు. వీనికి ముందు ఉపనిషత్తులై, ఉపనిషత్తులకు పూర్వము బ్రాహ్మణములై వాటికి మొదలు వైదిక యుగములును వెలసినవి. ఉపనిషద్బ్రాహ్మణ యుగములకు మధ్యకాలమును గుర్తించుట కష్టముగ నున్నది. బ్రాహ్మణములు, ఉపనిషత్తులొక్కటే యుగమునకు జెందినవని విశ్వసించు చున్నాను. బ్రాహ్మణములు కర్మకాండీయులగు - బ్రాహ్మణుల - సాహిత్యమై యున్నవి. అటులే యుపనిషత్తులు జ్ఞానకాండీయులగు క్షత్రియుల సాహిత్యము. ఋగ్వేదము లోని దశమమండలము, అథర్వణ వేదములోని రచనలీ యుగమునకు జెందినవియే. ఈ సమయములనే ఆర్యులు క్షత్రియులు తమలో దాము గొప్పదనమునకై ఘోరముగ పోరాడిరి. చంద్రవంశజులగు రాజులతో 'భృగుమునికి' విరోధముండుటయు, క్షత్రియులకు బ్రాహ్మణులపై వైషమ్యముండుటచే గాబోలు బ్రహ్మవిద్యను గుప్తముగ నుంచవలెననుటకు పెక్కు ప్రమాణములు గలవు. ఈ విషయము మున్ముందు విస్తారముగ జదువగలరు.

ప్రో. అవినాశ చంద్రదాసు, కలకత్తా యూనివర్సిటీ లెక్చరార్- తన "ఋగ్వేదిక్ ఇండియా"లో ప్రకటించిన భావములివి.

"ప్రాకృతికములును, నాకస్మికములును నగుపరిణామములకును, భోజన, వసతి, ఋతు సంబంధములగు పరిస్థితులకును వివశులై 'ఆర్యులు' స్థాన పరివర్తనముల జేయుచు, దిరుగుచుండిరి. హిమయుగ మహా పరివర్తనముల కారణముగ వనౌషధులను, పశువులను స్థానచలనము జేయక తప్పలేదు. నిరంతరము మార్పులకు లోనగు భౌతిక, భౌగోళిక పరిస్థితుల కారణముగ నార్యుల వాస్తవిక స్థానమును గురించి తెలియుట కఠినమైనది. కావున నది సప్తసింధు, ఉత్తరధృవము, ఉత్తర యూరోపా, మధ్యఆశియా, మధ్యఅఫ్రికా మరియు నేదో విలుప్త మహాద్వీపముకూడా కావచ్చును."

ఋగ్వేదపు కొన్ని మంత్రముల నుండి సప్తసింధు ప్రాంతపు జలస్థల విభాగమును గురించి కొంత తెలియుచున్నది. భూగర్భ శాస్త్ర

సిద్ధాంతములద్వారా తెలియుచున్నదేమన తృతీయ యుగమున నేటి రాజపుత్రస్థానము సముద్రముగ నుండెను. 'సాంభార' సరస్సు దీనికవశిష్టమగు సంకేతమైనట్లు తెల్లమగుచున్నది. పంజాబునకు తూర్పున నా సముద్రాంతము గంగాసరస్సునా నుండి యుండినది. ఈ ప్రదేశము హరిద్వార ప్రాంతమున నెప్పటినో యుండి యుండెను. ఈ మాటకు సుమారు 3-4 లక్షల సంవత్సరములై యుండనోపు. ఆర్యులా ప్రాచీన కాలమున నచ్చట నివసించిరి. ఋ. 3.32.13 సూక్త మీవాదమును పుష్టీకరించుచు ఋగ్వేద సూక్తములు 'పూర్వ' మధ్యకాలములందును, తరువాతను రచింపబడినవని తెలుపును.

భూగర్భ శోధనవలన పంజాబు సప్తసింధు ప్రదేశముగ నుండెననియు, ఒక సముద్రముచే దక్షిణ భారతము వేరై యుండెననియు, నీసముద్ర మాధ్యమిక రాజపుతానా ప్రాంతమై యుండి తూర్పున నాసాము వరకును, పశ్చిమమున సింధు సాగరమున నుపనదులు కలియువరకును, వ్యాపించి యుండినది. ప్రస్తుత 'టర్కీ' క్రిందను, నుత్తరమున నుత్తర సముద్రము వరకును, పడమట కృష్ణసాగరము (నల్లసముద్రము) వరకును విస్తరించి యుండినది. నల్లసముద్రము, కేస్పియను సముద్రము, ఆరేబియా సముద్రము బాల్కన్ సరస్సులు దీని భాగములుగ నున్నవి. టర్కీకి తూర్పునొక 'ఏశియాటిక్' భూమధ్య సాగర మండినది. ఋగ్వేద మాచతుస్సముద్రములను సూచించియే, మిగుల ప్రాచీనమగు విషయములు వర్ణించుచున్నది. ఆసమయమున దక్షిణాపథమొక గొప్ప ద్వీపమై తూర్పున బ్రహ్మదేశము నుండి పడమట 'ఆఫ్రికా' ఖండవరకును దక్షిణమున 'ఆస్ట్రేలియా' వరకును వ్యాపించి యుండినది. ఋగ్వేదానంతరమొక ప్రబలమగు భూకంప కారణమున నా ప్రదేశము సముద్రమున మునిగెను. మరియు నచటి యెత్తగు ప్రదేశములు, భారతీయ ద్వీపసమూహము, ప్రశాంతసాగర ద్వీపములు, ఆస్ట్రేలియా ద్వీపములు, మెడగాస్కర్ ద్వీపములు దక్కినవి. అటు రాజపుతానా ప్రదేశము సముద్రము నుండి పైకుబికినది. ఈ కారణమున పంజాబు వాసులకు దక్షిణాపథమునకు త్రోవ యేర్పడినది. 'అగస్త్యుడు, దక్షిణమునకు వచ్చి సముద్రము నాపోశించి; వింధ్యపర్వతమును స్థిరము జేసెనను పురాణ గాథకు ఈ మహత్వపూర్ణమగు ఘటనయే కారణముగా

నోపును. పర్వవిధముల ఋగ్వేదకాలమున 'గాంధార' మును వదలి సప్తసింధు (పంజాబు) ప్రాంతము నలుగడలను సముద్రముచే చుట్టబడి యుండెడిది. ఆ కాలమున పశ్చిమ ఆసియా మరియు నాసియా మైనరులతో గాంధారమునకు సంబంధ ముండెనది.

దక్షిణ మహాద్వీపమున సముద్రమున మునుగుటయు, రాజపుత్ర స్థానము పైకి వచ్చుటయు సంభవించి నప్పుడే 'శతపథ' బ్రాహ్మణము, మరియు 'బైబిలు' లో వర్ణింప బడిన మహాజల ప్రళయమై యుండును. దానినే 'మను' ప్రళయ మనియు 'నూహు' జల ప్రళయ మనియూ నందురు. అట్టితరి ఆర్యులు హిమాలయముల పైభాగముల కెగబ్రాకుట తప్పని సరియై యుండును. మరియు హిమాలయములపై నా మహాసాగరపు కిపరి మిత బాష్పకణములే మంచై కురిసి సంచయింపబడి యుండును. ఇట్టిసరిటి వలననే నా ప్రదేశమున జనుల యునికి కష్టమై చిన్నచిన్నగ వారు క్రిందికి రాసాగి యుండురు. ఆర్యులు పాంచాల, కోసల, విదేహ, అంగప్రదేశ ముల వరకును, తిన్నగా నడచివచ్చిన కాలమిదియే యైయుండెడి.

ప్రాచీన సప్త సింధుప్రదేశమున 'సరస్వతి' చాలా గొప్ప నదిగ నుండినది. అది మిక్కిలిగ ప్రాంగుచుండినది. ఈ ప్రదేశమున నాలుగు నెలల వరకు వర్ష ఋతువుండెడిది. వర్ష ఋతువును 'చాతుర్మాస్య' మని యిప్పటికిని యనుచున్నాము. రాజపుతానము సముద్రమునుండి బయల్వెడలుటయు గంగాసరస్సు నష్టమగుటయు, కారణములుగ సప్తసింధు (పంజాబు) ఉష్ణ దేశమై వానల గోల్పోయెను. ఋగ్వేదమున వర్షమును మొదట 'హిమ' మనియు, పిదప 'హేమంత' మనియు, నాపై 'శరత్' నియు వర్ణించిరి. ఇట్లనుటకు చాలా వరకిదియే కారణమై యుండును.

ఋగ్వేదమున 'కీకట' ప్రదేశ వర్ణనము కలదు. "ఈయనార్య కీకటములో నావులేమి మేయగలవు" ఆర్యులుత్తర దక్షిణ పూర్వయాత్ర చేయునవసరమున గంటబడిన యొక యూనవర ప్రదేశమే 'కీకటమై' యుండును.

ఈభౌగోళిక మహాపరివర్తనా నంతరమే ఆర్యులు సుదీర్ఘములగు యాత్రలకై సాహసించిరి. ఒక కొండకైలాసా యొక్క మిక్కిలి పడమటి

ప్రాంతము చేరిరి. మరికొందరు 'కిరాను' లో నివసించిరి. అయిన వారు దక్షిణ ప్రాంత ప్రదేశములకు ఆలస్యముగ జేరిరి. సముద్రము వెనుకకు జరిగినను నాటికిని చాలా కాలము వరకు యాత్రకును, నివసించుటకును యోగ్యముగ నుండక పోవుటయే దీనికి కారణమై యుండును.

ఋగ్వేదము, సముద్ర వ్యాపారము నెఱపిన 'పణి' యను నొక తెగను గురించి తెలుపుచున్నది. ఇది తప్పక ఋగ్వేదపు టుత్తర కాలమున క్రొత్తగా కుదురుకొనిన తెగయై యుండును. ఈ తెగవారు గొప్ప కళా కౌశలురును, మిక్కిలి యాశాపరులుగ నుండిరి. 'వడ్డీ' నెక్కువ గొనుచుండిరి ఋగ్వేదపు గొన్ని సూక్తములలో వీరికృత్యములను నేవగించుకొని వీరితో యుద్ధము జరిపిన సన్నివేశము లభివర్ణితములైనవి. వీరిని దోపిడిగాండ్రనియు తలచుచుండిరి. నేను చాలా మొదలనుండి నమ్ముచుంటిని 'ఇరానీ' స్త్రీపురుషులే చాలామట్టుకు 'పణి' జాతికి జెందినవారుగ నుందురు. వీరి యాచార వ్యవహారములను జూచిన కొంతకుగొంతవరకైనను ఋగ్వేదపు 'పణి' జాతి జ్ఞాపకమునకువచ్చును. వీరు యుద్ధములకోర్వక నావికులై సముద్రముపైననే నివసింపసాగిరి. కొన్నాళ్ళకు రాజపుత్రానాభాగము ఋతుల్యదశా వారు గుజరాత్, మలబారు అందచ్చటచ్చట నుండ మొదలిడిరి. వారికచట నోడలుకట్టుటకు వలసిన కలప లభించుచుండినది. వీరే 'మెసొపొటేమియా' యందుండి 'బాబిలోనియా' సామ్రాజ్యమును స్థాపించిరి. వీరు 'మధ్యధరాసముద్ర'పు టొడ్డునగల 'సీరియా'కును జేరిరి. వాస్తవముగ నీజాతియే ఐరోపా యితిహాసమునకు గారణమై మెసొపొటేమియా, ఈజిప్టు ఫొనేసియా, ఉత్తరాఫ్రికా మరియు స్పెయినులలోను వలసదేశముల స్థాపించెను.

ఆకాలమున మధ్యఆసియా నీటిలో మునిగియుండెను. కావున 'ఏషియా మైనరు'లో నైరోపా దేశమునకు పోవుటకొక్కటేత్రోవ 'పొంట్స్-బాస్ఫరస్ భూసంధి'యే యుండినది. ఆర్యులీత్రోవన నచటికిజని 'సెమిటిక్' జాతిని సృష్టించిరి. ఈమాట నొప్పుకొనుటకు కొన్నియో కారణములు గలవు. ఈ కాసియులు విశుద్ధముగ 'నార్యు'లే. ఆర్యసంస్కృతి చిహ్నములీనాడును ఈరానునందుగలవు. ఆర్యుల స్వర్గముల పేళ్ళచ్చటి నగరముల కీయబడినవి.

బ్రాహ్మణులచే సాడంబరముగ జరుపబడు యజ్ఞములకు మాత్రము వీరు విరుద్ధముగ నుండిరి. వీరు కేవలము ప్రాచీనపద్ధతిపై "గార్హపత్యాగ్ని"ని మాత్రమే - నేటివలె - రాజుచుట కిష్టపడుచుండిరి. యుద్ధముల జేయుచు, సామ్రాజ్యముల స్థాపించుచు పోవుచున్న మొదటిసంఘ మందరు యజ్ఞములలో పశువధ: 'సోమరసపానము'ల ప్రచారమొనర్చుచు సాగినది. ఈ రెండుపనులును రెండవపట్టువారి కనిష్టములైయుండినవి. ఈ కారణమున వారిలో వైమనస్యముతోపాటు జగడములు, రక్తపాతము జరిగినవి. వీరు యజ్ఞము లాచరించువారని కోపముతో "సుర" అనియు - కలుప్రాప్రు వారనియు బిలువ, వారును వ్యంగ్యముగ 'అసుర' అని వీరిని బిలువసాగిరి. ఈ దేవాసురసంగ్రామములు పురాణములలో మిక్కిలిగ నభివర్ణితములై యున్నవి. చివరకసురులు తమ స్థలమునువదలి "పరషియా"లో గొప్పగొప్ప సామ్రాజ్యముల స్థాపించిరి.

క్రీ. శ. 1907లో ఏసియా మైనరు ప్రాంతమందలి 'బోగజె' అను గ్రామమున భూమిని త్రవ్వగా కొన్ని వ్రాయబడిన ఇటుకలు దొరికినవి. వీనిలో రెండు 'టిటానియా' రాజగు 'సుపిత్సహ్యానక్' మరియు మెసొపొటేమియారాజు "మితిఊజ్వ"ల నడుమ జరిగిన సంధిపత్రములు. ఈ రెండు సంధిపత్రములును క్రీస్తుకు 1400సం॥ల పూర్వపువి. వీటిలో నుభయ దేశస్థులును దమతమ కులదేవతా ప్రార్థనలజేసి ప్రాచీన 'మితానీ' రాజు 'మిత్ర' వరుణ, ఇంద్ర, నాసత్యద్వయ (అశ్వినీ దేవతలు) వైదిక దేవతలను ప్రార్థించెను. ఇది క్రీ. 1400 సం॥లకు పూర్వము మెసెపొటేమియా (మితానీ) జనులలో వైదికదేవతలపై భక్తిగౌరవములు, వారి విషయిక జ్ఞానముండెనని తెలియుటకు ప్రబల నిదర్శనముగ నున్నది.

దక్షిణ ఐసస్తములోని 'తేశెల్ అర్మనా' అనుచోట వెన్నిమో లేఖలు దొరికినవి. వాటిలో పడమటి ఆశియారాజులు 'ఫెరో'కు వ్రాసిన వెన్నిమోకలవు. ఈ రాజుల పేళ్లు 'ఆర్య'లని వ్రాయబడినవి. దీనివలన గూడ క్రీస్తుకు 16, 15 శతాబ్దముల కిందముత్తర మెసొపొటేమియా మరియు సిరియాలలో వైదికధర్మమే అంతటను ప్రాకియుండినది. 'బాబిలోనియా' తూర్పులోనున్న 'కసాఈట్' జాతివారి ఇలవేల్పు పేరు 'సూర్యాస్'. ఈరానీ శాఖనుండి భారతీయశాఖ విడివడుటకుముందే మితాని

మరియు పడమటి ఆశియాలో ఆర్యులు పరస్పర సూర్యసాహిత్య, సంస్కృతులనుండి దూరస్థులైయుండిరి. ఆ సమయముననే ఆర్యుల 'స' వర్ణము ఇరానీ 'హ'గ మారినది. ఈ 'హ' వర్ణమును తార్తారహూణులు, శకులు భారతమునకు తమ దండయాత్రలతో పాటు ప్రవేశపెట్టిరి. 'మాళవ' సింహాసీనుండై విక్రమాదిత్యుడు వారిని తరిమినను వారి 'స'కు బదులు వచ్చిన 'హ' మాత్రమింతవరకును శకవంశీయులగు రాజపుత్రులయందు, నచటి సామాన్యప్రజల యుచ్చారణమందును నిలిచియున్నది.

'చాల్డి'యులతో భారతీయుల పరిచయము, తత్పరిణామమును 'అథర్వ' వేదమున స్పష్టముగ గన్పించుచున్నవి. ప్రాచీన వైదికఋషులు విశ్వ కల్యాణ ప్రదులగు దేవతలనుపాసించుచుండిరి. ఋగ్వేదములో నీవిషయము స్పష్టము. అయిన 'చాల్డియా' నివాసులు మాత్రమమంగళప్రదులగు దేవతలనే యుపాసించుచుండిరి. వారింద్రజాలాది విద్యలనుపయోగించుచుండిరి. ఈ యింద్రజాలాదిక విద్యనుసరించియే అథర్వణమున మనకు తెలియుచున్నది. 'త్రయీ'అను ప్రసిద్ధ శబ్దములో నుండి తెలియునదేమన తొలుత వేదములు ఋక్, యజు, స్సామములని మూడు మాత్రమేయుండెను. తరువాత నథర్వణము సంగ్రహింపబడినది. అయిన బ్రాహ్మణములు, ఉపనిషత్తులలో దీని గురించి వ్రాయబడియున్నది. దీనివలన నది 'త్రయీ'కన్న నాధునికమైనను నదియు మిక్కిలి ప్రాచీనమైనదే.

సాయణుడు నాలుగువేదములను ఒప్పియున్నాడు. వేదములు మూడేఅను విషయమును «తస్మాత్ సర్వహుత ఋచస్సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత» అను శ్లోకము వివరింపబడుచున్నది. ఋ. 8-4. దీనిలో మూడువేదముల వివరమే యున్నది. అయిన సాయణుడిద్దానిని ఖండించెను. అతడు 'ఛందాంసి' యనుదాని నథర్వణ వేదమునకే గ్రహించెను. 'ఛాందోగ్యోపనిషత్తు'లో నారదుడు 'సనత్కుమారు'లతో నిట్లనెను. 'ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మథర్వణం చేతి,' 'తాపనీయోపనిష'త్తులో కూడ అథర్వణ వేదమునుగురించి కలదు. 'ఋగ్యజుస్సామాథర్వణశ్చత్వారో వేదాః సాంగాస్స

శాఖాశ్చత్వారః పాదాభవన్తి' గోపథ బ్రాహ్మణమునను [3-2] 'అథ త్వాంగిరోమి బ్రహ్మత్వం' నుండి బ్రహ్మజ్ఞాన కారణమిదే వేదమని చెప్ప బడినది. ఈ వేద ప్రసిద్ధశాఖలను గురించి వ్రాసిన గ్రంథములలో సుల్లేఖింప బడినవి. పైప్పలాద, శౌద, మౌద, శౌనకీయ, జాజల, జలద, బ్రహ్మపద, దేవదర్శ చర్ణ, చైద్యములు అనెడి శాఖలుగ చెప్పబడినవి. సాయణు డథర్వణమును మాని మూడు వేదములకును నీ లక్షణములు చెప్పి యున్నాడు.

"చరణ విభాగపూర్వకములగు ఛందోబద్ధములగు మంత్రములున్న ఋగ్వేదము. గీతాక్రమమున నున్న మంత్రములు సామవేదములు. వృత్త గీతికలకన్న భిన్నములగు మంత్రములుండిన నదియజుర్వేదము."

బ్రాహ్మణములను వేదాంతర్గతములను సాయణు డొప్పుకొనెను. దీనికై యితడాపస్తంభ సూత్రములలోని యీయుదాహరణము నిచ్చుచు న్నాడు. "మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామధేయం" బ్రాహ్మణ ములలో రెండు భేదములున్నవి. 'విధి' మరియు 'అర్థ' వాదములు. విధులు రెండురకములు. ఏ కర్మలయందు స్వాభావికముగ జనుల ప్రవృత్తి యుండదో అట్టివాటికై వారిని ప్రవృత్తి పరులుగ జేయునదే విధి. అజ్ఞాత జ్ఞాపనము రెండవ విధి. అద్వితీయ సత్యజ్ఞాన స్వరూపుడగు బ్రహ్మ మొక్కడే. ఇదియే యితర ప్రమాణములచేతను తెలియరానిది. 'అర్థవాదము' 'విధి' వాక్యములను పొగడును. జనులా కర్మ ప్రశంసలవిని వాటిని జేయుటలో ప్రవృత్తుల జేయుటయే యీ ప్రశంసయుద్దేశము.

"వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" వాయువు మిక్కిలి శీఘ్రగామియగు దేవుడు. వాయువుయొక్క ఆ ప్రశంసవలన వేద మతడని దైవతముగనున్న కర్మవైపు జనులధ్యానము మరల్చుచున్నది.

సాయణుడు వేదమపౌరుషేయమని యొప్పుకొనును. అయిన నపౌరు షేయమను దానికర్థమేమన వేదములను మనుష్యులు వ్రాయలేదు. ఈశ్వరుని కృతియని తన "జైమినీన్యాయమాలలో" సాయణుడు వ్రాసినదేమన వేదశాఖలు కాఠకము, కౌము - తైత్తిరీ యాదులు ఋషుల పేళ్లతో

ప్రసిద్ధములైనవి. అయిన నవి ఋషికృతములేల కావు? దీనికి వారను నదేమన ఋషులాయాశాఖలను శిష్యులకుపదేశము మాత్రముచేసి సంప్రదాయమును నడపిరి. సాయణు డిట్లనుచున్నాడు:- "పౌరుషేయం నవా వేదవాక్యం స్యాత్పౌరుషేయతా। కాఠకాది సమాఖ్యానా ద్వాక్యత్వాచ్చాన్య వాక్యవత్। సమాఖ్యానంతు ప్రవచనాద్వాక్యత్వంతు పరాహతం। తత్కర్త్రనుపలంభేన స్యాత్తతోఽ పౌరుషేయతా॥" ఇట్టిచోట సాయణుడనున దేమన:

పరమాత్మాతు వేదకర్తాఽపి నలౌకికః పురుషః। యథావాల్మీకి వ్యాసప్రభృతయోః తత్తద్గ్రంథ నిర్మాణావసరే కైశ్చి దుపలబ్ధాః అన్యైరప్యవిచ్ఛిన్న సంప్రదాయే నోపలభ్యంతే। నతథా వేదకర్తా కశ్చిత్పురుష ఉపలబ్ధః॥

సాయణుఁడిట్లు కూడ నభిప్రాయ పడుచున్నాఁడు. వేద ధ్వనినుండి జగత్తుయొక్క నిర్మాణమైనది. ఈ విషయమున సాయణుఁడు - మనుష్యుఁ డేదైన పని చేయుటకు ముందు మొట్టమొదలు వాచికముగ ననుకొనును-కుమ్మరి పాత్రలను చేయుటకు పూర్వము కుండల పేర్లను తలచుకొనును. ఆ ప్రకారమే సృష్టికర్త కేవలము నామ మాత్ర స్మరణ చేతనే విశ్వమును సృజించెను. వేదములు నిశ్వసితములని అనుటకు నిదే యభిప్రాయము నొసంగెను.

దీనిపై సంశయమేమనగ ప్రళయ కాలమున ప్రపంచమంతయు నాశమగును. సూర్య చంద్రాదులు పదార్థములుగ నుండనప్పుడు శబ్దమెట్లు నుండును? మరల సృష్టిసమయమునందే క్రొత్త శబ్దములు పుట్టునేమో. అయిన శబ్దార్థముల నిత్య సంబంధము వేదములతో నెట్లు పొసగును? వేదాంత సృష్టిలో సాయణుఁడు దీనికి మహా ప్రళయావసరమున అంతఃకరణముల ప్రవృత్తులు స్ఫురించునట్టిస్థితిలో నుండకపోయినను వాటిసత్త్వము మాత్రము వాటిలో ద్యోతకమగుచుండును. సూక్ష్మశక్తిరూపమున కర్మలలో నణగియున్నట్టి అవిద్యతో పాటువియు దాగియుండునని బదులు చెప్పుచున్నాఁడు. మనువుకూడ నిట్లే తలచుచున్నాఁడు.

"ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణం।
అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః"

తావేలు దేహమునుండి కామలు నవయానములవలె జీవుల సూక్ష్మస్థానములు సృష్టిలో జ్ఞాపకములగును. కర్మవాసనల ననుసరించియే జీవోత్పత్తి యగును. జన్మాంతర స్మారకమున పూర్వవాసన మరియు శాస్త్రల సంబంధము, శబ్దార్థములు సంబంధములైయున్నవి. దీనికలన వేదములు నిత్యమని తెలియుచున్నవి.

శ్వేతాశ్వతరోపనిషత్తులో నిట్లున్నది.

“యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై । తంహి దేవమాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే” 1. శే. 6. 18.

అగ్ని, వాయు, సూర్యులు క్రమముగ ఋగ్యజుస్సామములైరని ఐతరేయ బ్రాహ్మణమున గలదు. “ఏవాగ్నేరజాయత యజుర్వేదో వాయోః సామవేద అదిత్యాత్.”

దీనికి సాయణాచార్యులు:-

“నచ జీవ విశేషైరగ్ని వాయ్వాది త్యైర్వేదానా ముత్పాదితత్వం। ఈశ్వరస్యాగ్న్యాది ప్రేరకత్వేన నిర్మాతృత్వాత్॥” ఋ. భా. 3. అని చెప్పియున్నారు.

వేదార్థమెల్లని గురించి నేను బ్రాహ్మణములు, రెండు కల్పసూత్రములు (ఆపస్తంభ - బౌధాయనములు), మీమాంస, వ్యాకరణాదుల సహాయమున వేదమున కర్థమును వ్రాయుదును.

ఇదే క్రమమును పాటించి యజుర్వేద భాష్యము పూర్తిగా వ్రాయబడినది. ఋగ్ సంహితా భాష్యానుక్రమణిక నిరుక్త, వ్యాకరణ, బ్రాహ్మణముల నుదాహరించియు సంశయాస్పదములగు చోట్లలో ననేక ప్రమాణమంత్రముల సులభ, నిశ్చితార్థములు వ్రాయబడియున్నవి. శ్రౌత సూత్రములు, బ్రాహ్మణములలో ఋగ్యజుస్సామ వేదమంత్రము లేయే యజ్ఞములలో, నేసమయమున, నేరూపమున నవసరమగునో నిర్దిష్టములైనవాటిని సాయణుడేమాత్ర ముల్లంఘించక అర్థమును వ్రాసెను. ఇతర భాష్యములలో

ఋగ్వేదభాష్యమతి ప్రశంసనీయము ఋగ్వేదభాష క్లిష్టమైనది. సాయణునికన్న ముందున్న యాస్కుడు తప్ప మరెవరును ఋగ్వేదమునకు భాష్యమును వ్రాయరైరి. నిరుక్తములోని కొన్ని మంత్రముల విషయమునను నిష్టేయపోహ కలదు. సాయణుడే యందరికన్న తొలుత నిట్టి ఘనకార్యమును జేసెను.

నిరుక్తములలోని కొన్ని మంత్రముల వ్యాఖ్యానమునుండియు, కుమారిల భట్టకృత 'తంత్రవార్తిక' ములో గొన్ని వైదిక వ్యాఖ్యానముల వివరణముల నుండియు వేదమంత్రముల యర్థము అధిదైవికాధి భౌతికాధ్యాత్మికములై యుండునని తెలియుచున్నది. గీతలోగూడ దీని ప్రసక్తి కలదు.

“అక్షరం బ్రహ్మ పరమం స్వభావోధ్యాత్మ ముచ్యతే। అధిభూతం క్షరోభావః పురుషశ్చాధి దైవతం॥” ౮. ౩.

సర్వస్థితుడగు బ్రహ్మమునధ్యాత్మమనియు, పృథివ్యాద్యులధి భూతము లనియు, సూర్యచంద్రాదులధి దైవతములనియు చెప్పబడెను. సాయణుడు ఋక్సంహితా భాష్యములోని ప్రథమ మంత్రమున “మంత్రమునుండి తెలియునట్టిదే వేద”మని చాటియున్నాడు. అతోదివ్యతే ఇతిదేవః మంత్రేణద్యోత్యతే ఇత్యర్థః. ఆయన సాయణుడు స్పష్టముగ నధిదైవార్థమునే గ్రహించియున్నాడు.

వేదనిర్మాణ మార్యావర్తములోనే జరిగినదని కలకత్తాలోని సుప్రసిద్ధ వేదాంత పండితుడగు సత్యవ్రత సామశ్రమీ యభిప్రాయమై యున్నది. వీరు తమ వాదమును బలపరచుటకై యొసగిన ప్రమాణములిచట నుస్మృతము లగును. వారు ఋగ్వేదములోని 5. 53. 9. మంత్రము అతి ప్రాచీనమగు నార్యావర్తమును వర్ణించుచున్నదని యనుచున్నారు. ఈ మంత్రములో రసా, కుభా, క్రుము, సింధులను నాలుగునదుల వర్ణనలున్నవి. ‘రసా’ యుత్తరపు గొప్పనది; కుభా, దీనినే ‘కాబూలునది’ యనిపిలుతురేమో; పడమటనున్నది. ‘సరయూ’ తూర్పునను; సింధు దక్షిణముననుదాని ఎల్లలు. ఋగ్వేదము 10-75 లో 21 నదులపేర్లు గలవు. ఇరువదియొక్క నదులుగల దేశమార్యావర్తమే. వీరపూర్వులు వేదమంత్రములను కూడ నుదాహరించిరి.

# వేద వాఙ్మయము

౨

## ఋగ్వేదము :-

ఋగ్వేదములో పదివేలకుమించిన ఋక్కులతో నొప్పు 1028 సూక్తములు కలవు. ఈసూక్తములు పది మండలములలో విభక్తములైనవి. ఇవి ప్రార్థనామయములు. వీటిలో నాద్యంతమండలముల వదలి తక్కిన మండలముల కొక్కొక్క ఋషి కర్తగా నొందఱి యభిప్రాయమై యున్నది. రెండవమండలమునకు 'గృత్సమదు'డును, మూడవదానికి విశ్వామిత్రుడును నిట్లే 4 నుండి 9 వరకు వరుసగా వామదేవాత్రి భరద్వాజ వశిష్ఠ కణ్వాంగిరసులును ఋషులుగనున్నారు. మొదటి మండలమునందలి 191 సూక్తములలో నొక్కొక్కటికో దప్ప తక్కినవాటికి 15గురు ఋషులున్నారు. పదవమండలమున గూడ 191 సూక్తములుగలవి. అసంఖ్యాకఋషులచే నొప్పుచున్నది. ఋగ్వేద క్రమసంగ్రహములు పౌరాణికయుగమునకన్న ముందె జరిగినట్లు బోధపడుచున్నది. ఐతరేయారణ్యకమున [2.2] మండలక్రమమును ఋగ్వేదఋషుల పేర్ల వ్యుత్పత్తుల గల్పించి చెప్పుచు సూక్తములు, ఋక్కులు, అర్ధఋక్కులు, పదములు, అక్షరముల లెక్కలే తెలుపబడినవి. దీని వలన తెలియునదేమన పురాణకాలారంభమున నెక్కువ సావధానచిత్తులై దాటి భాగోపభాగము లను ఋగ్వేదపు ప్రత్యేకఋచా శబ్దాక్షరముల లెక్కలను పూర్తిజేసిరి. ఈ లెక్క ప్రకారము ఋక్కులసంఖ్య 10402 నుండి 10622 వరకును, శబ్దములసంఖ్య 1538260 మరియు నక్షరములసంఖ్య 4320000 కలవు.

ఋగ్వేదమును జూచినయెడల - యే యాచార్యుల యభిప్రాయము లచేగాక - ఋగ్వేదపు మధ్యకాలమున నార్యులు సింధు లేక సరస్వతీ నదీతీరమువరకును వ్యాపించియుండిరనునది తేటపడును. ఉత్తరాపథమునను వారు గంగయొడ్డువరకు విస్తరిల్లగలిగిరి. నగరములుగాని, నాగరికతగాని లేకుండినవి. అయిన వారి జీవితవిధానములలో నత్యుత్కృష్టమగు సభ్యత తొణికిసలాడుచుండినది. కుటుంబపద్ధతి మరియు పితయే దానికి యజమానిగా భావింపబడుటయు వాడుకలోనుండినవి.

4. ఓ సునాశీరులారా! ఈ సూక్తమును స్వీకరింపుడు. ద్యులోకమున మీరు కలిగించిన మేఘము పృథ్విపై జలముల వర్షింపనీ.

5. ఓ సౌభాగ్యవతీ సీతా! (నాగేటి కఱ్ఱు) ముందుకు నడుపుము. మాకు ధనధాన్యము లిమ్మని నిన్ను ప్రార్థించుచున్నాము.

6. నాగేటి కఱ్ఱు సంతోషముతో భూమినిదున్ననీ, జనులానందముతో నెద్దుల వెనువెంట నడతురుగాక. పుడమిని పర్జన్యుడు తడుపుగాక, ఓ సునాశీరులారా! మాకు సుఖముల నిండు. (4. 57)

7. నాగళ్లు గట్టుడు. బాగుగా దున్నుడు. విత్తనముల నిత్తుడు. సూక్తములతో పాటు ధాన్యములు పండనీ. చుట్టుపట్టుల చేలలో హంసలు విహరింపనీ.

8. పశువులకు తగిన కొట్టములు తయారైనవి. ఎప్పుడు నిండని బావులు త్రవ్వబడి తోలు బొక్కెనల తోడుడు, పోయుల తోడను నీరు సులువుగా తోడబడుచున్నది. నీళ్లు తోడుకొనుడు.

9. గుఱ్ఱముల చల్లబుచ్చుడు. రాశి చేయబడిన ధాన్యములను బండ్లతో నించికొని తెండు. పశువులు త్రాగుటకై నిండియున్న నీ బావి యొక్క ద్రోణము వెడల్పుగలదు. దీనిలో జాతి గిరక యొకటి కలదు. మనుష్యులు త్రాగుటకైయున్న నీ కుండ యొక్క స్కంద ప్రమాణము గలదు. దీనిని నీటితో నింపుడు. (10-01)

పైన చెప్పబడిన ఉదాహరణములచే నప్పుడు వ్యవసాయము మిక్కిలి ప్రచారములో నుండినదని తెలియుచున్నది. మం 12. సూ 68. ఋ 1. లో సంకషి చేసి పిట్టల లేపుటయు, మం 10. సూ 99. ఋ 4. లో కాలువల ద్వారా పొలములకు నీరావరి చేయుట వర్ణింపబడినది. గోవులను మేపుట, పశువులను సాకుట, దొంగలు, దోపిడికాండ్ర సంగతులును గలవు క్రయవిక్రయ వర్ణనలు గలవు.

"మొదట చాలా వస్తువులను తక్కువ ధరలకమ్మి మరల కొన్నవాని నుండి ఎక్కువ వెల తీసికొను వాసచే నెవడైన కలహించిన, నిర్ధరింపబడిన

వెల కధికముగ వాడు తీసుకొనబోలడు. [4-24-9] మం ౭, సూ 27 లో బంగారు నాణెములను గురించియు గలదు. 'నిష్కము'ను శబ్దము వీటికి వాడబడెడిది.

పూర్ణయౌవనావస్థలోనే వివాహములు జరుగుచుండినవి. వివాహోత్సవములలో కన్యయింటియందే యెక్కువ ఆడంబరము. వధూవరులు వేదికపై గల యగ్నిని ప్రదక్షిణించు చుండిరి. మరియు ఱాతిపై [సన్నికల్లుపై] వారి పాదము లుంచబడుచుండెను. పెండ్లి ముగిసిన తరువాత సాలంకృత వధువును తెల్లని పూలతో నలంకరింపబడిన తెల్లయెద్దుల బండిపై కూర్చుండబెట్టి వరుడు తనయింటికి గొనిపోవుచుండెను. పెక్కు రాడువారు ముసలితనమువరకును కన్యత్వమునే కలిగియుండిరి. పుత్రహీనులుగ నుండుట దౌర్భాగ్యమని తలచ బడుచుండెను. దత్తపుత్ర విధానముండినది. ఆడబిడ్డల కన్న మగబిడ్డలపై ఎక్కువ యభిమానము గలిగియుండిరి.

'వ్యభిచారము' గర్హ్యము, మహాపాపమునై యుండెను. దొంగిలించుట దుష్కర్మము, ఆవులు తరుచు దొంగిలింప బడుచుండెను. చోరులు బంధింపబడి దండింప బడుచుండిరి, జూదమాడుచుండిరి; అయిన నుత్తములు మాత్రము దాని నేవగించు కొనుచుండిరి.

తరుచు వస్త్రములు చుట్టుకొనుటకును, కప్పుకొనుటకును యోగ్యములై యుండెను. అవి యున్నితో నేయబడి వాటపై వన్నెలు చిత్రింప బడుచుండెను. జరీ అంచు గుడ్డలును నేయబడుచుండెను.

స్త్రీ పురుషులు శిరోజముల బెంచుకొనుచుండిరి. 'శతదతీ', 'కంకతికా' అను సాధనములు కేశవర్ధకములుగ నుండినవి. సుగంధ ద్రవ్యములచే కేశములలదబడు చుండెను. 'వాశిష్ఠులు' తమ జడల కుడివైపు ముడివైచుకొనుచుండిరి. స్త్రీలు వెండ్రుకలను విరియ బోసుకొనుచుండిరి. 'రుద్ర', 'పూష'లు కేశ విన్యాస ప్రవీణులు. ఉత్సవములలో దండలు, పేరులు వేసికొనుచుండిరి. పురుషులు గడ్డములు బెంచుచుండిరి. వీరికి క్షీరములు ముఖ్యాహారముగ నుండినవి. పాలతో నన్నము వండి భుజించుచుండిరి. సోమరసము నప్పుడప్పుడు పాలతో గలిపి త్రాగుచుండిరి, ఘృతము మిగుల ప్రియమైనది.

వరి చేలాలు విసరి యవ్వాపములు చేయుచుండిరి. ఫలములను ఖాద్యములై యుండెను.

వంటకు మట్టి, లోహపాత్రలును, త్రాగుటకు కఱ్ఱతో చేయబడిన పాత్రలు వాడబడు చుండెను. వారు నేతగాఁడుచుండిరి. ధనుర్బాణములు ముఖ్యములు. హరిణముల వలల చేతను, పక్షుల నురులచేతను పట్టుకొనుచుండిరి. పందులను కుక్కలచే దరిమి పట్టుచుండిరి. లోహకారుడు, చర్మకారుడు, చాపలల్లువారు, గుడ్డలు నేయువారుండిరి.

రథక్రీడ, ద్యూతక్రీడ, నర్తనాదికములు వీరికి వినోద సాధనములు. స్త్రీలలంకరించుకొని నృత్యములలో పాల్గొనుచుండిరి. (10.76.6) వాద్యములలో దుందుభి, వాణవీణాధికము లుండినవి.

భోజనమునకు ఋగ్వేదములో 'యవ', 'ధాన్య'ము లెక్కువగ నుపయోగింపబడినవి. నేడు సంస్కృతమున 'యవ' శబ్దమును యవల కుపయోగించినట్లే, నాడు గోధుమలకును, ఎడ్లకు నుపయోగింప బడుచుండెను. అన్నమునకూడ 'యవ' శబ్దముతో ఏకమయినది. 'ధాన్య' శబ్దము 'బియ్య'మను నర్థమిచ్చినను వేదమున నేటి యర్థమున వాడబడినది. 'వ్రీహి' (వరిని) గురించి ఋగ్వేదమున నెచ్చటను ప్రసక్తిలేదు. పలుతెరగుల రొట్టెలను గురించి 'సక్తు', 'పురోడాశ', 'అపూప', 'కరంభ' రూపములు– (మం 3 సూ 52 ఋ 1-2, మం 4 సూ 14 ఋ 7 లో, గానవగును.

మాంసాహారమును గురించిన ప్రకరణముకూడ వేదములో గలదు. ప్రాచీనకాలమున నార్యులు మాంసమును భుజించుచుండిరాయను ఘోర సందేహము తొలగిపోవును. ఆ కాలమున వారు గడపిన జీవితము ననుసరించి యిది స్వాభావికమే. ఋగ్వేదపు మం 1. సూ 61 ఋ 12. మం 2 సూ 7 ఋ 5; మం 5 సూ 29 ఋ 7. 8; మం 6 సూ 17 ఋ 11; మం 6 సూ 16- 47; మం 6 సూ 28 ఋ 4; మం 10 సూ 27 ఋ 2; మం 10 సూ 39 ఋ 14 లలో పశువధ్యస్థానముల వర్ణనలు కలవు. ఈ మంత్రములు నానార్థ ప్రతిపాదకములగుటయు సత్యము. అంతగా వేదపక్ష పాతము వహింపక మన పూర్వజుల మాంసాహారము సేవగించుకొనక నిజ

మాను పరిశీలించినచో పశువుల, మాంసాహారములకు సంబంధించిన యర్థ మొప్పుకొనక తీరదు.

ఋగ్వేదపు మొదటి మండలములోని 162వ సూక్తములో చిత్రముచే గుఱ్ఱము పైభాగమున గురుతు చూపగా దానిని కోయుటయు, నంగాంగముల వేరు చేయుటయు నుల్లేఖింప బడినవి.

వారు వాడుకొను వస్తువులలో సోమరసము మత్తు పదార్థమొకటి. ఋగ్వేదములో నొక మండలము పూర్తిగా దీనిని గురించియే వర్ణించును. ఈ సోమరస కారణముగ నీరాన యార్యులకును, భారతీయార్యులకును కలహములు జరిగినట్లు తెలియుచున్నది. (జెండావస్తాలో నీలతను గురించిన హోమప్రశక్తి అందందు కలదు. ఆర్యులు, ఈరానియులు వేరు వేరు గుంపులుగనుండి సురాసురలని పేరొందుటకు నీ సోమపానమే ముఖ్య కారణమైనది. వారీ సోమలతను బండపై నలుగగొట్టి యున్ని బట్టలో వడియబోసి పాలుగలిపి త్రాగుచుండిరి. ఈ మాట ఋగ్వేదపు 9వ మండలములో కలదు.

గుఱ్ఱల నేతవిషయము మం 2 సూ 3 ఋ 6; మం 2 సూ 38 ఋ 4 లలో గలదు. మం 10 సూ 26 ఋ 6 లో ఉన్ని నేసి వస్త్రమేయు దేవతను 'పూషణ' యని పిలచిరి. మం 1 సూ 161 ఋ 4 లో నడవుల తగులబెట్టి సేద్యమునకు గ్రామముల నేర్పరచుకొనుటకు సనువగు వర్ణనలు గలవు. వడ్రంగి పనితనమును గురించిన వర్ణన మం 3 సూ 53 ఋ 19; మం 4 సూ 2 ఋ 14; మం 4 సూ 16 ఋ 20 లలో నున్నది. మం 3 సూ 1 ఋ 5 లో లోహకారుని గురించియు, మం 6 సూ 3 ఋ 4 లో స్వర్ణకారులు బంగారును కరిగించు విషయమున వర్ణన గలదు. మం 1 సూ 140 ఋ 10; మం 2 సూ 39 ఋ 4; మం 4 సూ 53 ఋ 2లో యుద్ధములో వాడబడు సాయుధములను గురించి కలదు. మం 2 సూ 34 ఋ 3 లో బంగారు కిరీటమును గురించియూ మం 4 సూ 24 ఋ 9 లో భుజకీర్తులను గురించిన వర్ణనలు కలవు. మం 5 సూ 57 ఋ 2 లో బాణకైవాలములకు విద్యుదుపమాన మీయబడినది. మం 6 సూ 27 ఋ 6 లో వేనవేలు కవచ

ఘోరములగు యోధుల వర్ణనలు గలవు. మం 6 సూ 47 ఋ 10.26.27 లలో నిశిత శరవాలములు, యుద్ధరథములు, రణదుందుభులను గురించి చెప్పబడినది. మం 4 సూ 2 ఋ 8 లో గుఱ్ఱముల స్వర్ణాభూషణములభివర్ణింపబడెను, మం 7 సూ 3 ఋ 7, మం 7 సూ 12 ఋ 14; మం 7 సూ 95 ఋ 1 లో నయోమయపు దుర్గములును, మం 4 సూ 30 ఋ 20 లో శిలామయపు నగరుల గురించియు చెప్పబడినది. మం 2 సూ 41 ఋ 5; మం 5 సూ 62 ఋ 6 లో సహస్రస్తంభ ప్రాసాదముల విషయమున్నది.

పై నుదహరించిన వాక్యముల వలన ఋగ్వేదకాలమున నార్యులు జీవిత ప్రథమావస్థలోనే యెట్టి యున్నతిని గాంచియుండిరనుట తెల్లమగు చున్నది.

ఋగ్వేదములో దస్యులు, దాసులు, అనార్యులతో జరిగిన భీకర యుద్ధవర్ణనలు కలవు. ఈ యుద్ధములలో ధనుర్బాణము లెక్కువగ నుపయోగింప బడినవి. గుఱ్ఱముల నుపయోగించిరి. ఈ యశ్వోపయోగమును దస్యులెఱుంగకుండుటచే భయపడుచుండిరి. పాఠకుల నానంద పరచుటకై కొన్ని యుదాహరణలిందీయ బడుచున్నవి. యివి యన్నియు ఋగ్వేద సూక్తులు.

ఇంద్రయుద్ధము — „దీని నందరాహ్వానించిరి. ఇతనితో శీఘ్రగాము లుండుటచే నితడు భూమిపైనున్న దస్యులను, సిమ్యులను తన వజ్రముచే నాశమొనర్చి, వీరి చేలను తన తెల్లని మిత్రులకు [ఆర్యులకు] పంచిపెట్టెను వజ్రాధిపతి సూర్యుని ప్రకాశించునట్లు, జలముల వర్షించునట్లు చేయును.' [ఋ 1-100, 18]

„ఇంద్రుడు శక్తి, వజ్రములచే దస్యుల దేశమును నాశన మొనర్చి, తన యిచ్ఛానుసారము తిరుగసాగెను ఓ వజ్రీ! నీవు మా సూక్తులను గమనింపుము. దస్యులపై నీ శక్తిని ప్రయోగించి, ఆర్యుల శక్తి, యశముల పెంపొందజేయుము" [ఋ 1 సూ 103-3]

„కుయవు డితరుల ధనమెందున్నదో తెలిసికొని, దానిని తానుపయోగించును. వాడు నీళ్లలోనుండి దానిని పాడుచేయును. వాని స్త్రీలిరువురు

నదిలో స్నానము చేయుచున్నారు. సీకానదిలో స్నానము చేయుచున్న వీరు సుశిగి చక్షురగాక.''

,,అయుడు నీటిలో నొక యుక్తమగు కోటలో నుండును. వాడు జల రక్షణ వలన సుఖముగ నున్నాడు. అంజసీ, కులిశీ, వీరపత్నీ, నదీజలములు వానిని రక్షించును.'' [ఋ 1-104-3-4].

,ఇంద్రుడు తన యుద్ధములలో నార్యులలోని పూజనీయుల రక్షించును. వాడు వారిని వేనవేల సంవత్సరముల నుండి రక్షించుచున్నాడు. అన్ని యుద్ధములలో వారిని రక్షించును. ప్రజాహితము కోరి [ఆర్యుల శ్రేయస్సు] యజ్ఞము చేయనివారి నతడు దేశమును వీడిపోవునట్లు చేయును. శత్రువుల నల్ల తోలు నతడు వలిపించి చంపివేయును, మరియు [కాల్చి] బూడిద చేసివేయును. హాని కలుగ జేయుచుండియు, నిర్దయులు నగు వారి నితడు కాల్చి వేయును.' [ఋ 1-308]

,,ఓ శత్రునాశకా! ఈ దోపిడి గాండ్ర శిరముల రాశిచేసి నీ విశాల మగు పాదములచే నణచి వేయుము. నీ పాదము విశాలమైనది.''

,,ఓ ఇంద్రా! ఈ దోపిడికాండ్ర బలమును నాశ మొనర్చుము. వారి నీ పాపకూపమున బాంద్రోయుము.''

,,ఓ ఇంద్రా! నీ విట్టి జనుల మూడేబదుల నాశమొనర్చితివి. జనులు ఈ నీ పనిని పొగడుదురు. అయిన నీశక్తి ముందిది యొక ఘనత కాదు.''

,,ఓ ఇంద్రా! లక్క వన్నెగల పిశాచముల నన్నిటిని; విఘ్నములు కలిగించును కావున, చంపి వేయుము. ఈ రాక్షసులనందరిని నాశ మొనర్చుము.'' [ఋ 1-133-2-5]

,,అశ్వినీ దేవతలారా! కుక్కల వలె మొఱుగుచు మమ్ము చంపుటకై భీకరముగ వచ్చుచున్న ఈ జనులను నాశమొనర్పుడు. మాతో యుద్ధము చేయవలెనను కోరికగల వారినే జంపుడు. వారిని నాశమొనర్చు నుపాయము మీ రెరుగుదురు. మిమ్ము ప్రార్థించు వారి కిష్టావాప్తి చేకూరుగాక. సత్య దేవతలారా ప్రార్థన నంగీకరింపుడు,''

దధిక్రావ్ణము :—

అమెరికా ఖండమును గెలుచుటకు స్పెయినువారి గుఱ్ఱములే మూల కారణములు. ఆ గుఱ్ఱముల యుపయోగ మెఱుగని అమెరికా యాదిమ నివాసులు వాటినిజూచి భయపడుచుండిరి. పూర్వకాలమున నార్యుల గుఱ్ఱములుకూడ నార్యేతర ప్రజలను భయపెట్టి యుండును. 'దధిక్రా' అను దేవతుల్యమగు యుద్ధాశ్వమును గురించి యొక సూక్తమున నిట్లున్నది.

“గుఱ్ఱము దొంగలించిన వానినిజూచి జనులల్లరి చేయునట్లు శత్రువులు దధిక్రను జూచి గోల చేయుదురు. డేగను జూచి పక్షులార్భటించునట్లు భోజన, పశుసంగ్రహణార్థము వెడలు దధిక్రను జూచి శత్రువులు సిగ్గొంది పరుదురు.”

“విద్యుల్లేఖవలె మెరయుచు నాశమొనర్చు దధిక్రను జూచి శత్రువులు భయపడుచుండిరి. తనచుట్టునున్న వేనవేల జనుల జరిమార్చి యుండుట నప్పుడది కోపపూరితమై యుండి యధీనమును మీరియుండును.”

(౪-౩౮-౫ మఱియు ౮)

ఋగ్వేదములోని అనేక వాక్యములలో నల్లవారిని జంపు 'కృత్స' యనునొక ప్రతాపశాలి యగు శక్తియుండినట్లు తెలియుచున్నది. మం 4 సూ 16 లో ఇంద్రుడు 'కృత్స'కు వశుడువచ్చుటకై మాయావియు పాపియు నగు దస్యుని సంహరించెను. 'కృత్స' ఇంద్రునికి నేబదివేల 'కృష్ణశత్రువుల'ను నాశమొనర్చుటలో తోడ్పడెను. మం 4. సూ 28. ఋ 4 నుండి ఇంద్రుడు దస్యులను గుణహీనులుగను సర్వమానవులచే గర్హింపదగిన వారుగను చేసెనని తెలియుచున్నది. మం 4 సూ 3 ఋ 15 లో నింద్రుడొకరేయిన్నీ దైదువందల [1500] దాసులను నాశమొర్చినట్లు జెప్పబడినది.

మం 5 సూ 7 ఋ 3; మం 6 సూక్త 18 ఋ 3 మరియు మం 6 సూ 25 ఋ 2 లో దస్యుదాసులను పారద్రోలుటయు. వారిని జంపుటయు వర్ణింపబడినది. మం 6 సూ 41 ఋ 2 లో దస్యుల జ్ఞానమును గూర్చి నొక స్థల వర్ణనమున్నది. అది యెంతయు ననువదింప దగినది.

„దేవతలారా! మేము యాత్రికుల జేయుచు త్రోవదప్పి పశువు లేవియు మేయనట్టి ప్రదేశమును జేరితిమి. ఈ విశాల ప్రాంతము కేవలము దస్యులకు మాత్రమావాసమైనది. ఓ బృహస్పతీ మాకు మా పశువుల వెనుకటివలె తోడ్పడుము. ఓ ఇంద్రా! త్రోవదప్పిన నీ భక్తులకు మార్గదర్శకుడవు గమ్ము."

ఆదిమ వాసులు జేయు గోలను ఆర్యులు సహింపక నిందించి యున్నారు. ఈ సభ్యవిజయగణ మాదివాసుల గోడ నొక భాషగా నంగీకరింపక పలుచోట్ల నీయనాగరికులకు భాషయే లేదని వ్రాసిరి. (మం 5 సూ 29 ఋ 10 చూడనగునది.)

పైన నాదిమనివాసులను చోరులనగు 'దస్యువాయూ'ల సంగతి వ్రాయబడినది. వారు నదీపరివేష్టిత దుర్గములలో నివసించుచు, గ్రామ వాసులగు నార్యులను బాధించుచుండిరి. పలుచోట్ల – మూడవ యాదిమ వాసియగు – ప్రబల నాయకుని వర్ణనయు గానవగును. అతను నల్లగా నుంటచే నతనిని 'కృష్ణ' యని పిలిచిరి.

„ఆ కృష్ణ డంశుమతీ తీరమున పదివేల సేనతో వసించుచుండెను. ఇంద్రుడు తన తెలివితేటలచే నీ గోల చేయు యోధుని భాషను తెలియ గలిగెను. అతడు మానవుల [ఆర్యుల] హితమును గోరి యీసైన్యమును నాశమొనర్చెను."

„నేను తేజశ్శాలి యగు కృష్ణుని జూచితినని ఇంద్రుడనెను. సూర్యుడు మేఘముల మాటున దాగియుండునట్లు వాడంశుమతీ తీరస్థ గుప్త స్థలమున దాగియున్నాడు. ఓ మరుత్సుడా! వానితో యుద్ధముచేసి నీవు వానిని జంపవలెనని కోరుచున్నాను."

„అప్పుడంశుమతితీరమున నా తేజస్వియగు కృష్ణుడు గనుపించెను. ఇంద్రుడు, బృహస్పతి సహాయమున నా తేజమును దేవతా సైన్య సహాయము లేకనే నాశమొనర్చెను." [8.96.13,15]

దస్యులు నిరర్థకములగు ధ్వనులఁజేయు భాషరాని వారనియు మాత్రమేగాక, పలుచోట్లను వారు మనుష్యులుగా గూడ పరిగణింప బడలేదు. ఒకచో నిట్లు వ్రాయబడెను.

“నేను నలువైపుల దస్యులతో చుట్టబడియున్నాను. వారు యజ్ఞములఁజేయరు; ఏవిధమైనను విశ్వాసముంచరు. వారి వ్యవహార రీతులు భిన్నములు. వారు మనుష్యులు గారు. ఓ శత్రునాశకా! వారిని హతమార్పుము. దస్యుజాతిని నాశమొనర్పుము.’ [10-22-8].

మం 10 సూ 49 లో ఇంద్రుడిట్లనుచున్నాడు: ‘నేను దస్యులను పిలుచునట్టి ‘ఆర్య’ శబ్దముపయోగించుట లేదు. [ఋ3]. దస్యుజాతుల నూత్నావాసములను, బృహద్రథుని నాశమొనర్చితిని. [ఋ6]. దాసులను గోసి ముక్కలజేయుదును. వారీగతిని ప్రాప్తించుటకే జన్మమొందితిని.” [ఋ7].

‘సుదాసు’ డొక గొప్పపేరొందిన ఆర్యుల రాజు. అతనితో ఆర్యుల నేకులు రాజులు కలిసి యుద్ధము జేసిరనియు నతడందర నోడించెననియు వర్ణింపబడినది. ఆర్యులనడుమ వినాశకరములగు యుద్ధములును, సుదాసునితో బవరము జరిపిన జాతుల ననుసరించియు ఋగ్వేదమున నితిహాస దృష్టితో చక్కని వివరములు గలవు.

8. “ధూర్తులగు శత్రువులు నాశోపాయములజేసి, ‘యదీన’ నదీబంధము త్రెంపిరి. అయిన సుదాసు స్వశక్తిచే పృథివిపైనిలచెను. ‘చయమాను’ని కొడుకుపచ్చెను.”

9. “ఏటు వెనుకటి వలెనే పోవుచున్నది. దానిలో నెట్టిమార్పును లేదు. సుదాసుని ఖడ్గము దేశమంతటను జుట్టివచ్చినది. ఇంద్రుడు వైరులను సంతానసమేతముగ సుదాసుని యధీనమొనర్చెను.”

## సుదాసుని యుద్ధములు:—

11. సుదాసు డిరువైపులనున్న నిరువదొక్కరిని జంపి యశము సాధించెను. యజ్ఞశాలలలోని కుశలను యువకుడగు పురోహితుడు

కొనినది. వారిసైన్యము సమీపించుచున్నది. ఓ ఇంద్రావరుణులారా! మీ రనిశము మా ప్రార్థనల వినుచుండుడు. మా దరిజేరి మమ్ము రక్షింపుడు.

4. 'ఇంద్రావరుణులారా! మీరింకపరకపరాజితుడగు 'భేదు'ని జంపి సుదాసుని గాపాడితిరి. 'తృత్సు'ల ప్రార్థన లాలకించితిరి. వారి దీనమగు ప్రార్థన యుద్ధసమయములో ఫలించినది.'

5. 'ఓ ఇంద్రావరుణులారా! శత్రువుల కరవాలములు మాపై నలువైపులనుండి యెత్తబడుచున్నవి. వారు మావస్తువు లపహరించి, యాక్రమించుచున్నారు. మీరీ రెండువిధముల సంపదల కధినాధులుగనున్నారు. యుద్ధదినమున మమ్ము రక్షింపుడు.'

6. యుద్ధసమయమున నిరువాగులవారును సంసదర్థమై ఇంద్రావరుణులను ప్రార్థించుచుండిరి. అయిన నీయుద్ధములో మీరు 'తృత్సు'లతో గూడిన సుదాసును పదుగురురాజుల యాక్రమణమునుండి కాపాడితిరి.

7. 'ఓ ఇంద్రావరుణులారా! ఆ పదుగురు రాజులు యజ్ఞములు జేయని కారణమున సమిగూడియు సుదాసును బట్టలేక పోయిరి.'

8. 'ఇంద్రావరుణులారా! సుదాసు పదుగురు యోధులతో జుట్టబడినప్పుడు తెల్లని వస్త్రములగట్టి, జటాజూటములతో నొప్పు 'తృత్సు'లు నైవేద్యములతోడను, సూక్తులతోడను మిమ్ము పూజించుచుండగా మీరు సుదాసునకు శక్తి నొసంగితిరి.' [7-83]

1. 'యుద్ధము సమీపించినప్పుడు యోధుడు కవచమును తొడగి కొనిపోవుచుండగా మేఘమువలె నప్పట్టును. ఓ యోధుడా! నీ శరీర మక్షయ్యమగుగాక! నీవు జయ, లాభముల బడసెదవుగాక. నిన్ను నీ శస్త్రాస్త్రములు రక్షించుగాక.'

2. 'మేము ధనువులచే పశువుల గెలిచెదము. మాకు ధనువులచే జయము ప్రాప్తించును. మేము ధనువులచే భయంకరులగు శత్రువుల నాశ

మొనర్చి వారి యభిలాషల నష్టమొనర్చెదము, మేము ధనువులచేతనే మా విజయము నలుదైపుల బ్రసరింప జేయుదుము.'

3. 'ధనుస్సునకుగల నారిని లాగిపట్టుచు చెవి దగ్గర యుద్ధభూమిలో బాణములు గురిపింపవచ్చును. ప్రియురాలు చెవికి పోయినట్లు, నారి చెవిలో ప్రియ వచనముల జెప్పి, నారి బాణమును ప్రియురాలు తన భర్తకంఠమును కౌగిలించునట్లు బట్టుకొనును.'

5. 'తరకస' మన్నది బాణములకు తండ్రివంటిది. బాణములన్నియును దానికి బుత్రసమానములు. అది యాక్రోశించుచు యోధుని వీపుపైనున్నదై పూర్తి యుద్ధము నుండి దాటించి, శత్రువులను గెలుచునట్లు చేయును.'

6. 'చతురుడగు సారథి తన రథముపై నిలుచుండియే దిశకైన రథ్యముల దోలగలడు. కళ్లెములు గుఱ్ఱముల గట్టిపట్టి యుంచును, అట్టి యశమును బాడుడు.'

7. 'హయములు హేషలొనర్చు ఖురాగ్రముల ధూళి చేయు చున్నవి, మరియు రథము నీడ్చుకొని క్షేత్రముల కైపున కరుగుచున్నవి. అవి చలింపక గొప్ప దోపిడి గాండ్రను తమ పాదలచే నణచి త్రొక్కుచున్నవి.'

11. 'బాణములకు ఈకలు గట్టబడినవి. వాటి మొనలు జింక కొమ్ములతో గూడియున్నది. బాగుగా నవి తీవల నుండి లాగబడి విడువ బడునప్పుడు వ్యష్టిగను, సమిష్టిగనున్న శత్రువులపై బడి బాధముల బడయును.

14. 'ముంజేతికి బట్టబడిన తోలుపట్టా నింగడితీగ రాపిడినుండి తప్పించును. అది పామువలె చేతికి జుట్టుకొని యోధుని రక్షించును.'

15. 'విషపూరిత బాణము ఇనుప మొనగలిగి విషములో ముంచ బడినది. ఆ బాణమును మేము వర్ణించెదము.'

ఋగ్వేదము నుండి, ఆర్యులెడతెగక యుద్ధముల జేసి సింధునది నుండి సరస్వతి వరకును, పర్వతముల నుండి సాగరము వరకును గెలిచికొని యుండి

రనుటకు సిద్ధముగ నున్నది. ఋగ్వేదములో సింధు మరియు దాని యుపనదులైదును గురించి 10వ మండలములో 75వ సూక్తములో నున్నది. ఈ సూక్తములో మూడు పెద్ద పెద్ద ప్రవాహముల వర్ణన కలదు. ఒకటి పశ్చిమోత్తరమున ప్రవహించి సింధులో గలియుచున్నది. రెండవది పూర్వోత్తరమున ప్రవహించి దానిలో కలిసి దూరమున నున్న గంగాయమునలలో గలియుచున్నది. ఈ ప్రకారముగా నొక భౌగోళిక సీమ యేర్పడు చున్నది. దాని యుత్తరమున హిమాలయము, పశ్చిమమున సింధు నదియు సులేమాన్ పర్వతములు, దక్షిణమున సింధు నదియు సముద్రము, మరియు తూర్పున గంగాయమునలు గలవు. పంజాబులోని యైదునదులను, సింధు, సరస్వతీ నదులను గలిపి సప్తనదులని పేరీయ బడెనది. సప్తనదులకు సింధుమాత వంటిది. (మం7 సూ36 ఋ6.)

భరత ఖండమున గంగాయమునా ప్రవాహముల యావిర్భావము గానప్పుడు సరస్వతీ నదియే భారత సర్వప్రధానమగు నదిగా నుండెనది. దీని ప్రవాహమత్యంత విస్తీర్ణమై, ప్రబలమైయుండెను. ఋగ్వేదపు 6,7 మం 11లలో క్రమముగా సరస్వతి వర్ణన కలదు. ఇట్టి సరస్వతీనదీ కాలక్రమమున ఇంకి పోయినదనియు, అది గంగా యమునలతో గలసి ప్రయాగ చెంత గుప్తగామినియై యున్నదనియు హిందువులు విశ్వసించు చున్నారు. ఆ నది హిమాలయమునుండి వెడలి సముద్రమువరకును విస్తరిల్లి యుండినది. వేదమంత్రములలో సరస్వతీ నదిని.

“ఆయత్సాకం యశసోవావశానాః సరస్వతీ సప్తస్థా సింధుమాతా।
యాఃసుష్వయంత సుదుఘాః సుధారా అభిస్వేన పయసాపీప్యానాః” [ఋ. మం 7 సూ59]
“దృషద్వత్యాం మానుష ఆపయాయాం సరస్వత్యాందేవ దగ్నే దిదీహి॥”

“శత్రువుల యాక్రమణమునుండి రక్షించుటకు దుర్గసీమవలె సురక్షితమును, సువృక్షములగు లోహకవాటములవలె నున్నదని చెప్ప బడినది. వేగవతి యనుటలో “రథ్యేవయాతి” రథము నెక్కి పోవును. మరియు నీ

సరస్వతి యుత్తర నదులను తన మహాత్మ్యమును పరాస్త మొనరించినట్లు వర్ణింపబడినది.

పురాణములనుండి తెలియునదేమన : హిమాలయ, ప్లక్షప్రశ్రవణ మున సరస్వతి వెడలినదనియు, సిపుణ్య తీర్థము ప్రాయాదక కురుక్షేత్రపు బ్రహ్మావర్త ప్రదేశములో నడచుచు క్రమముగ నైఋతికి దిగుచు ద్వారక చెంత సముద్రమున గలియుచున్నది.

ఈ సరస్వతీ తీరమున ప్రజా పతియగు బ్రహ్మ మొదలుకొని యనేక దేవతలు, ఋషులు, మునులు గొప్ప గొప్ప యజ్ఞముల జేసిరి. మరియు సప్త ఋషులు మున్నుగాగల వారందరును సరస్వతి తీరమున యాశ్రమ పదముల నిర్మించుకొని యుండిరి. బ్రహ్మావర్తమను ప్రదేశమున కురుక్షేత్ర సమీపమున నీ ఋష్యాశ్రమము అధికముగనుండినవి.

మనుస్మృతిలో :—

“సరస్వతీ దృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరం ॥
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం విదుర్బుధాః॥”

అనగా సరస్వతీ మరియు దృషద్వతుల నడిమి దేశము బ్రహ్మావర్తన మనబడెను. ఇతిహాసపుమాట ఎంత చిన్నదైనను విచారయోగ్యము.

తైత్తిరీయ, శతపథ బ్రాహ్మణములలో నీక్షేత్రమును గురించిన ప్రశంసగలదు. మహాభారత శల్యపర్వములోను, గదాపర్వమునను బలరాముని తీర్థయాత్రా ప్రకరణము సారస్వతోపాఖ్యానపు పలుచోట్లయందును సరస్వతీ మరియు కురుక్షేత్రము అభివర్ణితములైనవి. బలభద్రుడు తీర్థయాత్రలకు వెడలినప్పుడు ద్వారకనుండి సరస్వతీ తీరస్థ ప్లక్షప్రశ్రవణ పర్వతముపై కెక్కెను. ఇచ్చటి సరస్వతీనది శోభనుజూచి యతడిట్లు వర్ణించుచున్నాడు.

సరస్వతీవాస సమాకుతోరతిః
సరస్వతీవాస సమాకుతోగుణాః ।

సరస్వతీ ప్రాప్య దివంగతా జనాః ।
సదా స్మరిష్యన్తి నదీం సరస్వతీం ॥
సరస్వతీ సర్వనదీషు పుణ్యా,
సరస్వతీ లోక సుఖావహా సదా ।
సరస్వతీం ప్రాప్య జనాః సుదుష్కృతం,
సదా న శోచన్తి పరత్ర చేహ చ ॥

తీర్థపుణ్యతమం రాజన్ పావనం లోక విశ్రుతం ।
యత సారస్వతో యాతః సోఽఙ్గిరాస్తపసోనిధిః
తస్మిన్ తీర్థే నరః స్నాత్వా వాజిమేధం ఫలం లభేత్ ।
సరస్వతీ గతించైవ లభతే నాఽత్ర సంశయః ॥

పై శ్లోకములో "సరస్వతీ ప్రాప్య దివంగతాః" మరియు 'సరస్వతీ గతించైవ లభతే' మొదలగు శబ్దములచే బలరామునికి పూర్వమునుండియే 'సరస్వతి' ఎండిపోయి యుండునని నిశ్చితమగు చున్నది. దీనిని సమర్థించుచు నదే తీర్థయాత్రా ప్రకరణమున నింకను నుదాహరణములు గలవు.

"తతో వినాశనం రాజన్ జగమాథ హలాయుధః ।
శూద్రాభీరాన్ ప్రతిద్వేషాద్యత్ర నష్టా సరస్వతీ ॥
యస్మాత్సా భరత శ్రేష్ఠ ద్వేషాన్నష్టా సరస్వతీ ।
తస్మాత్తదృష్టయో నిత్యం ప్రాహుర్వినశనేతిహి ॥

దీనివలన తెలియునదేమనగా శూద్రాభీర జాతులయెడ గలిగిన ప్రీతి బంధ కారణమున నేప్రదేశమున సరస్వతీ నది నష్టమైనదో దానికి వినశనమని పేరు వచ్చినది. ఈ వినశన ప్రదేశము నేటి మేవాడ ప్రాంతమునకు పడమటి భాగమునయున్న ప్రదేశమని తెలియుచున్నది.

మహాభారత కాలముననే సరస్వతీనది నష్టమై యుండినది. అయిన నైమిశారణ్య తీర్థమునను పుష్కరము, గయ, ఉత్తరకోసల ఋషభ ద్వీప, గంగాద్వారములును, కురుక్షేత్ర హిమాలయాది స్థానములలో సరస్వతీ ప్రవాహ వర్ణనలు లభించును.

ఈ వర్ణనల వలన నిక్కలి విశాలమగు సరస్వతీ వాహిని ఉన్కించినను, అంచెందు కాని చిన్న చిన్న ధారలు మహాభారత కాలము వరకుండినట్లు తెలియు చున్నది. ఇట్టి యేడు ప్రవాహములు సురేణువనునదొకటి ఋషభద్వీపమునను, ఒకటి గంగాద్వారమునను ఈ ప్రకారము మొత్తము తొమ్మిది వాహినుల విషయము గోచరు చున్నది. వీటికి వేరు వేరు పేర్లు పెట్టబడి తీర్థముల వలె ప్రసిద్ధములై యుండెను.

ఈ సుప్రసిద్ధమగు సరస్వతీవాహిని పశ్చిమాభిముఖియై ప్రవహించి, పశ్చిమ సముద్రమున ద్వారకచెంత సాగర సంగమమైనట్లు వర్ణింపబడిన విషయము విచార యోగ్యమైనది. మరియు తూర్పున ప్రయాగ వరకు ప్రవహించినట్లగుపడని సరస్వతీనది ప్రయాగస్థ త్రివేణీ సంగమస్థానమున నెట్లు ప్రసిద్ధి గాంచెను ?

సరస్వతీ నదియొక్క ముఖ్యవాహిని యగు 'మహానది' ప్లక్షప్రస్రవణమునుండి వెడలి కురుక్షేత్ర సమీపమున నేటివరకున్న 'స్థాణు తీర్థము' వరకు ప్రవహించి యుండినది. అచటనుండి యానది ఉదయపూరునకు నైఋతిగ సిద్ధపూరు, పాట్నా, మాతృగయలను దాటుచు 'కచ్ఛ' సమీపమున, ద్వారకకు పడమట సింధుశాఖతో గలియుచున్నది. దాని దేయగు 'సురేణు'వను సుప్రసిద్ధశాఖ, దక్షుడు యాగమొనర్చిన చోటు - ప్రయాగ క్షేత్రమున - గంగాయమునా సంగమములో గలసి యుండెను.

శ్లో. సురేణు ఋషభద్వీపే పుణ్యే రాజర్షి సేవితే ।
కురోశ్చ యజమానస్య కురుక్షేత్రే మహాత్మనః ॥
ఆజగామ మహాభాగ సరిచ్ఛ్రేష్ఠా సరస్వతీ ।
ఓఘవత్యపి రాజేంద్ర వశిష్ఠేన మహాత్మనా ।
సమాహూతా కురుక్షేత్రే దివ్యతోయా సరస్వతీ ॥
సురేణురితి విఖ్యాతా ప్రస్రుతా శీఘ్రగామినీ ।
విమలోదా భగవతీ బ్రాహ్మణా యజతాపునః ॥

సమాహూతాయయౌ తత్ర పుణ్యే హైమవతే గిరౌ ।
ఏకీభూతాస్తతస్తాస్తు తస్మిం తీర్థే సమాగతాః ।

సప్త సారస్వతం తీర్థ స్తత్రస్థాః ప్రథితం భువి ।
ఇతిసప్త సరస్వత్యో నామతః పరికీర్తితాః ।
సప్త సారస్వతం చైక తీర్థం పుణ్యం తథాస్మృతం (మహాభారతము)

ఋగ్వేద మంత్రములలో నదులను "సప్తసింధు" "సింధుమాతా" మరియు "సింధునద్యా" అను శబ్దములనుండి పంజాబులో ప్రసిద్ధమగు సింధునది మరియు నితరనదులగు, నైదు నదులను గొప్పదగు సరస్వతిలో కలిసియుండును. (పంచనద్యః సరస్వతీ మపియాన్తి సస్రోతసః) యజుర్వేదములోగూడ నొక మంత్రము "సరస్వతీతు పంచధా సోదేశేऽభవత్సరిత్" య. అ. 34. క 11 కలదు.

(మహో అర్ణః సరస్వతీ ప్రచేత యతికేతునా ఋ. మం 1. 3. సూక్తములు) పంజాబునకు పూర్వము 'సారస్వత' మను పేరు ప్రసిద్ధమైనది.

ఋగ్వేదములో జాతి, వర్ణములను గురించి పేర్కొనిన విషయములను ప్రత్యేకముగా నుల్లేఖించును. అయిన నిప్పుడున్న జాతి, వర్ణవ్యవస్థలు అప్పుడు మాత్రము లేకుండెనని అవశ్యకముగ జెప్పగలము. ప్రతియింటికిని నాయింటి పురోహితుడే స్వామియనబడుచుండెను. అతడు తన పరివారముతో వేదమంత్రోచ్చారణముతో నాయింటిలో నగ్నిప్రతిష్ఠ హవనములు జేయుచుండెను. ఆహవాగ్ని సృజింప బడుటయు నొక మహాశ్చర్యముగ నెన్నబడి యుండెను. గుడ్డలకొరత, అడవిలో నివసించుట, నిప్పును కలిగించు వస్తువులు లభింప కుండుట మున్నగు పరిస్థితులచే నాటి సౌభాగ్యము నూహింప వచ్చును.

ఆ కాలపు స్త్రీలగ్నిహవనములలో భాగము వహించు చుండిరి. అప్పటి యామువారు స్వయముగ ఋషులు అనగా మంత్రద్రష్టలుగనుండి హోమములు జేయించు చుండిరి. వారికెట్టి నిర్బంధములు లేకుండెనవి; తెర వెనుక దాగియుండు పద్ధతియు లేదు. విదుషియగు "విశ్వవారా" అనేక సూక్తములు రచించినది. ఆమెను గురించి మం 5 సూ 28 అ 3 లో తెలుపబడినది. నాడున్న స్వేచ్ఛను నేటి స్త్రీ లోకమునకున్న నిర్బంధములను పోల్చి

చూచినచో సంఘమును ధిక్కరించు మనసు పుట్టును. తండ్రి గూర్చిన మరియు కొన్ని కన్యలను గురించియు (మం 2 సూ 15, సూ 7) లో కలదు. తరువాత లేచి గృహముల దిద్దుకొను ప్రాతః కాలము బోలు పవిత్రములగు స్త్రీలను గురించి మం సూ 124 ఋ 4 లో వర్ణించును. కన్యె భర్తను వరించు చుండెను. దీనిని గురించిన ప్రబల ప్రమాణము లందఱి పద్ధతులు. వివాహ రీతులు స్పష్టములై యుండెను. 'కన్యాదానా'ది కార్యము తండ్రికి లేకుండెను. ఋగ్వేద సమ్మతములగు నానేక విషయముల నందు జర్చింతము.

ఋగ్వేద కాలమున సర్వశక్తియుతుడును, విశ్వ వ్యాపియు నగు సర్వేశ్వరు నొక్కని తమ దేవునిగా నప్పటివారు భావించు చుండిరి. అయిన ఋగ్వేద ఋషిగణము ప్రకృతినుండి ప్రకృతి దేవతల పై పురాగినది. వారు ప్రకాశవంతమై, మహా వ్యాప్తమగు నాకాశమును, ప్రకాశోష్ణము లను సారించు సూర్యుని జీవన ప్రదమగు వాయువును; అఖండజలముల వర్షించి క్షేత్రముల కాధారభూతమగు వర్షమును దేవతలుగా భావించి, పూజించిరి. వీటిలో "ద్యు" ఇంచుమించు యవనుల "జీయస", రోమనుల "జ్యూపిటరు" శబ్ద ప్రథమాక్షరము "జ్యూ" మరియు సేక్షనుల "టీడ" శబ్దములయు, జర్మనుల "జీఓ"ల స్వరూపమై యున్నది.

గ్రీసు మరియు రోమకదేవతలలో 'జీయస', 'జూపిటరు'లు చాలా కాలము వరకు గొప్పవారుగ భావింపబడిరి; వైదిక దేవతలలో "ఇంద్రుడు" విశిష్ట స్థానము నాక్రమించెను. దీనికి భారత దేశమున సెలయేటి ప్రవాహ ములై ప్రవహించు నదులు, సస్యాదికలతో కళకళలాడు సుక్షేత్రములు; ఫలితములు, మున్నగునవి ఆకాశమునకు నుండి మేఘము లైననే ఎక్కువ యాధారపడి యుండుట కారణమైనది.

వరుణుడే గ్రీకుల "ఊరేనస్". ఇతడును ఆకాశమునకు సంబంధించి వాడే; అయిన 'ద్యు' నుండి భిన్నుడు. 'ద్యు' ప్రకాశవంతమైన పగటి యాకాశమైన, వరుణుడు అంధకారములో గూడిన రాత్రి యాకాశము. 'మిత్ర' శబ్దము కూడ పగటి కాంతి యుక్తమగు నాకాశార్థమునందే వాడ బడినది. 'జెండావస్త'లోని "మిత్రా" శబ్దమిదియే. వైదిక విద్వాంసులు

'మిత్రావరుణు'లను పగలు, రాత్రులుగ జెప్పెదరు. ఈరానీయులు 'మిత్రా'ను సూర్యుడనియూ, వరుణుని యంధకారమనియు నందురు. జర్మనీ దేశపు ప్రఖ్యాత విద్వాంసుడు డా. రాథ్ 'ఆర్యులు, ఈరానీయులు విడిపడకమునుపె భయులకును వరుణుడే పవిత్ర దేవతగా నుండెనని యభిప్రాయ పడుచున్నాడు.

నీలఘనాళికి వేదములో 'వృత్రి' అను పేరొసంగబడినది ఎప్పుడును వర్షింపని మేఘములను 'వృత్రాసురు'లని పిలచిరి. ఇంద్రుని వజ్రాఘాతంబున గాని 'వృత్రుడు' జలముల వదలడని పురాణములలో వర్ణింపబడినది. ఈ ప్రాకృతిక సన్నివేశము ఋగ్వేదమున మిక్కిలి యందముగ నభివర్ణితము. 'ఈ యుద్ధమున వృత్రునిపై (నల్లమబ్బుపై) - జలపూర్ణమగు మేఘముపై నింద్రుడు వజ్రాయుధముచే ప్రహరించినప్పుడు (ఒండొంటినొరచుకొని మెరయగా) జలములచే నదీనదములు పరిపూర్ణములగును. ఈ యుద్ధమున 'మరుత్తు' (సురగాలి) ఇంద్రునికి బాగుగా దోడ్పడును మిక్కిలి గర్జించును.

ఈరానీ గ్రంథములలో 'ఇంద్ర' శబ్దము లేకున్నను 'వేరేథఘ్న' అను పేరు వాడబడినది; ఇది నిజమునకు 'వృత్రఘ్న' శబ్దమునకు అపభ్రంశమే. 'జెండావెస్తా'యందు 'అహి', 'థ్రయేతను'ని వలన జంపబడినట్లు వ్రాసి యున్నది. పైవేర్కొనిన 'వృత్రుడే' 'అహి'యైయుండ, 'థ్రయేతను'డే యింద్రుడు.

ఋగ్వేద సూక్తములలో ముఖ్యదేవతలగు ఇంద్రా వరుణులను గురించి భిన్నకీర్తుల వర్ణనలు కలవు. ఇంద్రసూక్తితో బలశక్తుల విశిష్టత సనుపించును. వరుణసూక్తములలో సదాచార భావము లెక్కువగ గన్పట్టుచున్నవి. ఇంద్రుడు సోమపానము జేయునట్టి బలవంతుడగు దేవుడు, యోధుడు — అసురులచే మదించినవారి సాయమున సహాయశక్తితో యుద్ధమొనర్చును. జేయు యుద్ధములలో నార్యులకు సైన్యాధిపతియై నదీతీర భూములను త్రవ్వుటలో సాయము చేయును.

పూషనుడను 'గోవుల'ను సూర్యుడు. నేడు హిందువులు విష్ణువును ముఖ్య దేవతగ బూజించుచున్నారు; వారు వైదిక దేవతలలో సవిత్రాగ్ని

వరుణుని కన్నను తక్కువగా పరిగణింపబడు చుండెను. ఈ విష్ణు రూపమున సూర్యుని ప్రాతర్మధ్యందిన సాయంసమయములు ముంజాకాశమును తరించుటచే వేదము త్రివిక్రమునిగను, పురాణములును ప్రత్యేకమగు రూపము నొసంగియున్నవి.

'అగ్ని'ని వెనుకటి జాతులన్నియు నాదరముతో పూజించినవి. ఈ దేవత పదేపదే ఘర్షణవలన కలిగింపబడు వాడగుటచే 'యవిష్ఠ' యనగా కనిష్ఠుడనియు 'ప్రమంథుడ'నియు పిలువబడెను. ప్రాచీనార్యేతర జాతులను అగ్నిని ప్రతిష్ఠించు నుండిరనుటకు సాక్ష్యము లేమియు లేదు. లాటినులో అగ్ని దేవతను 'ఇగ్నిస్' మరియు స్లావోనియనులు 'ఓగ్ని' [Ogni] అందురు. ఇదే విశేషముగ 'ప్రమంథుని' 'ప్రొమెథియస్' గ్రీకుల 'ఫోరోనస్' మరియు 'వుల్కాను' 'వల్కానస్' రూపములతో జాతుడు.

అయిన ఋగ్వేదములో వివరింపబడిన అగ్నిభూమి పైనున్న సామాన్యాగ్నివలె గాక మెరుపు, సూర్యులకై స్థలనిర్దేశము చేసినవాడుగా నుండెను. భృగువాతని గుర్తించెను. మాతరిశ్వునాతని గ్రిందకు తెచ్చెను. ఆంగిరసాంగిరులాతని మనుష్యులకై పృథివిపై ప్రతిష్ఠించిరి. ఈ ప్రవచనములలో అగ్నిని గనిపెట్టుటకై చేసిన తొలిప్రయత్నములు బాపట్టుచున్నవి.

వేదములలో వాయువునకు కొద్దిపాటి మహత్వమే కలదు. వాయు సూక్తములు తక్కువగ కలవు. సురగాలికి అభిమాన దేవతయగు 'మరుత్తుడు' స్మరణీయుడై యున్నాడు. ఇతడు భయంకరుడైనను ఉపకారియై భూమాతస్తనములనుండి వృష్టిధారలను పిదుకుచుండెను.

రుద్రుడు భయంకరమూర్తి. అతడు మరుత్తుల తండ్రి. సాయనాచార్యులతనిని 'అగ్ని' రూపుడనియే వచించిరి. భీకరముగ గర్జించు తుఫాను రుద్రుని రూపమని డా. రాత్ పండితుని యభిప్రాయము. ఇతనిని గూడ వేదములలో విష్ణువువలెనే కనిష్ఠ దేవతగ పరిగణించిరి. ఈ దేవతను గురించి చాల తక్కువ సూక్తములు గలవు. పౌరాణిక యుగములో నితడు గొప్ప దేవుడయ్యెను. భీకరముగ రుద్రుని (తుఫాను) తో గర్జించుచు, మెరయుచువచ్చు కాళీ, కరాళీ మున్నగు పేర్లుపనిషత్తులలో

వచ్చును. శ్వేత యజుర్వేదమున 'అంబిక' గణనకు వచ్చినను, పురాణములలోని దేవతలందరును రుద్రుని స్త్రీలుగనే యెన్నబడిరి. అయిన వేదములలో నెచటనైనను స్త్రీ దేవతాప్రసక్తి లేదు.

ఇక యముని మాట; ఇతడును పురాణ ప్రసిద్ధుడు. ప్రయోగమున యముడు" రవిపుత్రుడుగ చెప్పబడియున్నాడు. అయిన ఋగ్వేదములో నస్తమించుచున్న సూర్యుడు యముడుగ గల్పింపబడి యున్నాడు. మనుష్యుని జీవితమారంభమై యస్తమించునట్లు సూర్యుడుదయించి, వృద్ధి గాంచి, యస్తమించి లీనమగుచున్నాడని చెప్పబడినది. ఋగ్వేదానుసారము 'వివస్వతుడు'- (ఆకాశము) అతనితండ్రి. 'సరన్యు' (ప్రభాతము) అతని తల్లి మరియు 'యమి' అతని చెల్లెలు.

ఈ ఘటనను గురించి ఋగ్వేదములో నిట్లు వర్ణింపబడినది. అన్న యగు 'యము'ని 'యమి' భర్తను కౌగలించునట్లా లింగన మొనర్పదలచినది. అయిన నతడొప్పలేదు. నిజమునకు 'యమ,' 'యమి' యను పేళ్ళు రేపు, మాపులకే యివ్వబడి యుండినవి. అయినను రేయుంబవళ్ళొకదాని నంటి నింకొకటి జుట్టుచుండుటయు, నవి కలువకుండుటయు జూచుచున్నాము.

ఋగ్వేదములో యముడు గతించినవారికి రాజు. పురాణములలో గూడ నింతవరకు సరిపోలుచున్నది, కాని ముందు మాటలు పొసంగుట లేదు. వైదికయముడు పుణ్యలోకమును జేరి సుఖించుచు. పితృదేవతలనిపించుకొను నాత్మలతో గౌరవింపబడు చుండును. పౌరాణిక యముడన్నవో భయంకరములగు శిక్షల నొసంగుచు, కఠినుడుగ పాపులదండించు వాడునై యున్నాడు. వేద సూక్తముల వినుడు-

1. వివస్వంత పుత్రుని సన్మానింపుడు. అందరు నతని చెంతకే పోయెదరు. పుణ్యాత్ముల నితడు సుఖ ప్రదములగు జోట్లకు జేర్చును.

2. మన పితరులు బోయిన మార్గముననే నందరు బోయెదరు. మనకు యము డెప్పుడును నశింపని తొలి మార్గముననే జూపెను.

సోమ మొక మత్తుగలిగించు మొక్కయే ద్రవము నది యొక దేవత వలెస్తుతింప బడినది.

వివస్వత [ఆకాశము] 'సరణ్యు' [ప్రభాతము]ల నుండి యమి యములుద్భవించిరి. వారికి అశ్వినులను యమళులు బుట్టిరి. ఈ యశ్వినులును యమి యములవలె సంధ్యాప్రభాతములనుండి జనించిరి. ఋగ్వేదములోని నీయశ్వినీకుమారులు గొప్ప వైద్యులు. వారికృపా శ్రద్ధానములను చికిత్సలు నేక సూక్తములలో సభివర్ణితములు. వీరుభయులును దమ త్రిచక్రరథముపై నధిరోహించి ప్రతి దినము పుడమిని జుట్టుదురు. దుఃఖితులకు వారికి జికిత్స లొనర్చు చుందురు.

ఋగ్వేద సూక్తములలో నున్న యొక అందమగు నలంకారమును జూడుడు–

1. పనులిట్లనుచున్నారు– ఓ సరమా! నీవిటు కేల వచ్చితివి? ఈ ప్రదేశము మిక్కిలి దూరమైనది. వెనుకకు మరలి జూచువాడీ స్రోతమునుండి పోజాలడు. నీవు దేనికై వచ్చితివో, మాచెంతనది కలదా? నీ వెంత తిరిగితివి? రసానది నెట్లు తరించితివి?

2. నే నింద్రుని పంపున వచ్చితినని సరమయనుచున్నది. పనులారా, మీరనేక పశువుల దాచి యుంచితిరి. వాటిని నే దీసికొందును. జలము నాకు సహాయపడును. నేను రసానదిని దాటివచ్చితిని.

3. పనులను– ఇంద్రుడు పంపగా నీవింత దవ్వు వచ్చితివి. అతడెట్టివాడు ఎవరివలె గన్పట్టును? [పరస్పరము] రానిమ్ము. ప్రేమతో మన మామెను గైకొని, పశువుల నిచ్చెదము.

4. ఇంద్రుని గెలుచునంత వానిని జూడలేదు. అతడందరిని గెలుచును. గొప్పనదులైన నతని నడ్డ జాలవు. పనులారా, మీరు నిస్సందేహముగ నింద్రునిచే వధింపబడుదురు.

5. పణులు:- ఓ సుందరీ, నీవాకాశమున చాలా దూరమునుండి వచ్చియున్నావు. ఏలాంటి బాధలు లేక, నీ కానుకల నిచ్చెదము. ఎవ్వరైన నిట్లుచేయునా మా చెంతనొక వాడియగు బాణము కలదు.

6. పణుడు:- ఓ సరమ, ఇంద్రుడు మమ్ము భయపెట్టుటకై నిన్నిటకు బంపెను. మేము నిన్ను మా సోదరిగ గ్రహించుచున్నాము. నీవు తరలిపోము. మా పశు సంపదనుండి నీకొక భాగమిచ్చెదము.

7. సరమ:- మీరన్న చెల్లెండ్ల బాంధవ్యము నెట్లు తెచ్చితిరి. ఇంద్రాంగిరులకీ మాటలు తెలియును. పశువులన్నియు వశమగువరకు నేను వానిపై చూపు నిలిపెదను. మీరు దూరము పారిపొండు. [ఋ.10,108]

ఈ చమత్కారమగు కథలో యంధకారమగు రాత్రి గడచిన తరువాత క్రమక్రమముగ విస్తరిల్లు ప్రకాశమును గురించి తెలుపబడినది. ఇంద్రుడు వెతుకుచున్న పశువులతో కిరణములు పోల్చబడినవి. వాటి వెదకుటకై యతడు సరమను పంపును. ఆమెయే 'ఉష'. సరమ అంధకార బంధురమగు 'బిలు' లేక గహ్వరమును జేరును. పణులే ఈ చీకటి. వారామెను భ్రమ గొల్పును. అయిన సరమ మోసపోదు. అట నుండి యామె ఇంద్రుని చెంతకేగును అప్పుడతడామెను ప్రభాశాలిని జేయును.

ట్రాయ్ జేశపు యుద్ధకథనమీ వైదిక కథనాధారము జేసికొనియే వ్రాయబడియుండునని మ్యాక్స్‌మూలరభిప్రాయపడుచున్నాడు. ఇది యను దినము పూర్వదిగ్భాగమున సూర్యునినుండి జరుపబడు యుద్ధమే, దీనిలోని ప్రకాశకాంతమగు దినమపరదిగ్భాగముచే సంధ్యా సమయమున నపహరింపబడుచున్నది కదా. మ్యాక్స్‌మూలరుగారియనుసారము 'ఇలియను' ఋగ్వేదపు 'బిలు'వైయున్నది. 'పేరిసు' భ్రమగొలుపు వేదములోని 'పణుడు'. 'హెలెనా' లాలసను పేక్షించు సరమయైయున్నది. అయిన గ్రీకుపురాణములో నామె మోసగించబడుచున్నది.

అదితిపుత్రులగు ఆదిత్యులగురించి తెలిసికొందము అదితి అనగా అఖండమైనది, అపరిమితమైనది, అనంతమైనది. ఒక జర్మన్ పండితుని యను

సారవిహీనమైన కర్మము— అనాది, అనివార్య మిథ్యావిచారప్రకాశమై యున్నది. ఈ యనంతములో— పృథ్వీ మేఘాకాశముల కవ్వలివస్తువు ద్యోతకమగుచున్నది. ఋగ్వేదములో ఆదిత్యులను గురించి స్పష్టమగు వివరణమున్నది. మం. 2 సూ. 27లో మిత్రావరుణులే గాక 'అర్యమన్' 'భగ' 'దక్ష' 'అంశు'లను గురించియు సూచింపబడినది. మం. 9 సూ 114 నుండి మం. 10 సూ 72లో ఆదిత్యులసంఖ్య 7 అని తెలుపబడినది. ఇంద్రుడు అదితిపుత్రుడు. సవితృ సూర్యుడు ఆదిత్యులుగానే పరిగణింప బడియున్నారు. ఇతరవిధముగ 'పూషణ' 'విష్ణువు'లును— ఇవియు గాక సూర్యునిచేర్చి— ఆదిత్యులు, తరువాత సంవత్సరము పన్నెండుమాసములలో విభజింపబడినప్పుడు ఆదిత్యుల సంఖ్యకూడ 12 అని స్థిరపడినది. భాష్యకారులును 'సవితృ'వని కదలుచున్న లేక కదలని సూర్యుని బిలచిరి. వారు ప్రకాశించునట్టి సూర్యుని 'సూర్యు'డనిరి. సూర్యుని స్వర్ణకిరణముల యొప్ప మానమును తమ స్వహస్తములనుండియే బ్రసాదించిరి. బ్రాహ్మణములలో సవితృడు యజ్ఞము చేయునప్పుడతని హస్తమొకటి దగ్ధము కాగా నచటనే బంగారు చేయి యొకటతికించబడినట్లు వర్ణనగలదు. అయిన నీకతయే జర్మను పురాణములలో కొద్దిమార్పులతో గన్పట్టుచున్నది. అచట సూర్యుని చేతి నొక పులి తిని వేసినట్లు వర్ణింపబడినది.

ఈ సవితృదేవతను గురించిన యొకేయొక పవిత్రమగు గాయత్రీ మంత్రముత్తరకాలపు బ్రాహ్మణములలోనిదైయున్నది.

'తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్', డా. విల్సన్ దీనికిట్లర్థము వ్రాసియున్నాడు:-

“మమ్ము పవిత్రకర్మలలో ప్రవృత్తులజేయునట్టి యాదివ్యుడగు సవితృని మనోహరమగు ప్రకాశమును ధ్యానింతుము” [3-62-10]

బృహస్పతి— లేక బ్రహ్మణస్పతి ఋగ్వేదములో నొక సామాన్య దేవత; అయిన నుపనిషత్తులలో వరుసగ నతడు 'బ్రహ్మన్' అను గొప్ప బిరుదును బడసియున్నాడు. అతడే బౌద్ధమతములో 'సుపకారిబ్రహ్మ' గను, పౌరాణిక జగత్తున రచయితా 'బ్రహ్మ'గను భావింపబడినాడు. వైదికబ్రహ్మ

విష్ణుపదుల్లు, గంగోత్తరిచెంత సన్నగా ప్రవహించు పవిత్రగంగా జలములు సాగరసంగమప్రాంతమున విస్తీర్ణతను బొందినట్లు పౌరాణిక దేవతాత్రితయము మిక్కిలి వ్యాప్తినిగాంచిరి.

ఋగ్వేదములో స్త్రీదేవతలను గురించి యున్నవో ఒక 'ఉషా', 'సరస్వతు'లే కలరు. 'సరస్వతి' తొలుత నదిగా వ్యవహరింపబడినట్టిది తరువాత వాణ్యభిమాని దేవతయైనది. 'ఉషస్సు' లేక ప్రభాతమును గురించిన వర్ణనముబోలు మనుగమైన కవిత్వమెందును లేదు. నేరినైన గురించియు వినము. ఆలకింపుడు–

20. 'మా ప్రార్థనలపైననురాగముగల ఓయుషామర సుందరీ! నీవెవరిపై దయజూపెదవు?'

21. వివిధవర్ణములతో ప్రకాశించుచున్న ఉషా, నీప్రభలు సుదూరము విస్తరిల్లినవి. నీయునికి యెద్ది చెప్పుమా?

22. ఓ ఆకాశపుత్రి! ఈ నివేదనముల స్వీకరించి మా సుఖములను చిరంతనముచేయునట్లొనర్పుము. [1-30]

7. యువతియగు నాకాశపుత్రి, శ్వేతాంబరధారిణియై విశ్వసౌభాగ్యమునకు స్వామినియైయున్నది. మాకామె ప్రకాశమునిచ్చుచున్నది. ఓ విస్తీర్ణల ఉషా మాకిటు ప్రకాశమిమ్ము.

8. ఏమార్గమున లెక్కకు మిక్కిలి ప్రభాతములు గడచెనో, ఆమార్గమున అనంతములగు ప్రభాతములు రాబోవునో అట్టి త్రోవలో తేజస్సంపన్న యగు నుష అంధకారమును బోద్రోలుచు, మృతప్రాయులై బడియున్న ప్రాణికోటిని తన యమృతమయహస్తముల దట్టుచు మేల్కొలుపుచున్నది.

10. ఉషోదయ మెప్పటిదైనది. మరియు నెంతవరకగుచుండును. నేటి ప్రభాతము గడచిన వాటికి తరువాతను; వచ్చునట్టిదానిని నెంబడించునట్టిదిగ నున్నది. [2-113].

11. ఓ మంగళమయమగుషా! నీ తల్లి చేతులతో శృంగారింపబడిన వధువువలె శోభాయమానవై నీవు వెలుగుచున్నావు. ఈ క్రమ్మిన చీకటులను తొలగింపుము. నీకన్న నితరులెవ్వరు నీ పనిని చేయజాలరు. [1-123]

ప్రాచీన జాతులవారిలో నీరూప మిక్కిలి పేరెన్నిక గన్నది. యవన ప్రాంతములలో 'ఉషస్సు' 'ఇయోస్' [Eos] అనియు, లాటినులచే 'అరోరా' [Aurora] యనియు పిలువబడినది. 'అర్జుని' యను నది యవనుల భాషలో 'అర్జినోరిస్' [Argijnoris] గా నున్నది. 'బృసయా' గ్రీకుల [బ్రిసేయిస్] [Briseis] మరియు 'దహనా', 'దఫనే' [Dophne] అయినవి. 'సరమ' గ్రీకుల 'హెలెనా' [Helena] అయినది.

'సరస్వతీ' యనునదొక నది. దీని తటమునందే ప్రాచీనార్యులు చిర మధివసించిరి. సహజముగా నాదేవి సూక్తముల దేవి కాదు. అటుపై పౌరాణిక యుగమున వాణ్యభిమాని దేవతగా మారినది. మనుస్మృతియందీ విషయ ముల్లేఖింపబడును.

ఆదికాలమున నార్యులు ప్రకృతిని పరిచయమొనర్చుకొని వర్ణించి దాని గుణగణములను సహజసుందర కవితారూపమున గాన మొనర్పసాగిరను విషయముపై నుదహరింపబడిన వైదిక దేవతల వర్ణనలనుండి విద్వత్పాఠక లోకము గురుతింపగలదు. ఈ కల్పనలనుండి వారెంత సహజస్వభావులైనదియు, సదాచారులైనదియు సందేహింపక తెలియనగుచున్నది. ఈ సూక్తముల నుండి తెలియునదేమన నేలాటి క్రూరస్వభావము కల దేవతయు నటులభివర్ణింపబడలేదు. ఏలాటి హీనములును, నీచములు నగు మాటలకించు నెడ మీయలేదు. ఈ సూక్తముల నుండి విశ్వవిస్తృతమగు నీతి ప్రకటిత మగుచున్నదని చెప్పుటలో నభ్యంతర మేమియు లేదు.

ఋగ్వేదములో నే దేవతను గురించిన పూజ కాని, మందిరము కాని, ఉపాసన కాని యున్నట్లుల్లేఖింపబడలేదు. దీనివలన గృహపతి తన యింటిలోనే యగ్ని కార్యముల జేయుచు, ధనధాన్యాదికముల వలనను, బంధు మిత్రాదుల వలనను సుఖ మొనగూర్చునట్లా యా దేవతలను గీర్తించుచుండె

ననుటు స్పష్టమగుచున్నది. నాటి ఋషులు సాంసారిక జీవనములు గడపుచు పశు. ధాన్య సంపదలతో తులతూగుచుండిరి. వారివి గొప్ప కుటుంబములుండెను. నల్లనియనాగరికులనుండి తమ జాతిని రక్షించు కొనుటకై వారు తమలో గల వైషమ్యముల మాటుమంచి బాణ, బల్లెముల గొని శత్రువుల చెదిరించు చుండిరి.

ఇట్టులైనను యోధుడు, పురోహితుడు, కృషీవలుడు అను భేదము లేక ప్రతివాడును యీ మూడు గుణములను కలిగియుండెను. అయిన ఋగ్వేదపుటుత్తరకాలపు సూక్తులలో పురోహితులు పలుతావులందు స్వార్థ దృష్టి చేత పౌరోహిత్యము నడపుచు దక్షిణలగొనిన యుదాహరణములు పెక్కులు గలవు. * వీరిని గురించి ముందు వివరింపబడును. కొన్ని కుటుంబముల వారు సూక్త మంత్రముల ద్రష్టారలుగ నగుపించుచున్నారు.

ఈ ఋషులలో వశిష్ఠ విశ్వామిత్రు లుత్తములు. వీరిని గురించిన యనేక గాథలను డా. మ్యూర్ తన 'సంస్కృత టెక్ట్స్' అను గ్రంథమున సంగ్రహపరచి యున్నాడు. వీరుభయులకును విద్వేషముండినది. వశిష్ఠు డొకటో పోయినప్పు డతని యజమానుడగు సుదాసుని యొద్దనున్న విశ్వామిత్రుని మిత్రునిగ చేయించెను. వశిష్ఠుని శిష్యులీ సంగతి తెలిసి విశ్వామిత్రుని తూలనాడి, తమ నగరముగాని కరిగించిరి. విశ్వామిత్రుడు రాజర్షియై బ్రహ్మర్షిగా మారుటయు, భృగువంశ పక్షపాతి యగుటయు వీరి ద్వేషమునకు గారణమై యున్నది. ఋగ్వేదములో మం 3 సూ 53 లో వశిష్ఠు నెట్లు దూలనాడినో కొంత యాలకింపుడు.

„వారెవరెవ్వాని శక్తి గోచరము కాదు. ఋషులను జనులు పశులవలె లెక్కించి చూచెదరు. బుద్ధిమంతులు పెద్దలను దూషించుటకై సిద్ధపడరు. వారు గుఱ్ఱముల ముందు గాడిదలను సాగనివ్వరు.„ [23]

„ఈ భారతీయులు (వాశిష్ఠులతో) కలిసి మెలసి యుండుట యెరుగరు. ద్వేష మొనర్పు నేర్చియున్నారు. వారు తమ శత్రువుల యెదుట గుఱ్ఱముల నడిపింప జాలుదురు. ధనస్సులు బూని యుద్ధమొనర్తురు." [24]

వశిష్ఠుడు మం 7 సూ 104 లో ..సోమ పుష్టాంతమే మేలు కలుగదు. ఏలన వాడు తన సామర్థ్యమును వృథాపుచ్చును. అది యా యస్పృతవాదుల నష్టపరచని. మేమూభయులము ఇంద్రుని యుద్ధము" అని దుర్వాచ్యములకు బదులిచ్చి యున్నాడు. [13]

,,నేనాతుధానుడనే నైయుండిన లేక నెవరికైనను దుఃఖము కలిగించి యుండిన నిప్పుడే చత్తును గాక. అట్లుగాక నెవడేని నన్నాతుధానుడని యస్పృతము లాడియుండిన వాడే తన బంధువుల నడిమినుండి విడి వడి పోవు గాక. [15]

,,నేనాతుధానుడని గానప్పుడు నన్ను నిందించిన వానిపై ఇంద్రుని వజ్రాయుధము పడుగాక,, [16]

వేదకాలములో జరిగిన యీ విద్వేషమునకు పురాణములలో వన్నె పెట్ట బడినది. పురాణ గాథలలో క్షత్రియుడగు విశ్వామిత్రుని బ్రాహ్మణుడైనట్లు చెప్పబడినది. అయిన ఋగ్వేదములో బ్రాహ్మణుడని కాని, క్షత్రియుడని కాని చెప్పబడలేదు. మొదటితడు యోధుడగు ఋషియై తరవాత పురోహితుడగు ఋషియైనట్లు వర్ణితము. ఋగ్వేదము లోగల విశ్వామిత్రుని పెక్కు సూక్తులలో ఆధునిక బ్రాహ్మణములలోని సావిత్రీసూక్తము- గాయత్రి- యొకటైయున్నది. అతడు క్షత్రియులలో పుట్టినని తలచి మహాభారత, హరివంశ, విష్ణు పురాణములలో బ్రాహ్మణుడుగ మారిన యద్భుతకథలు వ్రాయ బడినవి. ఇదిగాక హరిశ్చంద్రుని కథలో నితడు కోపి, క్రూరుడు, నిష్ఠురవాది, లోభియునగు ఋషిగా వర్ణింప బడియున్నాడు.

త్రిశంకుడను రాజు భౌతిక శరీరముతో స్వర్గమును చేరదలచి వశిష్ఠునితో చెప్పికొనెను. అందులకు వశిష్ఠుడు అట్లుజరుగుటసంభవమని పలుకగా విశ్వామిత్రుడు తప్పక జరుగునని మాటయిచ్చెను. ఈ మాటకు వశిష్ఠుడు కోపగించుకొని యతనిని చండాలునిగ చేసివైచెను. అయినను విశ్వామిత్రుడు యాగముచేసి యతనిని స్వర్గమునకు బంపెను. ఇంద్రుడతనిని స్వర్గమునుండి గెంటివైచెను. అదిచూచి విశ్వామిత్రుడతనినచటనే నిలిపి యితనికై ప్రత్యే

కముగ స్వర్గమును సృజింప మొదలిడెను. ఇది పౌరాణిక గాథ. ఇదేవిధముగ పెక్కు కథలల్ల బడినవి. ఇట్టి కథలలో కాల క్రమమునుగూడ పాటింపబడలేదు. అనేకతరముల వరకు వసిష్ఠ విశ్వామిత్రుల వంశములవారు కలహించుచునే యుండిరి.

ఋగ్వేదపు 9వ మండలములోని ఋషియగు నంగిరుని గురించి విష్ణుపురాణము [మం 4. 2. 2.] లో నభాగునకు నాభాగుడు, అతని కంబరీషుడు, అతని యందు విరూపుడు, ఇతనికి పృశదశ్వుడు, ఈ పృషదశ్వునకు రథీవరుడు కలిగిరి. ఇది క్షత్రియులుగ మారిన యంగిర వంశము.

వామదేవ, భారద్వాజాదులు మత్స్య పురాణము [అ 132] లో బ్రాహ్మణులుగ మారిన నంగిర వంశములోని వారని వివరింపబడిరి.

గృత్సమదుడు మొదట అంగిర వంశమున నుండి తరువాత భృగు వంశము లోనికి మారెనని సాయణుల మతమైయున్నది. అయిన విష్ణు, వాయు పురాణములలో గృత్సమదుని సేనకు పితయైనట్లును, వ్యవస్థల జేసినట్లును వ్రాయబడినది [వి.4-8]

కణ్వుని గురించి విష్ణుపురాణములో [4-19]ను, భాగవతములోను [4-20] గురుసంతానమని వ్రాయబడినది. వీరు క్షత్రియులైనను బ్రాహ్మణులుగ పెంచబడు చుండిరి. అజమీఢునినుండి కణ్వుడు, అతనికి మేధాతిథి జన్మించిరి. వీరినుండి కణ్వనయ [కాన్యకుబ్జ] బ్రాహ్మణులు గలిగిరి. [వి. పు. 4-19]

విష్ణుపురాణములోన త్రిఋషి పురూరవసుని పితామహుడుగ పేర్కొనబడెను [వి. పు. 4-6] మత్స్య పురాణము [అ 132] లో 91 సూక్తకారుల వర్ణన కలదు. అయిన నాధునిక పురాణములలోని వర్ణనలు నిజమున కంత ప్రామాణికములైన, వాటిపైననే యధార పడవలసినంత స్థితిలో లేవని చెప్పవచ్చును. పురాణములు ఋషులను ముత్తెగలుగ విభాగించినవి:- దేవర్షులు- నారదాదులు, బ్రహ్మర్షులు- వశిష్టాదులు, రాజర్షులు- జనకాదులు, అయిన వేద ఋషులే విభాగమునకు వేరుగనుండిరి. ఆ కాలమున

నీ గ్రంథము తేల్పడనేరము. ఇట్టివర్ణనల మూలమునకే ఋగ్వేదము నందలి ఈ విషయములను బడయ గలుగు చున్నాము.

1. నదులు :- సుమారిరువదైదు కలవు. సింధు గంగా మొదలగు వదలిన తక్కినవి సింధునది శాఖలే. 1. వితస్త 2. అసిక్ని (చంద్రభాగ) 3. పరుష్ణి [రావి] 4. విపాట 5. శుతుద్రీ [సతలజ] 6. కుభా 7. సువాస్తు 8. క్రుము 9. గోమతి 10. గంగ. 11. యమున 12. సరస్వతి 13. సింధు 14. దృషద్వతి 15. రసా 16. సరయూ 17. అంజసి 18. హరియూపీ 19. వీరపత్ని 20. సుశోమా 21. మరుద్వృధా 22. ఆర్జీకీయా [విపాశ] 23. తృష్టామా 24. సుసర్తు 25. శ్వేతి 26. మెహత్నుం,

2. పర్వతములు- 1. హిమవంతము [హిమాలయము] మూజవంతము [సోమలత పుట్టుచోటు. కాబూలు వెంబడి కాశ్మీరమునకు నైఋతిలో గలదు] 3. త్రికకుత్ 4. నాగాపరిభంశేసము.

3—

4— పశువులు- సింహ, గజ, వృక, వరాహ, మహిష. ఋక్ష, వానర మేషాజములను. గోగార్ధభ శ్వాశ్వోష్ట్రములను గురించియు.

5— పక్షులు- హంస, క్రౌంచ. చక్రవాక, మయూరాది పక్షిభేదము లును.

6.— ఖనిజములు బంగారు, వెండి, ఇనుము మున్నగునవి.

7— మనుజాతివర్గములు :- గాంధారులు, మూజవతులు. పంచవర్గీయులు, పంచజనులు, పూరవులు, తుర్వసులు, యదు వంశీయులు, అనవులు, దుహ్యావులు, మాత్స్యులు, సృంజయులు, ఉశీనరులు, చేదీయులు, క్రివయులు, భారతులు, క్రీవయులు.

8— ఆభరణములు :- కటక, కుండల గ్రైవేయ, నూపురాదులు.

ఋగ్వేదభాష్యమును రచించిన సాయణాచార్యుల తరువాత దయానంద సరస్వతీ భాష్య మెన్నతగినది. ఇతడు సంస్కృతమున నహార

పాండిత్యమును గడించి, వైజ్ఞానిక దృష్టితో వేదముల దిలకించి బ్రహ్మవాణి నుతావలంబియై, వేదకాలము 196 కోట్ల 8 లక్షల 52 వేల 9 వందల 84 సంవత్సరము లని [తనకాలమునకు] చెప్పియున్నాను. ఇది సృష్ట్యాది కాలమని ఇతని యభిప్రాయము.

ఇతని యభిప్రాయ ప్రకారము ఋగ్వేదవిషయ, స్థలములను గురించి సంకేత మాత్రముగ నిచట వివరింప బడుచున్నది.

బ్రహ్మవిద్యా, ధర్మాదికములు— 1. 6. 15. 5, 1. 2. 7. 5. 8. 8. 49. 2-3-4,

సృష్టివిద్యా— 8. 7. 17, 8. 7. 3,
పృథివ్యాదుల పరిభ్రమణము :— 8. 2. 10. 1, 4. 13, 3,
గణితము — 8. 7. 18. 3,
ఈశ్వరస్తుతి— 1. 3. 18. 2,
ఉపాసనము— 4. 4. 24. 1, 1, 1. 11. 1,
ముక్తి— 8. 2. 1. 1,

వైమానిక విజ్ఞానము— 1. 3, 3. 3, 4, 1. 8. 8. 5, 1. 8. 9. 1. 1 3. 4. 1. 1. 3. 5. 7, 1. 3. 34. 7, 1. 6, 9. 4, 1. 3. 34. 7, 2. 3. 23. 47, 2. 3. 24. 48.

తారవిద్య— 1. 8. 21. 10,
ధ్రువనక్షత్రము— 8. 1. 23. 6—7,
నియోగము— 7. 8. 13. 2. 10. 18. 8. 8. 5. 27. 20,
రాజధర్మములు— 3. 2, 24, 6, 1. 3. 18. 2,

చాలామట్టుకు ప్రాచీనర్వాచీన భాష్యకారులను దయానందుడు విమర్శించెను. ఇట్టి భాష్య కారులలో సాయణాచార్యులు, మహీధరుడు ముఖ్యులు. అయిన శతపథాదిక బ్రాహ్మణముల విషయమున దయానందుడు మౌనము వహించుటాశ్చర్యముగ నున్నది.

శుక్ల యజుర్వేదములో 40, కృష్ణయజుర్వేదములో 18 అధ్యాయము లున్నవి. శతపథ బ్రాహ్మణములో నా 18 అధ్యాయముల మంత్రములు 9 ఖండములలో సంపూర్ణముగ నర్పబడి యథాక్రమముగ టిప్పణములీయ బడెనవి. ప్రాచీన కృష్ణయజుర్వేదపు యీ 18 యధ్యాయములను యాజ్ఞవల్క్యుడుద్ధరించి సంకలన, సంస్కారములజేసెను. తక్కిన 7 అధ్యాయములు యాజ్ఞవల్క్యుని అనంతరమును సంకలితమగు చుండెనేమో, మరియు కడపటి 15 అధ్యాయములు చిలి పరిశిష్టములను పేర్లతో తరువాత ప్రసిద్ధములైనవి.

యజుర్వేదమున 101 శాఖలు గలవు. ఈ శాఖలు శైలి, అధ్యాపన, దేశభేద కారణమున నైనవి. వీనిలో చాలా విలుప్తమైనవి, గురువు నుండి నేర్చినవిద్యను శిష్యుడు తన దేశమున తన శిష్యులకు బోధించినప్పుడు గలిగిన భేదములను పాటింపక నదేయాధికారాగా నాశాఖ కాతని పేరీయ బడెను. కొన్ని శాఖలలో పరస్పరము భేదమేర్పడి పైజెప్పినట్లు యజుర్వేదము రెండు పేర్లను కలిగియున్నది. శుక్ల [శ్వేత] యజుర్వేదపు వాజసనే యీ సంహితచాలా ప్రసిద్ధమైనది. వాంసనేయిఋషి వివిధ దేశముల 18 గురు శిష్యులకు యజుర్వేదమును బోధించెను. ఆ పదు నెన మంది గురుని పేరిట 18 శాఖలైనవి. శాఖా భాష్య కారులు వీటి నూతగా గొని మూల యజుర్వేదపు శుద్ధస్వరూపమున పరిగ్రహించిరి. ఈ శాఖకు సంబంధించిన బ్రాహ్మణముపలబ్ధము.

షడశీతిః శాఖా యజుర్వేదస్య చరణవ్యూహః

సామవేదమునకు సంబంధించిన విశేషమేమియును చిక్కుటలేదు. కొన్ని ఋచలను వదలిన తక్కినవన్ని ఋగ్వేదములో లభించును. ఆ మిగిలిన ఋచలు గూడ ఋగ్వేదములోనివే నేమో? బహుశః ఇప్పుడవి విస్మరింపబడెనవి. సామవేదము ఋగ్వేదమునుండి గాయనమునకై స్వర తాళబద్ధముగ జేయబడి, సంగ్రహింపబడినది. దీనికన్న వేరు కారణమే దియు గోచరింపదు. ఈ భేదములోని గొన్ని మంత్రములు యజుర్వేదమునను అధర్వణ వేదమునను గానబడును.

అథర్వణవేదము కేవలము మాంత్రికము. మనుస్మృతియందు మూడు వేదములను మాత్రమే యుదాహరించును. కౌషీతకి 6. 10. ఐతరేయ బ్రాహ్మణము 5-32, శతపథ బ్రాహ్మణము 11. 5. 8. 14. 6. 10.6, ఛాందోగ్యోపనిషత్ 4. 17, ఐతరేయారణ్యకము 3.2.3, బృహదారణ్యకము 1. 5 లో మూడు వేదముల నామములుల్లేఖింపబడి, యిది 'అథర్వాంగిరసేతిహాస'మని లెక్కింపబడినది. ఈ గ్రంథమును వేదమనుటకు దీనికి సంబంధించిన బ్రాహ్మణోపనిషత్తులలోనే యాధారములు గలవు. పైజూపిన యాధారముల తోడ్పాటుతో క్రీ. పూ. 1500 నుండి గ్రంథము అథర్వాంగిరసేతిహాస రూపమున ప్రకటనమగుచుండెను. అప్పుడద్దానిని 'అథర్వణవేద'మని పిలుచుటకు పలువురు నిశ్చయించిరి. క్రీస్తు తరువాతను నది వేదముగా బరగినయ్యె. 'గోపథ' బ్రాహ్మణము నాలుగవ వేదమావశ్యకమని తర్కించుచే సిద్ధముచేయుచున్నది. అది 'శకటమునకు నాలుగు చక్రములుండినను, పశువునకును నాలుగు కాళ్ళుండుటచే నది నడచును. ఇదేవిధముగ యజ్ఞకర్మలును నాలుగు వేదములు లేనిచో జరుపబడవు', ఇట్లనుటచే 'గోపథము' వరకును 'అథర్వణము' వేదముగా స్వీకరింపబడలేదని తెలియును. ఒకచో గోపథము అథర్వణమెట్లు వేదమైనదని ప్రశ్నించును.

అథర్వాంగిరుల నామవర్ణనాదికములు పురాణములలో మన కగుపడును. ఈ యుభయ విద్వాంసులు ఈ గ్రంథమును సంకలితమొనర్చినటు పొసగుచున్నది. ఈ వేదములలో 20 కాండములున్నవి. వాటిలో 6 వేల ఋచలుగలవు. దీని యారవయంశము గద్యమునను తక్కినవాని యారవ యంశము బహుశః ఋగ్వేదపు 10 వ మండల సూక్తములతో సరిపోలుచున్నది. 19 వ కాండ దానికి పూర్వపు 18 వ కాండపు పరిశిష్టమై యున్నది. 20 వ కాండ ఋగ్వేదపుటుద్ధరణమైయున్నది.

ఈ గ్రంథమెంత క్రొత్తదైనను, దీనిలో నొక ప్రబలమగు వైజ్ఞానిక వాదమును మనము గాంచెదము. అనేకముఖ్య విజ్ఞాన విషయములు దీనిలో మనకు లభించును.

వానికన్న ముందేదియు లేదు. వాడేయన్ని భువనముల సృజించెను. వాడు బ్రజాపతి. ప్రజలతోడి యుండువాడు, షోడశకలాపూర్ణుడై మూడు తేజముల ధరించును.
య. 32. 5

**33 దేవతలు** :—ఎవని దేహములో 33 దేవతలు వసింతురో వానిని బ్రహ్మజ్ఞానియే కనుగొనును.
అ. 10. 7-27

**రాష్ట్రమున వర్ణోన్నతి** :—ఓ బ్రాహ్మణుడా, మా రాజ్యములో జ్ఞానులగు బ్రాహ్మణులును, శూరులగు క్షత్రియులు నుందురుగాక. సమృద్ధిగ పాలుపితుకు నావులును, చపలాశ్వములును, విదుషీమణులు నుండి, యజ్ఞకర్తలకు శూరులును, విజయులును, సభానురంజకులగు పుత్రులుందురుగాక, సకాలమున మేఘములు వర్షింపనిమ్ము; వనస్పతులు ఫలభరితములగుగాక,
య. 22. 22

**కర్ణవేధ** :— అశ్వినీ కుమారులినుపసూదితో, బహు ప్రజా సూచకముగ, చెవులగుట్టినట్లే, నీవుగూడ గర్ణవేధ నొనర్పుము.
అ. 6. 142

**వాణిజ్యము** :—దేవతలారా! మూలధనముతో ధనము నపేక్షించు నేను వ్యాపారమును జేయుచున్నాను. ఆదిధనమును తరుగులేక పెంచుగాక.
అ. 3. 15

నేను వ్యాపారమున జేయునట్టి ధనమధికమగుట నాకిష్టము.

**కపోతసందేశము** :—సైగచేసి యెగుర వేయబడిన పావురము మా చెంతకు వచ్చినది. దీనిని సత్కరించి, మరలింపయత్నింతము.
అ. 10. 1. 5. 1

**పాలు, నేయి** :—ఆవులనుండి పాలు బితికెదను. నేయి నుండి బలవర్ధకములగు రసముల సేకరింతును. పాలు నేతులనుండి మా వీరులు దృప్తులౌదురుగాక, మా చెంత గొన్నియావులుండనీ.
అ. 2. 26. 4

గృహస్థు :— మా యింటియందు పాలు, నేయి, ధాన్యములు, భార్య, మిత్రపుత్రపౌత్రులు, రసములున్నవి.
అ. 3. 10. 5

ఋణనింద :— ఇహపరలోకములలో నెవరికినీ నేను ఋణ పడకుందునుగాక.
అ. 6. 117. 3

నౌకా వర్ణనము :— ఉత్తమరక్షా సాధనములుగలదియు, విస్తృతమును, నఖండమును, శ్రేష్ఠమును, సుఖప్రదమును, సుగమనమును, దివ్యమును, అందమగు చుక్కానులుగలదియునగు నావపై నేనెక్కెదను.
అ. 7. 6. (7) 3

కపోత సందేశము :— మా యింటిలో అగ్నిశాలలు ప్రవేశించి దివ్యమగు, పావురమునుండి మాసందేశముల గొంపోవుగాక. ఋ. 10.165.2

మంచి యుద్దేశములతో పావురమును బంపుడు. ప్రసన్నులై వరములకు సందేశముల బంపిన నది మాసందేహముల దీర్చును.
ఋ. 10. 165. 5

సంయమము :— ఆచార్యుడు, రాష్ట్రపతి, సంయమ, బ్రహ్మచర్యములతో నుండుట మంచిది. సంయమియగు రాజే ఇంద్రపదవి బడయును.
అ. 11. 5. 67

రాజు బ్రహ్మచర్యము వలననే రాష్ట్రమును పాలించును. ఆచార్యుడు బ్రహ్మచర్య మూలముననే విద్యార్థులను బ్రహ్మచారులుగ జేయును.
అ. 11, 5, [7]

బ్రహ్మచర్యముచేతను, తపస్సుచేతను దేవతలు మృత్యువును జయించిరి.
అ. 11, 5, [7]

వివాహము :— ఓ తపోనిష్ఠబ్రహ్మచారీ! నీ సుందర మూర్తిని నా మనము వరించినది.
ఋ. 10. 183. 1

ఓ వధూరత్నమా! నీ సుందర శరీర సౌభాగ్యమును ఋతుకాలిక సంయోగముచే సార్థక మొనర్తుము. నిన్ను నేను మనసార ప్రేమింతును. నన్ను వివాహమాడి సంతానమును బడయుము. ఋ 10. 183. 20

వివాహమును గోరు స్త్రీ యెందరో పురుషుల తీయని మాటలకు మోసపోయి వారియధీన లగుదురు. అయిన కుల స్త్రీ [భద్ర] సభలో తన పతిని వరించును. ఋ 10. 21, 12

పిండని యావులవలె నవివాహిత స్త్రీలు (కన్యాత్వము, కుమారావస్థ)ను త్యజించిరి. వీరు నూత్న జ్ఞానపూర్ణలై గర్భధారణ మొనర్తురు. ఋ 3. 55. 16

ఔషధములు:— మూడు యుగములకు ముందు దేవతలచే నుత్పన్నములగు నౌషధములు నూటయేడు జాతులకు సంబంధించినవిగ నున్నవి. ఋ 10. 97. 2

'సరియగు వైద్యుడు రోగికి తగినట్లుగా మమ్ము నియోగించిన రుగ్ణతను సమూలముగ బోకార్చి' యారోగ్య మొసగెదమని' యౌషధములు సోమరాజుతో ననుచున్నవి. ఋ 10. 97. 22

ఏక కాలమున నిద్దరు భార్యల నిషేధము:— రథమునకు గట్టబడిన గుఱ్ఱము రెండు నొగల నడుమ బిగింపబడి సకిలించురీతి యిద్దరు భార్యలు గలవాడు కష్టమనుభవించును. ఋ 10. 10. 11

అతిథి సత్కారము:— అతిథినివదలి భుజించువాడు ఇంటిలోని సుఖమును, శ్రేష్ఠత్వమును, రసమును, పరాక్రమమును, వృద్ధిని, ప్రజ, పశువులను, కీర్తి, శ్రీ జ్ఞానములను దినుచున్నాడు. అ 9. 6. 3.

అతిథి రాగా లేచి యెదురేగి, సంబోధించి 'మీరెచటనుండి వచ్చితిరి? ఇదో యీ జలముల దృప్తులు గండు, మీకు గావలసిన వస్తువును గొనుడు. మీకిష్టమైన దానినే జేయుదుము' అన వలెను. అ 15. 11. 1—2.

గృహ ప్రవేశ :— సవితృ భగవానుడు నింటిని నిర్మించును. అది సురక్షితమై యుండుగాక. వాయువు సోముడు, నరోగులమై యేను వసింతును. అ 3. 12.

ఈ యింటియందే యావులకును, గుఱ్ఱములకును స్థల మేర్పడ బడును. ఈ గృహము శ్రీ గాను శోభితమై వర్ధిల్లని. అ. 3. 12.

ఈ యింటు మిక్కిలి నేయి, ధాన్యముల గాదెలుండును. ఇట దూడలు, బాలుర గలసి యాడుదురు. మాపటికి గంతులు వైచుచు క్రొత్త లింటికి వచ్చును. 3, 12.

వీరపురుషుడు :— ఓ మానవ హితైషి! నీ బాహువులతో కల్యాణప్రదమగు ధనమున్నది. నీ యురముపై తేజము భాసిల్లును. కంధరములపై మాల, శస్త్రములతో తేజమొలుకును. పక్షులరెక్కలవలె నీ బాణములు శోభిల్లును. ఋ. 1, 116, 10.

వారు వాయువువలె బలిష్ఠులును, కవలపిల్లలవలె యొకేరకపు తొడవులు గలిగి యందమై పింగళ వర్ణాశ్వముల నెక్కువారును, నిష్పాపులును, శక్తియుతులును, స్వదేశ శస్త్రముల ధరించి ప్రాణము నర్పింప సిద్ధముగనున్న వీరులు గావున వీరాకాశ సదృశ విశాలురు. ఋ. 5. 5, 4.

ధనుర్యుద్ధము :— చేతికి గట్టబడిన [గోహ] చర్మము సర్పము వలె హస్తమును జుట్టుకొని యల్లె త్రాటి దెబ్బనుండి నా చేతిని గాపాడును. ఋ. 6, 75, 114.

మా రథముల నొగలు, చక్రములు, గుఱ్ఱములన్నియు భద్రములు. ఋ. 1, 38, 12,

వైద్యుడు :— సభలోని రాజులవలె వ్యవస్థా పూర్ణముగ నుంచబడిన యోషధులు గలవాడే వైద్యుడు. ఋ. 10. 97. 6.

రక్షణోపాయములు:—జ్ఞానులారా! ఉత్తమ భాషణము లొసంగి జ్ఞాన, పురుషార్థముల విస్తరిల్లజేయుము. శత్రువులనుండి తప్పించునట్టి నౌకల సిద్ధపరచుడు. అన్నమును, శస్త్రాస్త్రములను సిద్ధముగా నుంచుడు. అఖండ గౌరవమును, సంగీత, దానరూప సత్కర్మలను పెంపుడు.
ఋ. 10. 10. 1.

సైన్యము :— నాగలి నడుపుడు! ఎడ్ల గట్టుడు. భూమిని సిద్ధపరచి బీజావాపనము జేయుము. పండినధాన్యమును గోసి ఇచ్చి పుచ్చుకోలు జరుపుడు, దీనివలన భరణపోషణములు జరుగును. ఋ. 10.101.3.

నూయి:— బొక్కెనలు, చేదను పాత్రలను చక్కగ నుంపుడు, చేద్రాడును గట్టిగా పేనుడు. బావిలోని మంచినీటిని చేదుకొనుడు.
ఋ. 10. 101. 5.

గోశాల :— ఆవులు శుభ్రమైనగాలిలో తిరుగనీ, తేటనీరు త్రావనీ, పుష్టికరములగు ఓషధుల మెసవిబలముకలిగి మాకమృతోపములగు పాలుబిండనీ. ఋ. 10. 169. 1.

వీరలక్షణములు:—ఉత్తమవీరుడు శత్రువుల నోడించి యందరిచే మెప్పువడయును. కావున నందరు సత్కీర్తులనే పొగడవలెను.
ఋ. 6. 45. 6.

నూలువడకుట:—నూలువడకి, పన్నెవేసి చిక్కువదల్చి బట్ట నేయుడు. ఇది తేజోవంతుల మార్గము. ఋ. 10. 52. 6.

ఒకడు పడుగుల పరచనీ, ఇంకొకడు పేకలనల్లనీ, ఈ విధముగా నారబయుకు వస్త్రముల నేయుదము. ఇవి గుంజలు, నేయుచోట నాటబడును. ఈ యందమైన నాళికలు, కదుపు నేతకు బనికివచ్చును.
ఋ. 10. 130. 2

రాజు :— ప్రకృతిలో రాష్ట్రములకు అధిపతి యగుటకును రాజు క్షాత్ర తేజమును గలవాడై యుండవలెను.

రాజసభ :— రాజా ! నీవు దర్పముతో నీ శత్రువులను నశింప జేయుము. రాజ్యములో ప్రజలందరు సమితిగా చేర్పడి నిన్నెదిట్టి వరించెదరు.

శరీరదాహము :— జీవుడా ! నీ వింతవరకును దేహమునకు సద్గతికలుగుటకై గార్హపత్యాహవనీయాగ్నులను రగులించితిని. ఈ యుభయాగ్నుల మూలమున పరలోకములోని యుత్తమగతిని పొందుదువుగాక.
అ. 18, 2. 56.

రాజ్యాభిషేక సమయమున నుపదేశము :— రాజా ! నీకు స్వాగతము ; రమ్ము, స్థిరముగ నుండుము, చపలుడవుగాకుము. ప్రజలు నిన్ను వీక్షింపనీ. నీచే రాష్ట్రమునకు భంగపాటు గలుగకుండుగాక.
ఋ. 10, 173, 1.

స్వరాజ్యము :— ఉదారులును, మహాదర్శులు నగు సజ్జనులు స్వరాజ్యవ్యవస్థ జేయవలెను.
ఋ. 5. 66. 6.

రాజునకు తగిన గుణములు :— వ్రతియును, సత్యవ్రతియును, తేజస్వియును, సుకర్మియు నగువాడే రాజుగావలెను.
ఋ 8. 25. 8.

మూర్ఖుడు :— సభలలో నగ్రస్థానమును, సన్న పనులలో ప్రతిష్ఠలను గోరి బడయు వాడును, పాలింపితునని యావులతో, కపటియై మిథ్యాజ్ఞానమున నితరుల మోసపుచ్చును.
ఋ 10. 18. 5

పురుషునికన్న స్త్రీ శ్రేష్ఠురాలు :— అధిక సంఖ్యాకులగు పతివ్రతలు పురుషులకన్న దృఢవ్రతులును శ్రేష్ఠురాలును నున్నారు.
ఋ. 1. 69. 6

స్త్రీలకు యజ్ఞాధికారము :— విద్వాంసులగు స్త్రీ పురుషులారా! ఒకే చిత్తమున యజ్ఞమొనర్చు స్త్రీ పురుషు లీశ్వరుని సన్నిధిం జేరి సుఖముగ నుందురు. ఋ. 8.31.5

మాంసాహారులకు శిక్ష :— గుఱ్ఱము మొదలగు ప్రాణి మాంసమును దిని తన్ను బోషించుకొను వానిని, సాధువగు నావు పాలను దొంగిలించు వానిని ఖండింపవలెను. ఋ 10. 17. 16

జీవాత్మ పరమాత్మలు :— అభిన్నమై భిన్నమగురీతి, వృక్షముపైనున్న రెండుపక్షులలో నొకటి ఫలమనుభవించిన నింకొకటి యనుభవింపదు. ఋ 1. 164. 20

సృష్టిరచన :— అప్పుడీ స్థూల జగత్తులేదు. తన్మాత్రయు లేకుండినది. పరమాణుయుక్తమగు నాకాశమును లేదు. ఆ సమయ మెద్ది, యెట, దేనితో గప్పబడి యుండెను? ఎవని నాశ్రయించి యుండెను? ఋ 10. 128. 1

మృత్యువుగాని, యమరత్వముగాని, రాత్రిందివములుగాని లేకుండినవి; అయిన నేకైక శక్తియగు ప్రాణరూపమే యుండినది. దానికన్న భిన్నమైన దేదియు లేదు. ఋ 10. 189. 2

అప్పటికంధకార యుక్తమగు మూలప్రకృతి మాత్రముండి జగత్తంతయు నజ్ఞేయావస్థలో ప్రవాహ రూపమున నుండినది. తరవాత శూన్యముచే గూడిన ప్రకృతి ఆవరింపబడి, సర్వవ్యాప్తునిచే నొక పదార్థ మేర్పడినది. 10. 119. 3

మనశ్శక్తి సంకల్పమున నీజగత్తు పుట్టినది. సత్, అసత్, చేతన, జడ, ఆత్మానాత్మలకు పరస్పర సంబంధమున్నదని. ఇట్టి జ్ఞానులు దెలిసిరి. 10, 129. 4

మూడును [జీవ, బ్రహ్మ, ప్రకృతులు] గలియుటచే నొకపరిణామ మేర్పడెను. 10, 189, 5

సీసపుగుండ్లు :— సీసమును వరుణుడాదేశించెను. దానిలో నగ్నియుంకలదు. ఇంద్రుడా సీసమును నాకిచ్చెను. అది దొంగల వశింప జేయును. అ. 1. 16. 2.

ఈసీసము దొంగలను, శత్రువులను పారద్రోలును, పిశాచాది క్రూరజాతులదీనివలననే గెలుతును. అ. 1.16.3.

మా ఆవులను, గుఱ్ఱములను హింసింతువేని నిన్ను సీసపుగుండులతో గాయపరచెదము. ఇకమా వీరుల నెవరును నాశమొనర్పరు. అ. 1.16.4.

యుద్ధము :— శూరుడా! నీ బాహువులు బాణములకును, పరాక్రమము ధనువుగ నున్నవి. కరవాలము, పరశువులాదిగాగల శస్త్రముల శత్రువులపై బ్రయోగింపుము. అ. 11-9 [11] 1.

మిత్రులారా! లెండు, తగినరీతి నాయత్తులుగండు. మిత్రులగువారిని రక్షింపుడు.

వీరులారా! లెండు, పగకట్టు నుపాయములన్నిటిని గ్రహించి శత్రువులపై దండెత్తుడు. పుట్టడిని చాటుడు. అ 11-9. 2. 3.

శూరులారా! మీసేనాపతి పోవుచున్న శత్రుముఖ్యుల నెక్కుడి చంపెను. వీరిలో నొకరును మిగులలేదు. అ 11-9 [18] 2.

శత్రువుల గుండెలు జారనీ, ప్రాణములు లేచిపోనీ, ముఖములు వాడనీ, అయిన మాకు జయముచేకూరనీ. అ 11,9 [11] 2

ధైర్యము గలవారును, ముట్టడించు వారును, ప్రచండవీరులును, ధూమ్రాస్త్రమును ప్రయోగించువారును, శత్రువుల ఛిన్నాభిన్న మొనర్చు వారునుగల సైన్యము నాయత్తపరచుడు. అ 11. 9. 22.

ఓ సైనికులారా! రక్తపతాక నెగురవేయువారే విజయమును గాంతురని నే నెఱుంగుదును. అ 11. 10 (18) 2

కవచములు గలవారును, లేనివారును నగు శత్రువులు చచ్చి పడి యున్నారు. వారిని కుక్కలు తినుచున్నవి. అ 11. 10 (12) 24.

ధూమ్రమాత్రము :— మనుష్యులారా! నలువైపుల నుండి మాఱుబడుచున్న శత్రుసేనను చీకాకు పరచును. అ 3. 2. 5

క్షయకు సూర్యచికిత్స :— అంగముల శిథిలమొనర్చు క్షయ వ్యాధి కన విడనుము పాదములు, జానువులు, శ్రోణులు, కుక్షి, కటి, మస్తక, కపాల హృదయాదులలో చేర్చును. అట్టి క్షయము సూర్యకిరణములచే నాశమొందును. అ 9. 8. (13)

క్షయరోగమా! నీ యన్ని సెరెంద్రము కఫకాసలలోడను, నక్షత్రి యగు సబ్బసముతో మరణ కెయ్యనైనున్న వాని కందకేసుము. అ 5. 22. 12.

భయపడకుము, నీకు చావులేదు, నీకు దీర్ఘాయువు నిచ్చెదను. నీ యంగములనుండి జ్వరమును బోద్రోలెదను. క్షయను నీనుండి తొలగ జేయుదును. అ 5. 30. 8.

రోహిణి (మందుదినుసు) గుణము :— విరిగిన యెముకను పొందించును. దీనివలన మాంసమజ్జలు నతుకుకొనును. అ 4. 22

కత్తిచే నరుకబడినను, రాతిచే నలిగినను, కుశలుడగు వానిచే రథము జోడింపబడినట్లు, అంగములు పరస్పర మతుకుకొనును, అ 4. 12 7.

రావిచెట్టు :— రావి యున్మాదమునకును, వాతమునకు గాయమునకును— మేలైన మందు.— ఈ యౌషధము దీర్ఘాయువునిచ్చునని దేవత లందురు. అ. 6. 109. 1.

పృష్టి (పృశ్ని) పర్ణి :— ఘాతుక నీ యౌషధము రోగక్రిముల నశింపజేయును. అ. 2. 25, 1

శ్యామా:— ఈ వనస్పతి శరీరచ్ఛాయను చక్కదిద్దును. మిక్కిలి తెల్లమచ్చను బోగొట్టును. అ 2. 24, 4.

దశమూలములు:— సంధిరోగముల కుదుర్చును. అ 2.7.1

అపామార్గము:— ఆకలిదప్పులు లేకుండుట, ఇంద్రియములు క్షీణించుట, సంతానము లేకుండుట మున్నగాగల వ్యాధులపామార్గమున నుడుగును. అ 4. 17. 6

కీటాణువులు:— నల్లప్రక్కలుగల నల్లని వన్నెగల కీటాణువుల నన్నిటిని నాశమొనర్చును. 5, 23. 5

హాని కలుగజేయు రోగక్రిములన్నియు క్రిందిభాగమున చీకటిలో నుండును. అ 2. 25. 5

బాధకలిగించునవియు, వశీకరించునవియు, విషయుక్తములునగు జంతువులు కొన్ని కన్నులకు కనిపించును. కొన్ని కనుపడవు. అ 5.23.9

కంటికగపడునట్టియు, కనపడనట్టియు, భూమిపై బారాడునట్టియు, కపోలములబుట్టునట్టి క్రిముల నాశమొనర్తును. అ 2. 34. 2

ప్రేవులలో, తలలో, ప్రక్కలలో నుండు క్రిములను నశింప జేయుదును. అ 2.32. 4.

మూడుతలలు, వీపులు గల పలువన్నెల క్రిముల నష్టమొనర్పవలెను. అ 5. 23. 9.

సూర్యు డుదయాస్తమయములందు క్రిముల నశింపజేయును. అ 2. 32. 1

నీ కనులు, ముక్కు, చెవులు, గడువ, తల, నాలుకల నుండియు, కంఠ శిరములు, అస్థిసంధులు, ప్రక్కటెముకలు, వెన్నెముక, హృదయము,

క్షురకర్మ:— ఈ సవితుడను నాయీ ఛురిక గొని వచ్చెను. వాదు శీఘ్రముగ వేడినీళ్ళ గొనివచ్చియుండెను మొగుచుగాక. అ. 6. 78. 1
ఛురిక వెండ్రుకల దీయనీ, వెండ్రుకల వేడినీట దడుపవలెను. దీనివలన బాలకులు దీర్ఘాయువులగుదురు.

ఉపనయనము :— ఈ మేఖలను గట్టిన యాచార్యుని దివ్యశాసనము ననుసరింతుము. అదే మమ్ము బంధనమునుండి ముక్తులజేయును.
అ 6, 133. 1

ఈ మేఖలను ధరించి శ్రద్ధ, తపస్సు, ఆప్తవచనములచే మతి, మేధల ధరింతుము. మరియు దానివలన తపోధనములు కలుగును. అ. 6. 133 4

వస్త్రముల నేయుట :— పలువన్నెల దారములతో రూపములను నిర్మించువారు 6 పడుగు గుంజల చెంతకు వచ్చిరి. ఆ గుంజలకు జుట్టబడిన యొక దారము నొకతె లాగగా నింకొకతె జేర్చును. వారిలో నెవరును పనిని చెరుపరు. అ 10. 1. 43

ఈ వస్త్రములోని రౌమాశ్రోత్రముల పత్తివలు, అంచులు, ఫలముల ద్వారా అందముగా నేయబడినది. అ 14. 2. 51

మనస్విజనులు శీసపుయంత్రముచే పడుగుదారములు బరచి మనస్సుతో వస్త్రముల నేయుదురు. య. 19 8

రాజ్యవ్యవస్థ:— సృష్ట్యాదిలో రాజులేని ప్రజాశక్తి మాత్రమే యుండినది. ఇట్టియరాజకస్థితిని జూచి యందరును భయపడి యింకెంత కాలముండునో యని తలచిరి.

ఈ ప్రజాశక్తి విజృంభించి గృహపతులలోనికి మారినది. అనగా వేరువేరు మనుష్యులయొక్క వ్యవస్థిత కుటుంబము లేర్పడెను.

ఇట్టి ప్రజాశక్తియే విజృంభించి సభారూపమున పరిణతించెనది. సభలో ప్రవిష్టుడగు వానిని సభ్యుడనుచుండిరి.

పుంసవనము :—ఓ యువతీ! నీవే కారణమున వంధ్యవైతివో దానిని మేము నీనుండి తొలగించుచున్నాము. అ 3. 23. 1

నేను పుంసవన మొనర్తును. దాన నీ గర్భము యోనిగతమగును. అ 3. 32. 5

పుంసవన మొనర్పబడినది. శమీ, అశ్వత్థములీయబడినవి. దీనికి మరల నివి ప్రాపించును. అ 6. 11. 1

నిన్ను కేవలము గృహకృత్యములకై సుపరిషిద్ధులును, ఉదార హృదయులనువారు నాకొసంగియున్నారు.

సౌభాగ్యమునకై నిన్ను చేబట్టుచున్నాను. నీవు నాతో వృద్ధాప్యము వరకుండుము. అ 14. 1. 5

వీరత్వమునకు చోటు చేసినదియు, ధనప్రాప్తి యగునట్టియు మార్గమున మేము నడచెదము. అ 14. 2. 6

ప్రియములగు మాటలుగలదానా! నీవు పతికి గతి సమానవును, సుఖదాయినివి, కార్యనిపుణవు, సేవాపరాయణవు, నియమపాలన మొనర్చుదానవు, వీర పుత్రుల నొసగువానవు, పశువులయెడ ననురాగము గలదానవు గమ్ము.

గర్భాధానము :—పుత్రులుగోరు స్త్రీ తన పతివలన, ఈశ్వర కృపచే, పుత్రుని గాంచును. అ 6. 31. 3

పురుష జననేంద్రియము గర్భమున వీర్యస్థాపన మొనర్పజేయును. ఈ యింద్రియము మేరుదండ మస్తిష్కాంగములచే సంగ్రహింపబడిన వీర్యమును, బాణమును రెక్కవలె, యోనిలో విసరును.

కన్యాదానము :—వరుడా! ఈ కన్య నీ కులమును రక్షించును, దీనిని నీకై యొసగుచున్నాను. ఈమె యెప్పటికి తలిదండ్రులలో నుండి స్వబుద్ధితో సత్తమ విషయముల గనుగొనెసి. అ 1. 14. 3

పత్నికిగలపని :—సౌభాగ్యవతులందరు వచ్చి యున్నారు. పడతీ లెమ్ము, బలము పొందుము. పతికి నుత్తమ పత్నివై పుత్రవతివిగమ్ము. యజ్ఞము లొనర్పుము. కడువలతో నీవు దెమ్ము. అ 12. 1. 14

మీకుభయులిటు నుండుడు. వేరుబడకుడు. పుత్రులు, స్త్రీలతో గ్రీడించి యానందము మీయుత్తమ గృహమున దీర్ఘకాలము వరకానంద మనుభవింపుడు. అ 14. 1. 22

బలవంతుడగు సముద్రుడు నదీ సామ్రాజ్యము నేర్పరచినట్లు నీవును పతిగృహమునకు జని సమ్రాజ్ఞివిగమ్ము. అ 140. 1 43

నీ మామ, బావ, మరిది, అత్తలతో మహారాణి వలె నుండుము. అ 14. 1. 44

# వేదకాల సామాజిక జీవనము

వేదకాలము క్రీ. పూ. 5000 సం॥లై యుండునని పూర్వపు టుపాధ్యాయులచే తెలుపబడినది. అయిన నీకాలమున నార్యుల సాంఘిక దశ యెట్టిదిగా నుండెననుట తెలియజాలనిది. మనము ఋగ్వేదపు హిమాగమ పూర్వకాలమును గూర్చి తెలిసికొనజాలనప్పటికిని. హిమాగమానంతరము భారతదేశమున జరిగిన యనేకవిషయములు గ్రహించి యూహింపగలము.

వైదిక కాలములో వివాహసంబంధములు యువావస్థ నేర్పడి ఆజీవ పర్యంతముండెడివి. వివాహ మను శిక్షయుగాని, కన్యాదానముగాని లేకుండినవి. కన్యాదానమునకు సంబంధించిన యేకైకమంత్ర మఋగ్వేదమున అధునికమైనది-దొరకుచున్నది. పత్యాంతర మితరపురుషునితో పూర్వసంబంధమునకువలెనే పొందుబాటు జరుగుచుండెను. ఆడబిడ్డలు తల్లి వంశమున లెక్కింపబడుచుండిరి; వారు తల్లికి వారసులుగకూడ కాజాలరుండిరి. తండ్రియే కుటుంబమునకు రక్షకుడు, పాలకుడుగనుండెను. తల్లిపై కొడుకులకు దాయత్వముండి, యామె సంపత్తియై యుండెను. జాతి వ్యక్త

భేదములాకాలమున - ఋగ్వేదకాలమున లేకుండెను. కుటుంబమునుండి, తండ్రియేవాటికి ముఖ్యుడుగనో, లేక గృహపతిగనో యుండుచుండెను.

పశుపక్ష్యాదుల గుర్తించి, వాటిని మచ్చికచేసికొనువిషయ మిదివరకే వ్రాయబడినది. శిల్పమున, నిల్లు, గ్రామము - పట్టణముల పెంచుట, బాటలు, బావులు, పురోద్యానముల వెలయించుట, పడవల నుపయోగించుట, దారము తీయుట, వస్త్రపరిశ్రమ, ఉన్నిపరిశ్రమ, చర్మాంబరనిర్మాణము; వస్త్రలు వేయుట మరియు కలపపనిని యార్యులు మిక్కిలి నేర్పుతో చేయ గలిగియుండిరి.

వ్యవసాయము వారిముఖ్యవృత్తియగుటచే నాగలి, బండి, గాను [చక్రము], నొగ, కాని మున్నగు పనిముట్లనుగురించి విశేషమే వ్రాయబడినది. కులపతులనేకులు తమ పరివారసమేతముగా పచ్చికబయళ్ళ నెమకుచు భారతమున సాగిపోవుచుండిరి. వారనార్యులతో యుద్ధమొనర్చుచుండిరి. ఈ యుద్ధములను, వీరి నైపుణ్యమునుగురించి యీ వరకే తెలుపబడియున్నది. బంగారు, వెండి, యినుము మున్నగుధాతువులీవరకే వీరి కెరగతములైనవి.

వైదికార్యులు గౌరవర్ణముగలిగి, యెత్తు బలసౌందర్యములచేనొప్పుచు, యోధులుగను, సహిష్ణులుగను, మేధావంతులుగనుండిరి. వారెల్లప్పు డగ్నిని తమవెంట నుంచుకొనుచుండిరి. వారు గంభీరులై ప్రకృతివిషయముల దెలియుచు, తద్రహస్యముల నుపాయములచే గనుగొనుచుండిరి.

ఆర్యులకు సముద్రములను గుఱించియు సముద్రయానమును గురించియు మిక్కిలి యనుభవముండెను. వాణిజ్యములో కుశలతగలిగి యథార్థముగ వస్తువినిమయము గావించుచుండిరి. యవలు, గోధుమలు ముఖ్యముగ పండించుచుండినవి. ఆర్యులు మాంసమును దినుచుండిరి. మత్తుగలిగించు వస్తువనిన కేవలమొక 'సోమ' లతమాత్రముండినది. దానిరసమును పాలతో సేవించుచుండిరి. ఆర్యులు తూర్పునకు సాగినకొలది సోమలతలభించక మద్యము నే సోమరసముగను మారుగ వాడ నారంభించిరి. ఉన్ని, దూదిమండి వస్త్రముల నేసి, అందము లను వస్త్రాలద్ది వాసుకొనుచుండిరి. వారుదవ్వులలోని ప్రదేశములకు నిప్పుం

పరిగ్రహింపనేమియు లేకుండెను. ఈ కన్యలు దమ పిత్రాశ్రితములో గొంత బడయుచుండిరి. స్త్రీలు చతురలై పరిశ్రమయు నాసక్తియు గలవారుగ నుండిరి. వారు వేకువలేచి గృహకృత్యముల నారంభించుచుండిరి. కొందరు వ్యభిచారిణులుండిరి. ద్యూతప్రచారమున్నను నింద్యమైయుండెడిది. వివాహములలో నుచ్ఛ్వాసములను ప్రతిజ్ఞలు గావింపబడుచుండెను. ధనవంతులు, రాజుల నేక భార్యలుగలవారుగనుండిరి. ఇల్లాండ్రను వర్ణించుపట్ల వారి సవతులనుగూడ వర్ణించిరి. ఇట్టి యుల్లేఖనములంతయు సూక్తములలో గలవు. ఔరస పుత్రులులేనివారు తన దౌహిత్రుని గైకొనుచుండెను. కుమారుడే తండ్రియాస్తికి స్వామియగుచుండెను. కూతురుగాదు. కొడుకులను బెంచు కొనుపద్ధతి [ఔరసులు లేనప్పుడు] వంతగా జనులు మెచ్చుకుండిరి. శత్రువుల జయించి యన్నమును సంపాదించు పుత్రులుగలుగ వలెనని ప్రతివాడును గోరుకొనుచుండెను. మరణానంతరము పరలోకప్రాప్తియగునని వారి విశ్వాసము. మృతునకు నగ్నిసంస్కారముజేయుటయు, నట్టిభస్మముపై దిబ్బల [సమాధుల] గట్టుటయు నాటి యాచారమై యుండెను. వితంతువులితరపతులతో సంబంధముగల్పించుకొనుచుండిరి. వారు వైధవ్యభారమును సహించుట నాటి ఋషుల కిష్టమైయుండలేదు. ఋగ్వేదకాలపు ఋషులను గురించి యీవరకే తెలుపబడినది. దాన వారు ప్రకృతిశక్తుల నారాధించువారుగ నుండుట దెల్లము.

వైదికసూక్తముల రచించిన ఋషులెక్కువగ సన్మానింప బడుచుండిరి. వారిని రాజులు గౌరవించుచుండిరి. కొన్ని ప్రత్యేక కుటుంబములవారు మిక్కిలి ప్రశస్తిగాంచియుండిరి. అట్టివానిలో వశిష్ఠ విశ్వామిత్రకుటుంబముల వారెన్నదగియున్నారు. అయిన బ్రాహ్మణ, క్షత్రియ వివక్షత లేక ధర్మబోధకులును, యోధులును వారేయైయుండుట మిక్కిలి గమనార్హమైనవిషయము.

ఈ కాలము క్రీస్తుకు 2000 సం॥కు ముందని యూహింపబడు చున్నది. ఆర్యులు సట్లజునుదాటి, గంగా యమున తటములందిరుగుచు దత్తీరముల కాశీ, మరియు నుత్తరవిహారమున గొప్ప 2 రాజ్యములస్థాపించి యుండిన దినములవి. బ్రాహ్మణోపనిషదారణ్యకములలో గంగాతీరమున నివసించు నార్యుల కురు, పాంచాల, విదేహజాతులయు. వారి ప్రబల

రాజ్యములయు నాగరకతల గురించియు దెలియును. అనగా సూత్రగ్రంథ
ములు బ్రాహ్మణముల తరువాత నే వెలసిన విషయము మీ వరకే తెలుపబడినది.
ఆకాలమున పురోహితుల ప్రాబల్యమున్నట్లు బ్రాహ్మణములనుండియు,
క్షత్రియుల ప్రాధాన్యము పనిషత్తులనుండియు దెలియును. బ్రాహ్మణ
క్షత్రియులు సంఘమున తమ జాతీయతను నెలకొల్పు సమకట్టినట్లు బోధపడు
చున్నది. అప్పుడు వారి స్థితి వ్యక్తిగతముగ నుండి క్రమముగ సమిష్టిగా
మారసాగెను. అంతవరకు బ్రాహ్మణగ్రంథము శిక్షణీయ జ్ఞానమనియు,
వేదములకు బ్రాహ్మణములనుకూలించు వ్యాఖ్యలనియు తలచబడుచుండెను.
బ్రాహ్మణములలో ఢిల్లీనుండి ఒరిస్సావరకు ప్రబలరాజ్యములు విస్తరిల్లి
యుండుటను గురించి వ్రాయబడినట్లీవరకు తెలిపితిమి. ఈ రాజ్యములలో
గ్రామ, నగర, జనపద, పరిషద్విశాలాదికములు వెలసియుండెను.
వేయేల సంపూర్ణముగ నాగరకత వెల్లివిరియుచుండెను. జనక, అజాతశత్రు,
జనమేజయ, పరీక్షితాది ప్రతాపశాలురగు రాజుల వర్ణన లిచట మనకు గాన
నగును. అయిన దక్షిణ భారతమున నివసించు వారిని గురించి యేమాత్ర
ముల్లేఖింపబడలేదు. దీని నవశ్యముగ నాటి యార్యులకు దక్షిణప్రదేశ
పరిచయముండ లేదనవచ్చును.

కురు పాంచాలను లార్యుల ప్రాచీన రాజవంశములు. నేటి
ఢిల్లీ సమీపమున కురువీరుల ప్రసిద్ధమగు రాజధానియుండినది. సుదాసుని
యుద్ధములలో వివరింపబడిన చంద్రవంశీయులగు నుత్తర "కురు", మరియు
నుత్తర "మాద్ర", వంశజులు హిమాలయముల కావలవసించుచుండినట్లు
ఐతరేయ బ్రాహ్మణములనుండి తెలియుచున్నది. "టాలెమీ" నుడివిన
"ఓహారోకోర్ర" ఉత్తరకురువంశమే, అయిన నీ జాతి "కాశఘర్"
మార్గమున కాశ్మీరమున వసియించుచు గంగా తటముల వరకు సాగివచ్చినది.
నీటిపట్టులందు వసించు కురుకులమును జూచి పాంచాలులు ముందుకు నడచి
'కనౌజ్' [కన్యాకుబ్జము] సమీపమున తమ రాజ్యమును స్థాపించిరి. ఈ
పాంచాలులు ఋగ్వేదమున నుల్లేఖింపబడిన "పంచజ" నులే యగుదురు.

ఈ యుభయుల వర్ణనములతో బ్రాహ్మణములు నిండియున్నవి.
వీరి యజ్ఞాడంబరము, పురోహితులరీతి, విద్యా పరాక్రమములు, సభ్యత
మున్నగునవి బ్రాహ్మణములనుండి విశేషముగ దెలియును. వీరప్పుడు

కేవలము కృషీవలులు, తాపసులునై యుండుటలేదు. వీరి చెంత రాజ్యసంపద, సుశిక్షిత సైన్యము, రాజప్రాసాదములు, మంత్రులు, రాజసభలు, రథగజతురగ పదాతి దళములుండెనవి. క్రమముగ పురోహితులు పైకిసాగుచు ధర్మకార్యముల బెంచనారంభించిరి. ధార్మిక, సాంఘికానుభవము నియమానుసారముగ ప్రజలకు గలిగింపబడుచుండెను. స్త్రీలకు తగిన గౌరవము లభించుచుండెను. వారు స్వతంత్రులుగ నుండిరి. కొందర నేకపత్నులను జేసికొనుటయు వాడుకలో నుండెనది.

కురు, పాంచాలురలో యుద్ధములు జరుగుచుండినవి. గంగాయమునల మధ్యప్రదేశము జనాకీర్ణమైనప్పుడు కొందరు గంగనుదాటి ముందుకు సాగిరి. వారి ప్రకారముగ నదులదాటుచు పూర్వాభిముఖులై "గండకీ" నదీతీరము వరకు వ్యాపించి రాజ్యములు స్థాపించ గలిగిరి. "గండకము" కోశలమునకు పూర్వమునను, విదేహమునకు పశ్చిమమున నుండెనది. లోలోన విదేహుల రాజ్యముత్తర భారతమున ప్రధానరాజ్యమయ్యెను.

జనక చక్రవర్తి నిగురించి బ్రాహ్మణములనుండియు, నుపనిషత్తుల నుండియు మనకు దెలియుచున్నది. ఇతడు రాజు మాత్రమే గాక, గొప్ప విద్వాంసుడై యుండెను. ఇతడు శాస్త్రార్థముల జేయుచు విద్వాంసుల దృష్టి నాకర్షించుచుండెను. ఇట్లు జేయుటవలన నీతని కఖండఖ్యాతి జేకూరి యుండినది. ఒకప్పుడు కాశీరాజగు నజాత శత్రువు "ప్రజలు తమకు నిజమగు సురక్షకుడు జనకుడే యని పరుగు లిడుచున్నారు"ని నుడివెను. ఈ జనకు నాస్థానముననే మిక్కిలి ప్రజ్ఞావంతుడగు యాజ్ఞవల్క్యుడు పురోహితుడుగ నుండెను. ఇతడు యజుర్వేదమును సంస్కరించి, శతపథ బ్రాహ్మణము రచించెను. యజ్ఞ విధులను జక్కగ దెలిసినవాడైనను పురోహితుల మిక్కిలి గౌరవించుచుండెను. ఇతనికి యజ్ఞ కర్మలందో నంతగా పట్టింపు లేనట్లు శతపథ బ్రాహ్మణము నుండి స్పష్టమగుచున్నది. జనకుడు పురోహితులకు దెలియని బ్రహ్మజ్ఞానమును బడసి యుండెను. ఈ కారణముచే ననేక పురోహితులు విద్వాంసులు బ్రహ్మజ్ఞానమును బడయుటకై యితని చెంత కేతెంచుచుండిరి. అతడందర నాదరించి సత్కరించువాడు. అయిన నీ రహస్యమును మాత్రము బయల్పరచు వాడు కాదు. ఆ కాలమున క్షత్రియులు కర్మకాండ నేవగించుకొనుచుండిరి. క్రియా

సంస్కారములలో నేమియు లేదని గ్రహించిరి. బ్రహ్మతత్త్వజిజ్ఞాసగా జేయుచు తత్త్వము నన్వేషించుచుండిరి. నాలోనున్న ఆత్మేశ్వర విచార ప్రయత్నమునకు బ్రాహ్మణులు మనసారా తోడ్పాటు నొసగుచుండిరి. ఈ విదేహ దేశపు రాజు ఉపనిషద్విచారముల కెక్కించుటచే రాజులు, విద్వాంసు లతని నధికముగ గౌరవించుచుండిరి.

ఉపనిషత్తులలో ననేక ప్రమాణములు, క్షత్రియులే సిద్ధాంతకులుగ నుండిరను విషయమును జాటుచున్నవి. ఉపనిషదధ్యాయములలో నీ ప్రమాణముల సంగ్రహము పరచితిమి. క్రీ. పూ. 2,000 సం॥ ల నాడు బ్రహ్మజ్ఞానమును క్షత్రియులు బడసియుండిరి.

# బ్రాహ్మణ గ్రంథములు

నాలుగువేల సంవత్సరముల నుండి వేదములు యజ్ఞయాగాది కర్మల ప్రోత్సహించుచున్నవని మహర్షులొప్పుకొని యున్నారు. బ్రాహ్మణము లను వేదములు గనే సమ్మతించిన వారిలో శబర, భర్తృభూతి, శంకర, కుమారిల, విశ్వరూప, మేధాతిథి, కర్క, వాచస్పతి, మిశ్ర, రామానుజ, ఉబ్బట, సాయణాదులు, కలరు. అయిన 19 వ, శతాబ్దాంతమున బ్రాహ్మణములు వేదములు గావని దయానందుడు చాటెను. క్రమముగ పాశ్చాత్య విద్వాంసులు వైదికానుసంధానము చేసి తమ లక్ష్యమును సారించిరి. అథర్వణవేదమును గురించి వ్రాసిన ప్రకరణములలో నుపనిషదాదులయు బ్రాహ్మణములయు నుదాహరణముల బొందుపరచితిమి. అవిగాక "గోపథ" బ్రాహ్మణము [పూ. భా. 2-10] లోని యీ వాక్య ఇంకను స్పష్టపరచుచున్నది.

"ఏవమిమే సర్వే వేదా నిర్మితాః సకల్పాః సరహస్యాః సబ్రాహ్మణాః
సోపనిషత్కాః సేతిహాసాః సాన్వాఖ్యానాః సపురాణాః సస్వరాః
ససంస్కారాః సనిరుక్తాః సానుశాసనాః సానుమార్జనాః సవాకోవాక్యాః"

అర్థము :— ఈ ప్రకారముగ సమస్త వేదములు కల్పములతో, రహస్యములతో, సుపనిషత్తులతో, నితిహాసములతో, అన్వాఖ్యానములతో పురాణములతో, స్వరగ్రంథములతో, సంస్కార గ్రంథములతో, నిరుక్తముతో, ననుశాసనములతో, ననుమార్జనములతో, వాక్యావాక్యములతో వివరితములైనవి.

ఇవిగాక, పాణిని తన యష్టాధ్యాయిలో నిట్లు వివరించి యున్నాడు:

1. దృష్టం సామ 4-2-7
2. తేనప్రోక్తం 4-3-101
3. పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు 4-3-105
4- ఉపజ్ఞాతే 4-3-115
5- కృతేగ్రంథే 4-3-116

మీమాంసా సూత్రమున [12-3-17] కూడ బ్రాహ్మణములు సంహితలనుండి వేరని తలచ బడినవి —

"మంత్రోపదేశో వానభాషికస్య ప్రాయోపపత్తే ర్భాషిక శ్రుతిః ।"

భాషికములు శ్రుతులుగావని యర్థము.

"భాషాస్వరో బ్రాహ్మణే ప్రవృత్తః"

బ్రాహ్మణములలో భాషాస్వర ప్రయోగమున్నది. పై నుదహరింప బడిన ప్రమాణములకన్న ముఖ్యవిషయ మేమన నే విద్వాంసుడును బ్రాహ్మణ గ్రంథములను గురించిన ఋష్యాదుల యనుక్రమణికను వినలేదు. సంహితల ఋష్యానుక్రమణిక యుండినప్పటికిని శాఖల పేరుతో వ్యవహృతమగుచున్న బ్రాహ్మణ భాగము, సంయుక్త సంహితల యనుక్రమణికలలో గూడ బ్రాహ్మణ భాగముల యనుక్రమణికల యొక్కయు ఋషుల చేర్కొన లేదు. కేవలము ప్రజాపతిని మాత్రమే బ్రాహ్మణముల ఋషి యని పలికి యీ విషయమును వదలివేసిరి.

బ్రాహ్మణ గ్రంథములకు వేద సంజ్ఞ యేలకలిగెనో విచారించిన, పురోహితులు వేదములు యజ్ఞపరములను సంప్రదాయమును వెలయించి

తద్వారా భృతి నేర్పాటు చేసికొనెను. వేదముల గంతస్థ మొనర్చు కొనుటయే యతని పని. ఇంతేగాక వేదములకు తన తోచినట్లుగ బ్రాహ్మణముల నుండి వ్యాఖ్యల జేయసెంచెను. కావుననే యతడు బ్రాహ్మణ గ్రంథములకు మహత్త్వము గల్పించెను. కాశిలో విశుద్ధానందుడు దయానందునితో శాస్త్రార్థమొనర్చుచున్నప్పుడొక బ్రాహ్మణపత్రము వేదమని పేర్కొనబడెను.

పురోహితులకు యజమానుని స్త్రీ, ధన, ధాన్యాది సంపదపై అధికారముండినది. మధ్యకాలమున యజ్ఞముల పేరిట హైందవ జీవనమున వ్యభిచారము తాండవము సలిపినది. ఇట్టి చర్యలచే నెందరో రమణీమణులు తమ ప్రాణమానముల గోల్పోయిరి. హింసకు రాజ్యమంతటను చోరవ గలిగి వేల పశువులు యజ్ఞము పేర వధింపబడుచుండెను.

అన్ని బ్రాహ్మణ గ్రంథముల ప్రధానవిషయము యజ్ఞాడంబరమై యున్నది. ముందు వ్రాయబడు విషయ సూచీద్వారా నిది విశదమగును. ప్రతివేద బ్రాహ్మణము నందునొక విశేషమున్నది. ఋగ్వేద బ్రాహ్మణములలో హోతకు [ఋచలబఠించువాడు] యజ్ఞ విషయ కర్తవ్యములు వర్ణింపబడినవి. సామవేద బ్రాహ్మణములలో ముఖ్యముగ నుద్గాత [సామవేత్త]. కర్తవ్యము లభివర్ణితములు. యజుర్వేద బ్రాహ్మణములలో నధ్వర్యుని [యజ్ఞము జేయునతడు] కర్తవ్యములు నిర్దేశింప బడినవి.

## బ్రాహ్మణములలోని ప్రత్యేక విషయముల స్పష్టీకరణ

ఋగ్వేద బ్రాహ్మణములలో నైతరేయ బ్రాహ్మణము అన్నిటికన్న మహత్త్వము గలవిగనున్నవి. ఇవి 40 అధ్యాయములు లేక నైదైదధ్యాయముల యెనమిది పంచికలుగనున్నవి. వీనిలో చివరి యధ్యాయములు పదియును తరువాతి రచనలవలె గనపట్టు చున్నవి. గ్రంథవిషయమును బట్టియు, నిదే విషయమును పూర్ణముగ వర్ణించు 'శాంఖ్యాయన' బ్రాహ్మణములో వీనిని గురించిన ప్రస్తావనయే లేకుండుట వలనను, నవీనములని తెలియుచున్నది. తక్కిన వాటిలో మొదటి యైదు పంచికలకన్న తరువాతి మూడు పంచికలు నవీనములని తోచును; వాటిలో 'ల' కారమును క్రొత్త పద్ధ

తి.రో ప్రయోగించిరి. వీటితో బోల్చిన మొదటియంశము విశుద్ధమైన ప్రాచీన బ్రాహ్మణపద్ధతిలోనున్నది. ఈ బ్రాహ్మణములో 'సోమయాగ' మెక్కువగ వర్ణితమైనది. దీని యధ్యాయములలో నొకటినుండి పదునారువరకు—ఒక దినమున పరిసమాప్తమగు "అగ్నిష్టోమ" యాగము వర్ణింపబడినది. మరల 17, 18 లలో 'గవామయన' యాగమభివర్ణితము. ఇది 360 దినము లాచరింపబడును. 19-24 వరకు ద్వాదశాహయజ్ఞము వర్ణింపబడినది. 25 నుండి 32 అధ్యాయముల వరకుగల వాటిలో అగ్నిహోత్ర వర్ణనమున్నది. చివరగల 33 నుండి 40 వరకుగల యధ్యాయములలో రాజసూయయాగము చెప్పబడినది. ఈ ప్రకారముగ నిది యన్నిటికన్న ప్రాచీనమై సంపూర్ణముగ యజ్ఞయాగముల వర్ణించు బ్రాహ్మణమై యలరారుచున్నది. దీనయందందు ప్రాసంగికముగ కథానకములు, ఐతిహ్యములు, వేదమంత్రముల వ్యాఖ్యలును గలవు.

ముఖ్యముగ బ్రాహ్మణముల సంఖ్య యెంతవరకు గలదో మనమిప్పుడు జూడవలసియున్నది. మొత్తము బ్రాహ్మణములు 35 గలవు. వీటిలో 15 ప్రచురితములైనవి. రెండు ప్రకటింపబడనప్పటికిని లభించుచున్నవి. తక్కిన 18 బ్రాహ్మణములున్నట్లు సాహిత్యమున దెలియును కాని లభ్యములు గాకున్నవి.

ఇట్లు లభింపని బ్రాహ్మణములు :—

1. చరక బ్రాహ్మణము (యజుర్వేదీయము) విశ్వరూపాచార్య కృతమగు 'బాలక్రీడా' టీకలోనుద్ధృతము. ప్రథమభాగపు పుట 48, 80. ద్వితీయభాగపు 86, రెండవభాగమందలి 87 వ పుటలో నిట్లు వ్రాయబడినది.

"తథా అగ్నిష్టోమీయ బ్రాహ్మణే చరకాణామ్"

ఈ యాజుషము చరక శాఖయొక్క ప్రధాన బ్రాహ్మణమై యుండినది. దీనికి సంబంధించిన యారణ్యకము ప్రాచీన హస్తలిపిలో లాహోరు పుస్తకాలయమున గలదు. ఇది ఎక్కువగ సప్తప్రపాఠాత్మకమగు 'మైత్ర్యుపనిషత్తు'ను పోలుచున్నది.

2. శ్వేతాశ్వతర బ్రాహ్మణము (యజుర్వేదీయము) 'బాలక్రీడా' టీక ప్రథమభాగము 8 వ పుటలో నుద్ధృతము. "శ్వేతాశ్వతరోపనిషత్" దీని యారణ్యక భాగమైయున్నట్లు తోచుచున్నది.

3. కాఠక బ్రాహ్మణము [యజుర్వేదీయము] తైత్తిరీయ బ్రాహ్మణపు గొన్ని యంతిమ భాగములకు గూడ 'కఠ' లేక 'కాఠక' బ్రాహ్మణము అందురు. అయిననీ 'కాఠక బ్రాహ్మణము' దానికన్న భిన్నమైనది. ఇది 'చరక'ముల ద్వాదశావాంతర విభాగములలో నొకటి. దీని యారణ్యకముల హస్తప్రతులు గొన్ని వైదికోపాధ్యాయులయింటి గ్రంథాలయములలో నున్నవి. శ్రీనగరము, కాశ్మీరములలో దీని హస్తప్రతులు కలవని ప్రతీతి. ఎఫ్. ఓ. శ్రేడరుగారు సంపాదించిన 'మైనర్ ఉపనిషద్స్' ప్రథమభాగము పు. 31-42 వరకు ముద్రితమైన 'కఠశ్రుత్యుపనిషత్' తైత్తిరీయబ్రాహ్మణపుటంతిమ భాగముగనో, తదన్యశాఖాంశమైయుండవోపు. దీనివచనములను 'యతిధర్మసంగ్రహము'లో - విశ్వేశ్వర సరస్వతి, ఆనందాశ్రమము పూనాసంస్కరణము [1909]-పుట 22 పంక్తి 26, పు. 76 పం 9 లో 'కాఠక' బ్రాహ్మణమను పేరుతో నుద్ధరింపబడినది.

4. మైత్రాయణీ బ్రాహ్మణము-[యజుర్వేదీయము] బోధాయన శ్రౌతసూత్రములు 30. 8 లో నుద్ధృతము. 'నాశిక'లోని మిక్కిలి వృద్ధ బ్రాహ్మణునొకని నీ బ్రాహ్మణమును గురించి ప్రశ్నింపగా నతడు దీని యస్తిత్వమే తనకు తెలియదని నుడివెను. వారు చెప్పినట్లుగా నా సంహితలలోనే బ్రాహ్మణము కలిసియున్నవి. అయిన పూర్వోక్తములగు 'బోధాయనశ్రౌతసూత్రము'ల ప్రమాణము ముద్రితగ్రంథములలో నగుపడలేదు. కావున బ్రాహ్మణము వేరుగనే యుండవచ్చును. 'మైత్రాయణీ' యుపనిషత్తుగూడా నీబ్రాహ్మణముండుటను దెలుపుచున్నది. అయిన పూర్తిగా నిర్ణయమగుటకు 'మైత్రాయణీయ' సంహిత మరల ముద్రింపబడుటావశ్యకమైనది. బరోడా సూచీపత్రము [1925] సం 79 లో వాటి హస్తప్రతులు మూడింటిగను మైత్రాయణీయ సంహితకన్న భిన్నములని వ్రాయబడినది. 'బాలక్రీడ' భా. 2 పు. 27 పం. 3 లో నొక శ్రుతి యుద్ధృతమైనది. కాని దానినే విశ్వేశ్వర యతి 'ధర్మసంగ్రహము' పుట 76 లో 'మైత్రాయణీ' శ్రుతి పేర నుదహరించుచున్నది.

5. భాల్లవిబ్రాహ్మణము - బృహద్దేవతా 5. 23. భాషిక సూత్రములు 3. 15. నారదశిక్షా 9. 13, మహాభాష్యము 4.2.104 లో దీని మత; నామను ఉల్లేఖింపబడినవి.

6. జాబాలబ్రాహ్మణము, [యజుర్వేదీయము] జాబాలశ్రుతి కొంతవరకు 'బాలక్రీడ' భా 2. పు. 94, 95 లో నుద్ధరింపబడినది. ఇది బహుశః బ్రాహ్మణపాఠమైయుండునేమో 'బృహజ్జాబాలోపనిషత్తు' క్రొత్తది. అయిన "జాబాలోపనిషత్తు" ప్రాచీనమైనది. ఈ శాఖను సంబంధించిన 'గృహ్యసూత్రము' [జాబాలిగృహ్యము] గౌతమధర్మసూత్ర 'మస్కరీ' భాష్యపు పు. 67.389 నుద్ధృతమైనది.

7. పైంగిబ్రాహ్మణము - దీనికే 'పైంగ్య'మనియు, 'పైంగాయనీ' బ్రాహ్మణమనియు మారు పేళ్ళుగలవు. ఇది ఆపస్తంబశ్రౌతసూత్రము 5. 18. 8. 5. 29. 4 లో నుద్ధరింపబడినది. శ్రీ శంకరాచార్యులవారును దీనిని "శారీరకసూత్రభాష్యము"లో నుద్ధరించియున్నారు. పైంగికల్పమును గురించి మహాభాష్యము 4. 2. 66, లో వ్రాయబడియున్నది.

8. శాట్యాయన బ్రాహ్మణము-[సామవేదీయము?] ఆపస్తంబ శ్రౌతసూత్రము 10. 12. 13, 14. 21. 1604, 18. పుష్పసూత్రము 8.8.184లో నుద్ధృతమైనది. సాయణాచార్యులు తమ 'ఋగ్వేదభాష్యము' 'తాండ్యబ్రాహ్మణ' భాష్యములలో దీనిని మిక్కిలిగ నుదహరించిరి. బాలక్రీడా భా. 1, పు. 38 లో దీని కల్పము దాహరింపబడినది.

9. కంకతిబ్రాహ్మణము-ఆపస్తంబ శ్రౌతసూత్రము 14-20లో పేర్కొనబడినది. మహాభాష్యము 4.2. 66 'కీల్ హార్న్' సం. పు. 286 పం. 12 లో 'కాంకతాః' ప్రయోగమున్నది. దీనివలనగూడా కంకతిశాఖ యున్నట్లు తెలియుచున్నది.

10. శౌభబ్రాహ్మణము-[మహాభాష్యము] 4.2.66.4.3.105 లో దీనినిగురించి వ్రాయబడినది.

11. కాలబవి బ్రాహ్మణము-[సామవేదీయము] ఆపస్తంబశ్రౌతము 20. 9. 9 లో నుదాహరింపబడినది. ద్రాహ్యాయణశ్రౌతసూత్రము 8- 9 1 5 లో కూడ నిది యుదాహృతము.

12. శైలాలి బ్రాహ్మణము - ఆపస్తంబశ్రౌతము 6. 4. 7. లో నుద్ధృతము.

13. కౌశికి బ్రాహ్మణము. గోభిలగృహ్యసూత్రము 3. 2. 5. లో నుదాహరింపబడినది యిది. 'ధర్మస్కంధ' 'అంతర్యామి' 'దివాకీర్త్య', 'క్షిప్ర' 'శింశుమార' బ్రా. లతో సమానమైన యొక బ్రాహ్మణమై యుండనోపు.

14. ఖాండికేయ బ్రాహ్మణము - [యజుర్వేదీయము] భాషిక సూత్రము 3. 26 లో నుద్ధృతమైనది.

15. ఔఖేయ బ్రాహ్మణము-(యజుర్వేదీయము) భాషికసూత్రము 3. 26 లో నుద్ధృతము.

16. హారిద్రవిక బ్రాహ్మణము
17. తుంబరు బ్రాహ్మణము
18. ఆరుణేయ బ్రాహ్మణము

} ఈ మూడును మహాభాష్యము 4. 3. 104 లో నుల్లేఖింపబడినవి.

## బ్రాహ్మణముల సంకలన కాలము :

బృహదారణ్యకము 4. 6. 3 మరియు 6. 5. 4 లలోని వంశ బ్రాహ్మణముల ననుసరించి బ్రాహ్మణ వాక్యముల కాదిప్రవచనకర్త బ్రహ్మయనియే తెలుపబడినది. ప్రజాపతి, మన్వాది మహర్షుల నామములును బ్రాహ్మణ ప్రవచనకర్తలలో పేర్కొనబడుచున్నవి. అనేక బ్రాహ్మణాంశములు మిక్కిలి ప్రాచీనములైనను అవి యేకాలమునకు జెందినవో నిశ్చయించుట కష్టమైయున్నది. ఇట్లున్నను వీటిని మహాభారతకాలమున కృష్ణద్వైపాయనులు — వేదవ్యాసులు మరియు వారి శిష్యప్రశిష్యులు సంకలన మొనర్చిరని చెప్పవచ్చును. శతపథాదిక బ్రాహ్మణములలో భారత

రచనా కాలమునకు కొంత ముందున్నయైతిహాసిక వ్యక్తుల పేళ్ళు పెక్కు-స్థలములలో వివరింపబడినవి. అవి ఇట్లు—

1. త్రితేన హైర్త్వన భరతోదా వ్యస్తి రజే........
తదేతద్గాథయాభి గీతమ్—
అష్టా సప్తతిం భరతో దౌష్యన్తిర్యమునామను, గంగాయాం వృత్రఘ్నేఽబధ్నాత్ పంచ పంచాశత హయాన్ ఇతి 11.
శకున్తలా నాడపిత్యప్సరా భరతం దధే......13

శతపథము 13. 5. 4.

మరియు—

ఏతేనహవా ఐంద్రేణ మహాభిషేకేణ
దీర్ఘతమా మామతేయో భరతం దౌష్యన్తిమభిషిషేచ,
మహాకర్మ భరతస్య నపూర్వే నాపరేజనాః
దివం మర్త్య ఇవహస్తాభ్యాం । నోదాపుః పంచ మానవాః॥ ఇతి
ఐతరేయ బ్రాహ్మణము 8. 23.

ఈ గాథలు, యజ్ఞగాథలు, శ్లోకములలో వివరింపబడిన శకున్తలా భరతుల పేళ్ళు మహాభారతకాలమునకు కొంచెము ముందున్న వేయగుట ఈ బ్రాహ్మణములు మహాభారతకాలమునాటి వనుట సయుక్తికముగ నుండును.

2. బ్రాహ్మణగ్రంథములు మహాభారతము నాటివని చెప్పుటకు మహాభారతమే సాక్షిగనున్నది. మహాభారతాదిపర్వమున 64 వ అధ్యాయమున నిట్లు వ్రాయబడినది.

బ్రహ్మణో బ్రాహ్మణానాంచ తథానుగ్రహకాంక్షయా
వివ్యాస వేదాన్ యస్మాత్ స తస్మాత్ వ్యాస ఇతిస్మృతః 130. శ్లో॥

వేదానధ్యాపయామాస మహాభారత పంచమాన్,
సుమన్తుం జైమినింపైలం శుకంచైవ స్వమాత్మజం, 131.

ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవచ,
సంహితాస్తైఃపృథక్త్వేన భారతస్యప్రకాశితాః 132.

అర్థము — వేదవ్యాసునకు సుమంతుడు, జైమిని, వైశంపాయనుడు, పైలులను నల్వురు శిష్యులుండిరి. ఈ నల్వురి వలను వేదాధ్యయనాదికముల పారగుల గావించెను. ఈ వ్యాసపారాశర్యుడు వ్యాసుడేగాని యన్యుడు గాడనుటకు మహాభారత శాన్తిపర్వమున ౩౩౫ వ అధ్యాయమునం దిట్లున్నది.

వివిక్తే పర్వతతటే పారాశర్యో మహాతపాః
వేదానధ్యాపయామాస వ్యాసశిష్యాన్ మహాతపాః 26.

సుమన్తుంచ మహాభాగం వైశంపాయన మేవచ,
జైమినించ మహాప్రాజ్ఞం పైలంచాపి తపస్వినం 27.

వైశంపాయనునే చరకుడందురు. కాశికావృత్తి 4. 3. 104 లో నిట్లు వ్రాయబడినది.

వైశంపాయ నాన్తేవాసినో నవ......
చరక ఇతి వైశంపాయనస్యాఖ్యా,
తత్ సంబంధేన సర్వేతదన్తేవాసి నశ్చరకా ఇత్యుచ్యన్తే,

మరల మహాభాష్యము 4. 3. 104 లో పతంజలి- "వైశంపాయ నాంతే వాసి కఠః, కఠాన్తేవాసి ఖాడాయనః । వైశంపాయనాంతే వాసీ కలాపీ" అని వ్రాసియున్నాడు.

ఈ శిష్యపరంపర నిట్లు తెలిసికొనవచ్చును



వీరిలో 1-3 ప్రాచ్యులు; 4-6 ఉదీచ్యులు. 7-9 మాధ్యములు.

మహాభాష్యము 4. 2. 138. కాశికావృత్తి 4. 3. 104 పూర్వోక్త నామములనుండి—

1. హారిద్రవిణః, 2. తౌంబురవిణః, 3. ఆరుణిః,

ఈ మువ్వురును మహాభాష్యము 4. 2. 104 లో బ్రాహ్మణగ్రంథ ప్రవచనకర్తలనబడిరి. మరియు సాంప్రతికములగు బ్రాహ్మణములన్నియు మహాభారతకాలమున సంగ్రహింపబడినవని నిర్వివాదముగ తెలిసినది.

3. యాజ్ఞవల్క్యులును మహాభారతము నాటివారే. మహాభారత సభాపర్వము 4 వ అధ్యాయములో—

“బకోదాల్భ్యః స్థూలశిరాః కృష్ణద్వైపాయనః శుకః సుమన్తుర్జైమినిం పైలో వ్యాసశిష్యస్తథావయమ్. 17. తిత్తిరిర్యాజ్ఞవల్క్యశ్చ ససుతో రోమహర్షణః”

ఈ మహర్షులందరు యుధిష్ఠిరుని సభలో శోభిల్లుచుండిరి.

శతపథ బ్రాహ్మణము యాజ్ఞవల్క్యప్రోక్తమైనది. దీనిని గురించి కాశికావృత్తి 4. 3. 105 లో నిట్లు వ్రాసియున్నది.

బ్రాహ్మణేషు తావత్ భాల్లవినః,
శాట్యాయనినః ఐతరేయిణః,
...పురాణప్రోక్తేష్వితికిం,
యాజ్ఞవల్కాని బ్రాహ్మణాని...
యాజ్ఞవల్క్యాదయో ఽచిరకాలా
ఇత్యాఖ్యానేషు వార్తా.

జయాదిత్యుని యీ వ్రాత మహాభాష్యమునకు విరుద్ధముగ నున్నది. ఇతని యనుమానమునకేదో యొక ప్రాచీనాఖ్యాయిక కారణమై యుండ నోపు. అయిన నతని యభిప్రాయము దానినుండియు సిద్ధించుటలేదు.

బ్రాహ్మణ గ్రంథముల యవాంతర భాగములకును బ్రాహ్మణములని పేరు. శతపథ బ్రాహ్మణములోని యనేకావాంతర బ్రాహ్మణము లత్యంత ప్రాచీనములు, వాటి దృష్ట్యా యాజ్ఞవల్క్య ప్రోక్తములగు బ్రాహ్మణములు నవీనములు. అధ్యాయములోని లేఖాధి ప్రాయము సమగ్ర శతపథ బ్రాహ్మణమునకు గాక దాని యవాంతర బ్రాహ్మణములకు సంబధించినది. "భాల్లవి" "శాట్యాయని" "ఐతరేయ" యాది బ్రాహ్మణములకు ప్రవచనములు వ్రాయబడినప్పుడే శతపథ బ్రాహ్మణమునకు వ్రాయబడినది. వీనిలో ఐతరేయ బ్రాహ్మణ ప్రవచన కర్తయగు "మహిదాసు" సుమన్త్వాదులకన్న ప్రాచీనుడు [చూడుడు ఆశ్వలాయన గృహ్యసూత్రము 3. 4. 4.] యాజ్ఞవల్క్యుడును వీనికి సహకారిగ నున్నాడు. అయిన నీ యాజ్ఞవల్క్యుడు మహాభారత కాలమున నుండి శతపథ బ్రాహ్మణమును ప్రవచించెను.

వాల్మీకి రామాయణము బాలకాండ, సర్గము 71, శ్లో. 6 ననుసరించి సీత తండ్రియగు దైవరాత జనకునితో యాజ్ఞవల్క్యునకు సంవాదము జరిగియుండినది. మహాభారత శాంతిపర్వములో 315 అధ్యాయము శ్లో. 3. 4., అ 323 శ్లో 22, 23, లలో పైవిషయము వివరింపబడినది. దాని నెవరును సందేహింపరు. దైవరాతి జనకుల నేకులుండవచ్చును. మహాభారత కాలమున నొక ప్రసిద్ధ జనకుడుండెను. అతనికి వైయాసియగు శుకునకును సంవాదము జరిగినది. దైవరాతి జనకుడదే కాలము లేక కొంచెము మొదటి వాడుగ నుండియుండును. మహాభారతమున నిదేశ్రికరణాంత్యమున భీష్ముడు దైవరాతియగు జనకునకును, యాజ్ఞవల్క్యునకును జరిగిన సంవాద నైజమును దైవరాతియగు జనకునకడనే తెలిసికొనియుండెను.

భీష్మ ఉవాచ — ఏ తన్మయాఽఽప్తం జనకాత్ పురస్తాత్
తేనాపిచాఽఽప్తం నృపయాజ్ఞవల్క్యాత్
జ్ఞాతం విశిష్టం నతథాహి యజ్ఞా
జ్ఞానేనదుర్గం తరతేన యజ్ఞైః 109.

శాంతి పర్వోపదేశ సమయమున భీష్ముని వయసు 200 సం॥ లకు కొంత తక్కువై యుండును. ఈ లెక్క ప్రకారము దైవరాత జనకుడు మహాభారత యుద్ధమునకు 150 సం॥ లోపుననే యుండి యుండును. కావున

శతపథ బ్రాహ్మణము గూడమహాభారత కాలముననే ప్రోక్తమైనదని తలపవచ్చును.

4. శతపథ బ్రాహ్మణము తత్ప్రవచనకర్తయగు యాజ్ఞవల్క్యుడును మహాభారత కాలమువారే యనుటకు శతపథబ్రాహ్మణమే సాక్షిగానున్నది.

ఇట్లు:—

,,అథపృషదాజ్యం తదుహ చరకాధ్వర్యవః పృషదాజ్యమేవాగ్రేఽభి ఘారయన్తి ప్రాణః పృషదాజ్యమితి వదన్తస్తదుహ యాజ్ఞవల్క్యం

శతపథము 3. 8. 2 24.

చరకా- ధ్వర్యూనను వ్యాజహార,,-

తాఉహ చరకాః, నానైవ మంత్రాభ్యాంజుహ్వతి ప్రాణోదానౌ వా అస్యైతౌ నానావీర్యౌ ప్రాణోదానౌ కుర్మ ఇతి వదన్తస్తదుత

థ్వానకుర్యాద్-

శతపథము. 4. 1, 2. 19.

యుదితం చరకేభ్యో వాయతో వాను బ్రవీత్ శ. 4. 2. 4. 1.

తదుహ చరకాధ్వర్యవో విగృహ్ణంతి శ. 4. 2. 3. 15.

ప్రాజాపత్యం చరకా ఆలభన్తే శ, 6. 2 2. 1.

ఇతిహాస్మాహ మాహిత్థిర్యంచరకాః ప్రాజాపత్యేపశావాహురితి,

శతపథము 6. 1. 1. 10.

తదుహ చరకాధ్వర్యవః,

శతపథము 8. 1, 3. 7.

ఇత్యాదిస్థలములలో ,,చరక,, లేక 'చరకాధ్వర్యు' లని చెప్పబడిన వారందరు వైశంపాయనుని శిష్యులే. వాయుపురాణ పూర్వార్ధమున అధ్యాయము 62 లో గూడా నిది సమర్థింపబడినది.

బ్రహ్మహత్యాతుమైశ్చీర్ణా చరణాచ్చరకాః స్మృతాః,
వైశంపాయన శిష్యాస్తే చరకాః సముదాహృతాః 23.

ఇదివరకు చెప్పినట్లుగా చరక- వైశంపాయనులు మహాభారతకాలమునకు సంబంధించినవారు. ఇట్లుండ నీ గురు శిష్యులను గురించి చెప్పు గ్రంథము మహాభారతమునకు ముందెన్నడు నుండజాలదు.

[5] యాజ్ఞవల్క్యుడు, శతపథ బ్రాహ్మణను మహాభారత కాలముననుండినట్లు చెప్పుటకు కింకొక ప్రమాణముగలదు.

జనకమహారాజు సభలో యాజ్ఞవల్క్యునకు తదితర ఋషులకు జరిగిన గొప్ప సంవాదమును గురించి శతపథ బ్రాహ్మణమున కాండము 11_14 లో నున్నది. ఋషులలో నొకడు "విదగ్ధశాకల్యు" డుండెను. 11. 4, 603. యాజ్ఞవల్క్యుని యొక్క ప్రశ్నకు సమాధాన మొసగ కుండుటచే నతని మూర్ధ్నము పడిపోయినది. 14. 5. 7, 26. ఈ శాకల్యుడు ఋగ్వేదప్రసిద్ధ ఋషిగా నున్నాడు. ఇతడు పదకర్తలలోను సర్వశ్రేష్ఠుడు. ఇతని పూర్తి పేరు దేవమిత్ర శాకల్యుడు. (బ్రాహ్మవాహ సుతుడగు యాజ్ఞవల్క్యుని [వాయు పు. పూర్వార్ధము 60 41] తోను శాకల్యునకు జరిగిన సంవాదము వాయు పు. పూ. 30. 60 లో గూడ నున్నది. వాయు పురాణ పూర్వార్ధము అధ్యా 60 ననుసార మీ దేవ మిత్ర శాకల్యుని [విదగ్ధుని] పూర్వోత్తరముల యందు ఋగ్వేదీయాచార్యుల గురుపరంపర యీ క్రిందివిధముగ నుండినది.



తాండ్య, దైవత, షడ్వింశ, మంత్రబ్రాహ్మణ, సంహితోపనిషత్, ఆర్షేయవంశ, సామవిధాన, జైమిన్యుపనిషత్, తలవకార, శాట్యాయన, కాళబవి మున్నగు బ్రాహ్మణగ్రంథములు సిద్ధమయ్యెను.

క్రమక్రమముగ వేదములకు గల సహజమహత్వము నష్టమయ్యెను. స్వార్థపరులగువారు యజ్ఞముల పేరిట భయానకహింసలను, వ్యభిచారమయను పాపముల జేయనారంభించిరి. కొన్నిశతాబ్దాల వరకీ యకృత్యములు సాగుచుండినవి, చివరకు జైన బౌద్ధధర్మములుదయించెను. ఈ యుభయ ధర్మములును క్షత్రియపరములై బ్రాహ్మణులు, వారి హింసామయములగు యజ్ఞములకు విరుద్ధముగ క్రాంతిని బయలు దీసినవి. ఈ ధర్మద్వయము వైదిక ధర్మమున కొనర్చిన యాఘాతమువలన బ్రాహ్మణులశక్తి కృంగి ఛిన్నాభిన్న మైనది. వారు వేదాంగముల నిర్మించిరి. శిక్షాకల్పముల సృజించిరి. బౌద్ధులను జూచి కల్పసాహిత్యమును ప్రాయికముగ సూత్రములుగ జేసిరి. ఇది నాలుగు విభాగములుగ జేయబడినది. శ్రౌత, గృహ్య, ధర్మ, శుల్బసూత్రములని. ఒక్కొక్కరకపు సూత్రముల ననేకాచార్యులు రచించిరి. ఇవన్నియు నుపలబ్ధములు.

శ్రౌత సూత్రములలో యజ్ఞవిధులు వర్ణింప బడినవి. గృహ్య సూత్రములలో గర్భాదానాది 18 గృహ్య సంస్కారములభివర్ణితములు. ధర్మసూత్రములలో దైనిక జీవన పద్ధతి, ఉత్తమలోక ప్రాప్తి సాధనము. పుణ్యపాపాదికములు వివరింప బడినవి. మరియు శుల్బ సూత్రములలో యజ్ఞశాలాదికముల నిర్మించుట, తద్విధులు తెలుపబడినవి.

మూడవ వేదాంగమగు వ్యాకరణములో లౌకిక, వైదిక, సంస్కృత భాషా నియమముల వర్ణన లున్నవి. నాల్గవ వేదాంగమున- నిఘంటువు- వైదిక కోశ వర్ణనము [నిరుక్తమీ నిఘంటువునకుటీక]; అయిదవ వేదాంగమగు ఛందమున లౌకిక వైదిక ఛందోవర్ణనమును; ఆరవదగు జ్యోతిషమున యజ్ఞసమయోచిత తారలు, నక్షత్రాదిక వర్ణనలున్నవి.

3. గోపథ బ్రాహ్మణ పూర్వభాగమున 1.5 నుండియు నిదే సిద్ధమగును "యాన్ మంత్రానపశ్యత్ స అథర్వణో వేదో౽భవత్"—

బ్రాహ్మణ గ్రంథములో స్వయముగ బ్రాహ్మణ భాగములవ నుపనిషత్తులను వేదములని యన నప్పుడు బ్రాహ్మణములెట్లు వేదములు గాజాలును?

6. పాణినీయ సూత్రము :- శౌనకాదిభ్యశ్ఛందసి 4. 3. 106 నుండి గూడ శౌనకుడేదో శాఖ లేక బ్రాహ్మణ ప్రవచన కర్తగ నుండునని తెలియు చున్నది. చాలమట్టుకీ శాఖ ఆశ్వలాయనులదై యుండును. ఆశ్వలాయనుడు శౌనకుని శిష్యుడు. శౌనకుని శిష్యుడగుటచేతనే ఆశ్వలాయనుడు తన శ్రౌత సూత్రములు లేక గృహ్యసూత్రముల యంతమున- నమః శౌనకాయ నమః, శౌనకాయ, అని వ్రాసియున్నాడు.

7. శాఖా ప్రవర్తకుడగుటచే శౌనకుడు వ్యాసునకు సమీపవర్తి. ఇదిగాక మహిదాసుని యైతరేయము గూడ కృష్ణద్వైపాయన వ్యాసునకు దగ్గరదే. ఈ యైతరేయము మహిదాసుని ప్రవచన మగుట యైతరేయ బ్రాహ్మణము మహాభారత కాలము నాటిదే. మరియు నిదే మహిదాసుని యుల్లేఖమగుటు ఛాందోగ్యోపనిషద్బ్రాహ్మణమును మహాభారత కాలము నాటిదే. ఉపనిషద్భాగము కొంత తరువాతనైనను గావచ్చును. ఏలన యాజ్ఞవల్క్యాది ఋషులాకేదినమున బ్రాహ్మణము నంతయు నిర్వచించి యుండరు. దీని ప్రవచనమున నెన్నియో వత్సరములు బట్టియుండును. తాండ్యాది ఋషులు ఛాందోగ్యాద్యుపనిషత్తుల నిర్వచించునప్పుడు మహిదాసైతరేయుడు దేహమును చాలించియుండును. తక్కినఋషులకన్న నీమహిదాసు కొలది కాలమే జీవించి యుండును.

8. జైమిన్యుపనిషద్బ్రాహ్మణము 4. 2. 11. ను గురించి క్రింద వ్రాయబడిన వాక్యముకూడ నిదే విషయము దెల్పును-

ఏ తద్ధ తద్విద్వాన్ బ్రాహ్మణ ఉవాచ మహిదాస ఐతరేయః.....సహ షోడశశతం వర్షాణి జిజీవ.

9. ఐతరేయారణ్యకము ఐతరేయ బ్రాహ్మణపు టంతిమభాగమే యైయున్నది. దానిలోను మహిదాసైతరేయుని పేరుగలదు.

తరువాత వారు కావున వీరి గ్రంథములును మహాభారత సమకాలికములే.
చాలామట్టుకు శతపథ బ్రాహ్మణము 6, 6, 2. 25లో—

అథ హాస్మాహ తాండ్యః

తాండ్యుని గురించిన విషయ మీతనిదే.

ఈ ప్రకారమనేక ప్రమాణములనుండి బ్రాహ్మణములు మహాభారత సమకాలికములని సిద్ధమైనది. నాటి వైదిక సూక్తములు, బ్రాహ్మణము లందలి దీర్ఘములగు మాటలు, వాటి తారతమ్యమును గురించి యించు కాప్రోచించితమేని నాటి సాంఘిక వ్యవస్థ మన కట్టెదుట నిలచును. కేవల మాకాశామువైపు జూచియు, సూర్యోదయమును దిలకించియు సహస్ర హితులగు వాక్యలు క్రమమున జాతిని విస్తృతపరచిరి, జనపదముల సృజించిరి. ప్రజాపతి, రాజ్యము, నాగరికతను సంబంధించిన స్థాపక రణముల నెన్నిటినో వారు నిర్మించియుండిరి. ఇట్టిస్థితిలో వారెట్లు వర్షాధి దేవతయగు నింద్రుని, ప్రభాతాభిమాని యగు నుషను కేవలము నిరాడంబరముగ బూజింపగలరు? ఇప్పుడు వారిలో కొంత రూఢియు, నాడంబరమును, సాంసారికతయు, ప్రమాదమునననవి చేరియుండినవి. సాయంకాలార్ఘ్యముగంటె గొప్పగొప్ప విధానములతో గూడిన రాజసూయాశ్వమేధాదిక దైర్ఘ్య కాలికానుష్ఠానముల జేయసాగిరి, యజ్ఞనియమములు, చిన్నచిన్న మాటలపై గురుత్వము, హీనోద్దేశములు మానవుల స్వచ్ఛహృదయములలో- కేవలము వేదవిశుద్ధ భావనలుగల హృదయములలో- నిర్మలవర్ష జలములలో ధూళీలవములు జేరునట్లు జేరినవి. కావుననే బ్రాహ్మణముల రచనాప్రణాళికలో నొక గొప్ప యంతర మేర్పడినది.

ఇదేరీతిగ నైరోపా సాహిత్య చరిత్ర సాగినదనుటకు నిదర్శనములు గలవు. మధ్యయుగ పురాతితహాసము, కల్పితగాథలు, పదునాలుగు, పదునైదు శతాబ్దములలోని సాహిత్యపు పోకడలలో నడువలేము. 'హ్యూమ్', 'గిబ్బన్', 'స్కాటులు' మధ్యకాలపు శైలిననుకరింపరైరి. దీనికి కారణము- ఒకేరకపు వర్ణనలు- కేవలము యాంత్రికములుగ, తోచుటయే.

మహారాష్ట్ర ఎలిజబెత్ కాలములో 'షేక్స్పియర్' మరియు 'బెకన్'ల సాహిత్య ప్రతిభల అనంతరమైనోత్సాహావేశములలో రచనా సామర్థ్య ముండినది. జనులలో బుద్ధివికాసము తర్క, వాణిజ్య, శిల్పశాస్త్ర ప్రమాణాదికముల యందుత్తరోత్తరాభివృద్ధి గాంచుచుండినది. ఇదియే ఉత్సాహసాహిత్య సృష్టిలో పరిణమించుటను జూపు నతిశయము. ఋగ్వేద సూక్తములలో కేవలము పంజాబును గురించియే వ్రాయబడినది. అగ్ని యజ్ఞములకును, సంఘ సంస్కారాదికములకును సింధునదీతటమో లేక దాని శాఖ సరస్వతియో మూలస్థానమై యుండినది.

అయిన బ్రాహ్మణములలో నాధునిక 'ఢిల్లీ' పరిసరముల 'కురు' వంశీయులయు, నేటి 'కనౌజు' పరిసరముల 'పాంచాలు'రయు, ఉత్తర ఖండములోని 'విదేహుల' యొక్కయు, 'అయోధ్య' లోని 'కోశలు' ల యొక్కయు, ప్రస్తుతపు 'వారణాశి' పరిసర 'కాశీయుల'యు నుల్లేఖనములు లభించును. వీరు మిక్కిలి యాడంబరములతో యజ్ఞయాగాదికముల నొనర్చి, వాటి ప్రచారముచేసిరి. వీరిలో నజాతశత్రు, జనక, జనమేజయుల వంటి ప్రతాపశాలురగు రాజులుండిరి. బ్రాహ్మణములలో వీరి సంస్కృతి, వీరి యితిహాసములే మనకు లభించుచున్నవి. పంచనదదేశ మీకాలము వారికి జ్ఞాపకములేకుండినది. దక్షిణభారత మింకను వీరికి దెలిసియుండ లేదు. లేక ఈ ప్రాంతములవారి నాటవికులని వదలిరేమో- అయిన, తరువాత సూత్ర గ్రంథములలో దక్షిణదేశపు గొప్పగొప్ప రాజ్యములను గురించి మనకు వివరములు లభించును.

ఆరణ్యకములలోనిది బ్రాహ్మణముల తరువాత సాహిత్యము. వీటిని బ్రాహ్మణముల తుదియంశములని తలచవచ్చును. ఇవి అడవులలో జదువ బడుటచే 'నారణ్యకము' లనియు గృహస్థులు యజ్ఞములలో ప్రయోగించుటచే 'బ్రాహ్మణము' లనియు పేర్లు గలిగిన వనియు 'సాయణులు' నిర్వచించిరి.

ప్రసిద్ధధార్మిక విశేషములతోగూడిన భాండారములనబడు నుపని షత్తుల గలిగియుండుటచే నారణ్యకములకింత మహత్వమబ్బినది. బ్రాహ్మ ణముల తరువాత 'కపిల', 'బుద్ధ'ల ప్రౌఢవిచారముల ప్రచార మొకవంక లాగుచుండ బ్రాహ్మణముల రూఢివాదసాహిత్య మెట్లు కొనసాగగలదు?

అప్పుడు భారతీయుల హృదయములలో నూతన ప్రోత్సాహము తలలెత్తుచుండెను. వారు వింధ్యపర్వతమునకు దక్షిణమునగల యొక క్రొత్త భూభాగమును గురించి తెలిసికొనసాగిరి. మహాత్ముడగు 'అగస్త్యుడు' ఈ దక్షిణాపథమును వారికి జూపెను. పరిప్రశ్నములను భక్త్యుత్సాహవివేచనతో ఉపనిషత్తుల రచించుచున్నవారు బ్రాహ్మణములు ద్వేషింపసాగిరి. సత్పుర్వుడగు 'కపిలుడు' ప్రచండుడగు తత్వవేత్తయు, దార్శనికుడునగు నుండెను. ఇతడు తన యసదృశపాండిత్యముచే భరత వర్షమునంతయూ స్వాశ్రితులజేసెను. బుద్ధుడు తన దుఃఖవాదసమస్యా సత్యచ్ఛమును ఆత్మవాదరూపమున, బ్రాహ్మణధర్మ, కర్మలచే విసిగి వేసారిన-జనాంగమునకు బోధింపసాగెను.

బ్రాహ్మణములు లోపించుటయే దీనికి ఫలితము. అగ్రహారాపేక్షము అగు విస్తృత నియమములను జనులేవగించుకొనసాగిరి. అట్టితరి అన్నిధర్మములు, సంఘనియమములు సంక్షిప్తములుగ వ్రాయబడెను. విస్తృతములగు బ్రాహ్మణముల రచనలనుండి విముఖులగు వారికి సంగ్రహముగ వ్రాయున దొక కళగాపరిణమించెను. దీనికి ఫలితముగ గూఢములగు దార్శనిక విషయముల నిర్మాణమయ్యెను. ఈ విధముగ నాడంబరమయములగు బ్రాహ్మణములపై వివేకమయమగు కాలము సూత్రగ్రంథముల ద్వారా విజయమును బడసినది.

## బ్రాహ్మణములనాటి సంఘ జీవనము :

ఈ కాలమున బ్రాహ్మణ క్షత్రియులలో పరస్పరాధిక్యతను గురించి స్పర్థలేర్పడి యుండినట్లు ఉపనిషత్తులనుండియు, బ్రాహ్మణములనుండియు దెలియుచున్నది. బ్రాహ్మణులు బ్రాహ్మణ ప్రోక్తములగు యాగాదికర్మల దగుల్కొనినప్పుడు- క్షత్రియు లుపనిషత్తులందలి మూలతత్వమగు బ్రహ్మజ్ఞానము ప్రాపించుకొనిరి. ఈ జ్ఞానము బ్రాహ్మణుల కుపదేశింప బడకుండినది. ఇంతేగాక ఈ రహస్య మితరులెరుంగకుండుటకై దాచబడుచుండెను. ఇట్టి యుదాహరణలిచట గానగును-

విదేహాధిపతియగు జనకునొద్దకు అప్పుడప్పుడే గురుకులముల వదలి వచ్చిన ముగ్గురు బ్రాహ్మణులు పోయిరి. వారినిజూచి రాజు "మీకు

వారుద్దాలకారుణేయుని చెంత కలిగిరి. ఈవిషయమున నాఋషికి సందేహముండినది. కావున వారినతడు అశ్వపతికైకేయుని కడకు బిలచుకొని పోయెను. రాజు వీరినాదరించి నిలుపుకొనెను. మరునాడు వారందరు సమిధలగొని రాజు సన్ముఖమున శిష్యులరీతి నుపవిష్టులైయుండ వారికత డాత్మేశ్వర జ్ఞానము ప్రసాదించెను.

కౌశీతక్యుపనిషత్తు [1. 1] లో ఉద్దాలకారుణి మరియు నతని పుత్రుడు శ్వేతకేతు ఉభయులును సమిధలగొని "చిత్రగాంగాయనీ" రాజు కడకేగ నతడు వారికి బోధించెనని వ్రాయబడి యున్నది.

కౌశీతకీ యుపనిషత్తు [4] లో ప్రసిద్ధ విద్వాంసుడు గార్గ్యబాలాకి మరియు విద్వాంసుడగు కాశీరాజు- అజాత శత్రు- నకును జరిగిన వాద వివాద విషయికమగు నొక ప్రసిద్ధగాథ వ్రాయబడినది. ఈ బ్రాహ్మణు డెన్నియో విషయముల దర్శించినను రాజునెదుట శాస్త్రార్థమున నోడి పోయెను. అప్పుడజాతశత్రుడతనితో "నీకింతియే తెలుసు" ననగా నతడు "నేనంతయే తెలిసియుం" ననెను. రాజపుడు 'నీ కీశ్వరీయజ్ఞాన మొసగవలెనా!' యని ప్రశ్నించి 'అతడు సర్వ వస్తువుల సృజించినవాడు. ఇదంతయు అతని మాయ. కేవల మతని గూర్చియే తెలిసికొనవలె'నని బోధించెను.

అపుడు బాలాకి సమిధలగొని 'నీ చెంతను శిష్యుడనై వత్తునా!' యని యడుగ నజాత శత్రుడతని కుపదేశించెను.

ఇది, మరియు శ్వేతకేతాఋణి, ప్రవహణ జైవకీయుల కథలును బృహదారణ్యకోపనిషత్తులో వివరింప బడినవి.

ఇవిగాక నుపనిషత్తులలో క్షత్రియులు ధర్మబోధ జేయుటలో దిట్టలుగ నుండిరని తెలుపు వాక్యముల నేకము గలవు.

వేదయుగము ముగియునంతలో నార్యులు గొప్ప గొప్ప రాజ్యముల స్థాపించుకొనిరి. ఈమాట యింతవరకు జెప్పబడిన విషయమును గమనించిన

లలో వారికి సమానులుగా నుండుటచే వారి కన్యల జేబట్టుటలో తొలుదొల్త సులభమై యుండును. తరువాత బ్రాహ్మణులు క్షత్రియులపై ప్రాధాన్యతను బొందినప్పుడు తమ కన్యల వారికిచ్చుట మానిరి.

ఈ కాలమున గలిగిన వర్ణభేదము విభిన్న వ్యవసాయ మూలమునచే యనుట స్పష్టము. వాయుపురాణములో- ఆది లేక కృతయుగములో జాతిభేదమనునది లేకుండెను. కొంతకాలమైన పిదప మానవుల కార్యములం బట్టి వారిలో భేదములను బ్రహ్మ కలుగజేసెను. "వారిలో శాసించు యోగ్యత గలవారును యోధులును, యితరుల రక్షించుటలో నేర్పుగల వారును నగు వారిని క్షత్రియులుగ జేసెను. క్షత్రియులతో గలసిమెలసి యుండి సత్యవాక్య నిరతులును, చక్కగా వేదఘోష సలుపువారును బ్రాహ్మణులైరి. బక్కపలుచగ నుండి దుర్బలులగువారును, వ్యవసాయమును జేయువారును, వ్యాపారికులును- కృషి, వాణిజ్యములచే భృతిని సంపాదించువారును వైశ్యులనాబడిరి. గ్రామమును శుభ్రపరచుచు, నున్యోగముల జేయువారును, కొద్ది బలము లేక పరాక్రమము గలవారును శూద్రులనబడిరి." ఇట్టి వర్ణనలే పురాణములలో పెక్కులు గలవు.

తనకేయగు నవీన సాహిత్యరూపమును రామాయణము మిక్కిలి ప్రాచీనకాలముననే యేర్పరచుకొని యుండెడినది. పైన జెప్పినప్రకారము ఉత్తరకాండ 14 వ అధ్యాయమున కృతయుగమున కేవలము బ్రాహ్మణులే తపమొనర్చుచుండిరనియు, త్రేతాయుగమున క్షత్రియు లుత్పన్నమైరనియు అప్పుడే యాధునికములగు నాల్గువర్ణములు లేర్పడినవనియు వ్రాయబడినది. ఈ కథాభాగమును నైతిహాసిక భాషలో మార్చుకొని జూచిన వైదికయుగములో ఆర్యులు గలసియుండి యైతిహాసిక కావ్యకాలమున ధర్మాధ్యక్షులును రాజులును విడివడి ప్రత్యేకజాతుల స్థాపించిరి. సామాన్య జనులును వైశ్య, శూద్రాది జాతులవారుగ విభక్తులైరి.

మహాభారతముకూడ తన కాలమున నిగ్గుదేలిన స్వరూపమును గల్గిన మిక్కిలి పురాతన గ్రంథమనుట మనము జూచితిమి. దానిలోను జాతుల యుత్పత్తిని గురించి ప్రత్యక్షాధారములగు వర్ణనలు పెక్కులుగలవు. శాంతిపర్వపు 188 వ అధ్యాయములో సుఖాసక్తులును, క్రోధనులు నగు గౌరవర్ణ

ద్విజులు సాహసులై రాజులకు యుద్ధయోగాది క్రియల నరచిరి. వారు క్షత్రియులుగ మారిరి. చేతకష్టులగు బ్రాహ్మణులు గోసంరక్షణ వ్యవసాయ ములచే జీవించువారు తమ విధుల విస్మరించి వైశ్యులయిరి. అపవిత్రులును, అసత్యవాదులును లంచగొండులు నగు బ్రాహ్మణులు పలురకముల పనులుచేసి బ్రతుకువారు శూద్రులైరి. ఈ ప్రకారముగ ద్విజులు తమ కర్మల ననుసరించి వేరువడి వివిధ జాతులవారుగ నేర్పడిరి.

ఈ వాక్యములను, మరియు ఇట్టి వాక్యములను వ్రాయువారు నిస్సందేహముగ నాలుగు జాతులు బ్రహ్మశరీరములో నాలుగు భాగముల నుండి పుట్టినవను కథను తెలిసికొని యుండిరి. అయిన వారీ విషయమును స్వీకరింపక ఇవి వర్ణచాతుర్వర్ణ్యమని తలచిరి. ఇది గమనించితే, మొదట వర్ణవ్యవస్థ లేకుండినదనియు, పక్షపాతులు, వ్యవసాయ భేదముచే తరువాత జాతులుగలిసి యుండవచ్చునని వారు వ్రాసియుండిరి. ఈ విషయమునుంచి యైతిహాసిక కావ్యకాలమున జాతిభేద మెట్లుండెనో విచారింతము.

మొదట గంగాతీర వాసులందే జాతిభేద మంకురించినదని యిదివరకే చెప్పబడినది. అయిన హైందవుల స్వాతంత్ర్య మడుగంటువరకు నీ పద్ధతి యొక్క దుష్పరిణామము కనుటకు అవకాశము కలుగదయ్యె. ఇతిహాసిక కావ్య కాలమునగూడ బ్రాహ్మణులు, క్షత్రియులు సరియగు సర్వవిషయిక జ్ఞానమును పూర్వులవలె పొందుట కర్హులని తలచబడుచుండిరి. మరియు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో కొన్ని సమయములందు వివాహములు జరుగుచుండెను, కావున ప్రాచీన భారతేతిహాసమును జదువువారీ జాతిభేద పద్ధతినిగురించి ఎంత చింతించినను, భారతదేశమున మహమ్మదీయులు రాక పూర్వమట్టి దుష్ఫలితములు తలయెత్తలేదను విషయమును మాత్రము జ్ఞాపక ముంచుకొనవలయును.

శుక్ల యజుర్వేదములో- నది సంగ్రహింపబడిన కాలమున- సంఘములోని జనులొనర్చుచున్న యనేక వ్యవసాయములను గురించి వ్రాయబడినది. దీనిలో వివరింపబడిన శిల్పములును వివిధ వ్యవసాయములను గురించినవే కాని, వివిధజాతులను గురించినవి కావని స్పష్టమగును. 20, 22 ఖండికలలో పలురకముల చోరులను గురించియు, 26 వ రాతులు,

సారథులు, కాల్బలములను గురించియు చెప్పబడినది. ఇదే విభాగమున 27 వ ఖండికలో వివరింపబడిన వడ్లవారు, రథములను జేయువారు, కుమ్మరి, కమ్మరి మున్నగువారు వివిధ కార్యముల జేయువారేగాని భిన్న జాతులవారు కాదు. ఆ దేఖండికలో నిషాదాదుల వర్ణనలు గలవు. నేటివలెనే నాడును వీరు హిందూసంఘములో క్రిందిమెట్టుముననే యుండిరనియు బోధపడును.

ఇదే గ్రంథపు 30 వ అధ్యాయములో నీ నామావళి మిక్కిలి పెంచబడి యుల్లేఖింపబడినది. ఈ యధ్యాయము మిగుల ప్రాచీనదనియు వాస్తవమున నిదియుపోద్ఘాతమనియు నీవరకే తెలిపితిమి. అయిన దీనిలో గూడ ననేక వ్యవసాయముల దెలుపు పేళ్లును గలవు. కాని వానిలో వైశ్యులనేక జాతులలో విడివడినట్లైనటను ప్రమాణము గానరాదు. దీనిలో నటులు, వక్తలు, సభాపతులు, రథకారులు, వడ్ల, కుమ్మరి, రత్నవ్యాపారులు సేద్యగాండ్రు, ధనుర్బాణముల జేయువారును పేర్కొనబడిరి. మరియు కుంటి, గ్రుడ్డి, గూని, చెవిటివారిని గురించియు, వైద్యులు, జ్యోతిష్కులు, ఏనుగులు, గుఱ్ఱములు, పశువుల బెంచువారు, ద్వారపాలకులు, భృత్యులు, వంటలవారు, కట్టెలు తెచ్చువారు, చిత్రకారులు మరియు పాత్రలు మున్నగు వానిపై పేళ్లను జెక్కువారు, చాకలి, వస్త్రాలద్దువారు, మంగలివారు, విద్వాంసులు, గర్విష్ఠులు మున్నగువారి పేళ్లును, స్త్రీలయు, చర్మకారులయు వ్యాధులయు, స్వర్ణకారులు, వ్యాపారుల పేళ్ళను, నానావిధ రోగులయు పేళ్ళు లభించును. నకలీ వెంట్రుకల జేయువారు, కవులు, గాయకులు, ఈ పేళ్ళన్నియు జాతులకు సంబంధించినవి కావని స్పష్టమగుచున్నది. ఇవిగాక మాగధ, సూత, భమిల మృగయు, స్వనిన, దుర్మేదాది నామములు తైత్తిరీయ బ్రాహ్మణమునను పేర్కొనబడినవి మాత్రమే యిచట జెప్ప వలసి యుండినది.

పైజెప్పిన పేళ్ళనుండి ఆ కాలపు వృత్తులు, వ్యవసాయములెట్టివో సాంఘికవ్యవస్థ లెట్టివో తెలియనగునే కాని యీ నామావళికిని, జాతులకు నెట్టి సంబంధము లేదని తెలియవలెను. ఐతిహాసిక కావ్యకాలమునను, తరువాత మహమ్మదీయు లిచటికి వచ్చునంత వరకును ఆర్యులలో ననేకులు వైశ్యులుగ నుండి యనేక వ్యవసాయముల జేయుచుండిరి. వైశ్య,

బ్రాహ్మణ, క్షత్రియులు గలసి ద్విజులయిరి. వారే యీ జాతివారిని స్వీయ, మరియు పైతృకములగు విద్యలను, ధర్మములను గరచుటకు యోగ్యులుగ జేసిరి. కేవలము పరాజితులగువారే శూద్రులనబడిరి. వీరు ద్విజుల స్వత్వములనుండి దూరము చేయబడిరి.

ప్రాచీన కాలపు జాతిరీతులందును, నేటి వర్ణవ్యవస్థ యందును ముఖ్యభేదమిదియే. పురాతన కాలమున జాతి బ్రాహ్మణులకును, క్షత్రియులకును కొంత విశిష్టాధికారము నొసగియుండినది. బ్రాహ్మణ, క్షత్రియులును యితరులును దమతమ వృత్తులజేయుచు యొకేవిధమగు ధర్మశిక్షణమును బడయుచుండిరి. వారొకే పాఠశాలలలో జదువుచు, నొకే సాహిత్యము నభ్యసించుచు, నొకేరకపు నానుడులు, జాతీయములు, సామెతలనుపయోగించుచు, నొకేచోట భుజించుచుండిరి. తమలో దామన్ని విధముల సంబంధముల గలిగి యొండరులతో వివాహాదులొనర్చు కొనుచు, దమచే పరాజితులగు వారికి భిన్నులై “ఆర్య”లనిపించుకొనుటయే గౌరవమని తలంచిరి. అయిన ప్రస్తుతజాతి వైశ్యార్యులను నూర్లకొలది సంప్రదాయములచే వేర్వేరొనర్చినది. ఈ సంప్రదాయములు జాతిభేదమును విస్తరింప జేసినవి. వారిలో పరస్పర వివాహాదులను, తదితర సాంఘిక సంసర్గములను మాయజేసి, ధర్మజ్ఞాన సాహిత్యా భావమును గలుగ జేయుచు వారిని వాస్తవముగ శూద్రులుగ నొనర్చినది.

బ్రాహ్మణములలో ననేక స్థలములందు వివరింపబడిన వాక్యముల వలన మొదట జాతిభేదమంతగ లేకుండినట్లు దెలియుచున్నది. ఉదాహరణార్థము ఐతరేయ బ్రాహ్మణము [60-29] లో నొక యపూర్వవాక్య మిట్లున్నది—ఏ క్షత్రియుడయినను యజ్ఞమున బ్రాహ్మణుని భాగమును భుజించినచో వాని సంతానము బ్రాహ్మణుని గుణములు—“దానముపుచ్చుకొనుట, సోమరసాస్వాదనాపేక్ష, భోజనప్రియత్వము మున్నగు గుణములు గలిగి యిచ్ఛానుసారము దేశముల దిరుగుటలు” గలదగును. మరియు “రెండు లేక మూడవ తరములోనది [సంతానము] పూర్ణముగ వాత్సల్య యోగ్యమగును.” ఒకవేళ వైశ్యుని భాగము నతడు భుజించిన “నతనికి వైశ్యుని గుణములుగల—ఇతర రాజులకు సుంకముల జెల్లించునట్టి—సంతా

నము కలుగును.,, మరియు ,,రెండు లేక మూడు తరములలో వారు వైశ్యజాతి వారగుటకు యోగ్యులగుదురు.,, అతడు [క్షత్రియుడు] శూద్రుని భాగమే దినిన నతని సంతానములో ,,శూద్రుని గుణములుండును. వారికుచ్ఛులగు పైమూడు జాతుల సేవ జేయవలసి యుండును. మరియు తమయజమానుల యిచ్ఛననుసరించి తొలగింపబడుటకు, శిక్షలబొందుటకును, వారర్హులగుదురు.,, మరియు ,,రెండు లేక మూడుతరములలో వారు శూద్రత్వమును బడయుటకు యోగ్యులగుదురు.,,

వేదకాలపు జనకుడు యాజ్ఞవల్క్యునకు ముందెన్నడెరుగని బ్రహ్మజ్ఞానము నుపదేశించెననియు, నాటినుండి యుపదేష్ట బ్రాహ్మణుడుగ తలపబడెననియు నీవరకే తెలిపితిమి. [శత. ప. బ్రా. 11, 6, 2, 1] ఐతరేయ బ్రా. [2. 19] లో ,,ఇలూషు,,ని పుత్రుడు ,,కవషు,,ని వృత్తాంతము కలదు, దానిలో నతనిని, యితర ఋషులు ,,బ్రాహ్మణుడు కాని యొక దాసీ పుత్రుడెట్లు మాతోబాటు దీక్షితుడు కాగల,, డని యాగమునుండి వెడలనడచిరి. అయిన గవషుడు దేవతలను, నతనిని దేవతలును దెలిసి యుండుటచే నతడు ఋషుల శ్రేణివాడయ్యెను. ఇదేవిధముగ ఛాందోగ్యోపనిషత్ [4. 4.] లో సత్యకామ, జాబాలుల హృద్యమగు కథ—నాకాలమున నిజము పలుకు వారును, విద్వాంసులునగు వారినే యాదరించుచుండిరి. మరియు నట్టివారే యున్నతజాతి వారుగ దలచబడుచుండిరి. ఈ కథ సారళ్యమునను, గాథాశిల్పమునను మనోహరమైనదగుట దానినిచట లిఖించుటయుక్తమని దలచెదము.

,,1. జాబాల పుత్రుడు, సత్యకాముడు తన తల్లితో ,,అమ్మా! నేను బ్రహ్మచారిని కాదలచితిని. నా వంశమెయ్యది,, యని ప్రశ్నించెను.

2. ఆమె యతనితో ,కుమారా! నీవే వంశము వాడవో నాకు దెలియదు. నా యౌవనములో, నేను దాసిగా నున్నప్పుడు, నిన్ను గర్భమున దాల్చితిని. నీవేవంశము వాడవో నాకు దెలియదు. నా పేరు జాబాల, నీవు సత్య కాముడవు; కావున నీవు, సత్య కామజాబాలుడనని నుడువుమనెను.

3. అతడు హారిద్రుమతుడగు గౌతముని కడకేగి ‹మహాశయా, మీ చెంతను బ్రహ్మచారిగ వసించుటకు వచ్చితిని. నేను రావచ్చునా?› యని యడిగెను.

4. అతడతనితో ‹మిత్రుడా, నీవేవంశమువాడవని› యడిగెను అందుల కతడిట్లనెను— ‹మహాశయా, నేనే వంశమువాడనో నాకు తెలియదు. నేను మా తల్లినడుగ నామె తన యౌవనదశలో, దాసిగనున్నప్పుడు, నన్ను గర్భమున ధరించెననియు, నేనే వంశమునకు జెందినవాడనో తనకు దెలియదనియు జెప్పి తన పేరు జాబాలయనియు, నేను సత్యకాముడన నియు జెప్పినది. ఈ కారణమున, ఓ మహాశయా, నేను సత్యకామ జాబాలుడను.

5. అతడు ‹నిజముగ బ్రాహ్మణుడు దప్ప నింకెవరిట్లు పలుకజాలరు. మిత్రమా, పోయి సమిధలగొనిరమ్ము. నేను నీకు దీక్షనొసగెదను. నీవు సత్యమునుండి తొలగలేద› నెను ››

ఈ కారణమున నీ సత్యప్రియుడగు యువకుడు దీక్షితుడయ్యెను. మరియు నతడా కాల పద్ధతి ననుసరించి గురువుగారి పశువుల మేపుటకై కొని పోవుచుండెను. ఇట్లుండ గొంత కాలమునకే యతడు ప్రకృతి, పశువుల నుండి నేర్వదగిన గొప్ప విషయముల నన్నిటిని నేర్చుకొనెను. అతడు మేపు మందలోని వృషభములనుండియు, ప్రేల్చుచున్న అగ్నినుండియు, సంధ్యా సమయమున తన యాలమందను గోష్ఠమున గట్టినప్పుడును, సంధ్యాగ్నిలో సమిధలవేసి యచట గూర్చుండినప్పుడును, చెంతనే యెగురుచున్న రాజ హంసలు మొదలగు పక్షులెగురుచున్నప్పుడును వానినుండి క్రొత్త విషయముల నేర్చుకొనుచుండెను. ఒకనాడీ యువకుడు గురుని చెంతకేగ నతడు ‹‹మిత్రమా, నీవు బ్రహ్మను దెలిసిన వానివలె బ్రహ్మతేజముతో నొప్పుచున్నావు, నీకెవరీ విద్యం గరపిరో వచింపు›› మని యడిగెను, అందులకు శిష్యుడగు సత్యకాముడు ‹‹మానవులు కారు››దని బదులు జెప్పెను. అతడు నేర్చిన విద్యయతని హృదయమున నాటిన శబ్దములలో నణగి యుండినది. అది—నలువైపులను, పృథివ్యాకాశములును, స్వర్గ, సముద్ర సూర్య, చంద్రాగ్నులును, జీవుల యింద్రియములు, మనస్సు — సారాంశమేమన:

విశ్వమే బ్రహ్మము - ఈశ్వరుడునైయున్నది. దానిచే సత్యము బ్రహ్మజ్ఞానము పొందెను.

ఉపనిషత్కాలమున నున్న స్థితియిట్టిదే, మరియు నిది యీ ప్రకారముగనే కల్పిత గాథలచే వర్ణింపబడియుండినది. దీనినిగురించి ముందు తెలుపబడును. ఈకథ వ్రాయుటలో తాత్పర్యమేమన నిట్టిగాథలు పుట్టునప్పటికి జాతిభేదము లింత కఠినముగ నుండలేదు. ఈ కథనుండి తనతండ్రి విషయమే తెలియని దాసీ పుత్రుడు కేవలము సత్యము పలుకుట చేత బ్రహ్మచారి యయ్యెను; ప్రకృతి మరియు నాటి పండితులతనికి నేర్పగలిగినంత నేర్చి కడకు గొప్ప ధర్మబోధకుడయ్యెను. ఆకాలపు జాతి, మత సాంప్రదాయములలో స్వాతంత్ర్యముండిన దనుటలో సందేహము లేదు.

యజ్ఞోపవీతపరిచారమైతిహాసిక కావ్య కాలమునుండి చేరియున్నది.- శతపథ బ్రా. [2, 4, 2] లో బ్రహ్మచెంతకు వచ్చిన దేవతలు, పితరులుగూడ యజ్ఞోపవీతముల ధరించియుండిరనియు, కౌషీతక్యుపనిషత్తు [2, 1] లో సర్వజయించువాడగు కౌషీతకి యజ్ఞోపవీతమును ధరించి ఉదయమున సూర్యు నారాధించుననియు వ్రాయబడి యున్నది.

ప్రాచీనకాలమున కేవలము యజ్ఞము జేయునప్పుడే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు యజ్ఞోపవీతమును ధరించు చుండిరి. అయిన నా ప్రాచీన కాలమున హిందువులు సభ్యులును, శిష్టులునై యుంటికిని, సంఘమునకును సంబంధించిన పనుల నెరవేర్చుకొనుటకై సూక్ష్మములగు నీమముల నేర్పరచుకొని యుండుటను మనము పొగడుచున్నాము. రాజాస్థానములు విద్యానిలయములై యుండెను. అచటికన్ని జాతుల బుద్ధిమంతు లాహ్వానింప బడుచుండిరి. వచ్చిన వారి కాదర సత్కారములు జరుగుచుండెను. విద్వాంసులగు నధికారులు న్యాయముగ వర్తించు చుండిరి. జీవితపు బ్రతిపనియు నియమానుసారము జరుపబడుచుండెను. అందరికిని గట్టిగోడలు గల యందమగు నిండ్లు, నగరములును వెలసి యుండెను. ఆ పురములలో న్యాయాధీశులు, దండనాథులు, పురరక్షకులు నివసించు చుండిరి. వ్యవసాయ

ప్రైవేట్ స్కూళ్ళను బోలి యుండినవి. ఈ పాఠశాలలలో చదువునుద్దేశముతో పలుచోట్లనుండి విద్యార్థులు వచ్చుచుండిరి. వీరు విద్య నేర్చుకొను కాలమున గురువులకు దాసులవలె శుశ్రూషల జేయుచు పదిరెండు వత్సరముల తరువాత నుచితదక్షిణ నిచ్చి తమయిక్కలకో, బంధువుల చెంతకో బోవుచుండువారు. వృద్ధులై సంసారముల వదలి వానప్రస్థమునకున్న బ్రాహ్మణుల చెంతకు నసంఖ్యాకులగు విద్యార్థులరుదెంచుచుండిరి. ఈ ప్రకారము హిందువులలో విద్య, జ్ఞానముల కెంతవిలువ యుండినదో అంత యే యితర జాతియందు ప్రాచీన నవీన కాలములందును, గలుగలేదు. హిందూ శాస్త్రసారము సద్ధర్మ కర్మాచరణములవలన కేవలముచితఫలమును, జీవితమున సుఖమును గలుగును. అయిన నీశ్వర సాన్నిధ్యముచే నైక్యమును బడయుట మాత్రము సుజ్ఞానముచేతనే సిద్ధించును.

విద్యార్థులు పదివత్సరములలోను. గురువులయొద్దనువారి పరంపరాగత విద్యలబడసి తమతమ గృహములకువచ్చి, వివాహముల జేసికొని గృహస్థధర్మముల పాలించుచుండిరి. వివాహితులైనతోడనే గృహస్థధర్మము లారంభమగుచుండెను. గృహస్థుడగువాడే దేనొక శుభనక్షత్రమున హోమాగ్నికి జలములివ్వవలెను. ప్రాతస్సాయంసమయములందు అగ్నికి క్షీరములర్పించుటయు, నన్నిటికన్న ముఖ్యముగ నతిథి సత్కారము గృహమేధులకు విహితములు. హిందువుల కర్తవ్య సారాంశ మీ వాక్యములనుండి తెలియనగును—

,,నిజము పలుకుము! మీకర్తవ్యమును బాలింపుము! వేదపఠనమును మానకుడు! గురువులకుచితరీతి దక్షిణలొసగిన పిదప మీబాలుర జీవితముల వమ్మొనర్పకుడు! సత్యమును విడువకుడు! కర్తవ్యమును వదలకుడు! హితవాక్యముల నుపేక్షింపకుడు! అలసులు గాకుడు! వేదపఠన పాఠనమున నాలస్య మొనర్పకుడు!”

,,దేవ పితృ కార్యముల మరువకుడు! మీ తలిదండ్రులను దేవతలుగా భావింపుడు! మీ గురువును దేవతగా భావింపుము! నిష్కళంకమగు పనుల జేయుటయందే బుద్ధి నిలుపుము. ఇతరముల మానుడు! ఏయే మంచి పనుల మేము జేసితిమో మీరును జేయుడు.!,, [తైత్తిరీయ ఉపనిషత్ 1,2]

ధనవంతుల ధనము బంగారు, వెండి, ఆభరణములు, రథ, గజాశ్వములు, ఆవులు, వేసడములు, దాసులు, ఇండ్లు, ధాన్యములు, పొలములు నైయుండెను. [ఛాందోగ్యోపనిషత్ 5, 13, 17, 10, 19, 24; శతపథ బ్రాహ్మణము 3, 2. 48; తైత్తిరీయ ఉపనిషత్ 1, మరియు 12 వెు॥ ]

క్రింద వివరింపబడిన ఛాందోగ్యోపనిషద్వాక్యములనుండి నాటికాలపు కొన్ని ధాతువుల సంగతి తెలియును.

"బంగారమును వెలిగారము తోడను (లవణముతో) వెండిని బంగారముతోను, సత్తును వెండిచేతను, సీసమును సత్తుతోడను, ఇనుమును సీసము తోను నతుకుదురు." [4.17.7]

ఐతరేయ బ్రాహ్మణము [8.22]లో అత్రిముని కుమారుడు "సర్వాభరణ భూషితములును, సర్వాది శాసితములు" నను పదివేల ధేనువులను, పదివేల దాసీజనమును దానమొసంగెనని వ్రాయబడి యున్నది. ఈ విషయ మతిశయోక్తులతో నిండియున్నది.

హస్తినాపురము, కాంపిల్య, అయోధ్య, మిథిలావాసుల మొప్పది శతాబ్దముల క్రింద సాంఘిక జీవనమును మన కనులయెదుట నిలుపుకొనిన నప్పటి నగరములు కోటలచే నావరింప బడియుండెను, వానిలో సుందర భవనములు, శ్రేణులు నుండినవి. అవి నేటి యిండ్లు, సీనులను పోలక నుత్కృష్టములుగ నుండెను. రాజభవనము లెల్లప్పుడు నగర మధ్యమున కోలాహలముతో గూడిన పరదారులును, సభ్యులగు బంట్లును, పవిత్రులగు సాధుసన్తులును, విద్వాంసులు: పురోహితులు వచ్చుచు, పోవుచున్నట్టి స్థలములందే- నిర్మింపబడుచుండెను. ఘనకార్యముల సాధించుపట్ల రాజభవనముల ముందు జనులు గుమిగూడు చుండిరి. రాజును ప్రేమించుచు యతని మాటల శిరసావహించుచు, భక్తిచే నతని బూజించుచుండిరి. వారు రాజభక్తికన్న నితరమైనది లేదని విశ్వసించు చుండిరి. బంగారు, వెండి, ఆభరణములు, రథములు, గుఱ్ఱములు, వేసడములు దాసదాసీజనము, నగర పరిసర భూములు గృహస్థులయు, నగరవాసులయు సంపదయై యుండెను.

పేరు ప్రతిష్ఠలుగల ప్రాంతమంతయు పవిత్రాగ్ని వేల్చబడుచుండెను. వారి ఋషుల సత్కరించుచుండిరి, దేశపు కట్టుబాట్ల ననుసరించుచు, బ్రాహ్మణుల సహకారముచే బలు ప్రసంగము, విద్యను గౌరవించుచుండిరి. ఆర్యుల ప్రతిబాలుడును చిన్నతనముననే బడికి పంపబడుచుండెను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులొక్క పాఠశాలలో గలసిమెలసి యొకే ధర్మశిక్షణను బడయుచుండిరి. తరువాత నిలుజేరి వివాహముల జేసికొని గృహస్థులై మెలగు చుండిరి. పురోహితులు, యోగులు సాధారణ జనాంగములోనివారై యుండిరి. సామాన్య జనులతో భోజనాదికములును, కన్యలనిచ్చి పుచ్చి కోలును జరుపుచుండిరి. పలురకముల పనులజేయు శిల్పులు, కళాకుశలురగు వారు సంఘమున కవసరమగు పనులు జేయుచు తమ విద్యను తరతరములకు సాగించు నుద్దేశమున తమ కుమారులకు బోధించుచుండిరి; అయిన వారు మాత్రము వేరు జాతులుగ గోలిపోలేదు. సేద్యము జేయువారు తమ పశువులను, నాగలి మున్నగు పనిముట్లను గొని తమతమ గ్రామములలో నివసించుచు భారత దేశాచార ప్రకారము తమతమ పల్లెయుల వ్యవస్థను పంచాయతులద్వారా చేసికొనుచుండిరి. ఈ ప్రాచీన జీవిత విధానమును గొప్పగ వర్ణింపవచ్చును. అయిన పాఠకులే దీనిని బాగుగ నూహించుకొన గలరు. మనమిప్పుడా ప్రాచీన జీవితవిధానమును వర్ణించుట మాని యా సంఘముననున్న స్త్రీలస్థితి యెట్లుండినదో విచారింతము.

ప్రాచీన కాలమున స్త్రీలకెట్టి పరదా పద్ధతి లేకుండెనని యీవరకే చెప్పబడినది. హైందవ నాగరికత మొదలైనప్పటినుండి- భారత నారీ మణులకు సంఘమున గౌరవస్థానముండినది. వారు పైతృక సంపత్తిని బడయుచు దానికి యజమానులగుచుండిరి. వారు యజ్ఞయాగాది ధర్మ కార్యములలో పాల్గొనుచుండిరి, మరియు వారు మహోవసరములయందు గొప్ప గొప్ప సభలకు బోవుచు నాటి శాస్త్రములు రాజనైతికవిద్యల యందారితేరుచు, శాసనాధికారమును గలిగియుండిరి. అయిన వారు మానవ సంఘములో నేటి యూరోపా స్త్రీలవలెగాక మితముగ వర్తించుచుండిరి. వీరిని పరదాలలో నుంచి, బందీలుగా జేయుట హిందువుల వర్తనకాదు.

బ్రాహ్మణ గ్రంథములనుండి యా కాలమున స్త్రీలకుగల ప్రతిష్ఠను దెలుపు కొన్నియైన వాక్యముల నుదహరింపవచ్చును. అయిన నొకటిరెండు

వాక్యములిచట వ్రాయబడుచున్నవి. మొదటిది- యాజ్ఞవల్క్యుడిల్లువదలి యడివికి బోవునాటి సాయంకాలమున సతినికి, నతని భార్యకు జరిగిన సుప్రసిద్ధ సంభాషణమైయున్నది.

[1]. యాజ్ఞవల్క్యుడు వేరువృత్తి నవలంభించుచునప్పుడు ,,మైత్రేయా, నేనీ యిలువీడి నిజముగ పోవుచున్నాను. కావున నీకును, కాత్యాయనికిని వ్యవహారము సరిపోవునట్లు జేయుదలచితిని,, నని పలికెను.

[2] ,,స్వామీ, సంపత్సమృద్ధమగు ప్రపంచ మంతయు నాయెడల నేనమరత్వమునుబడయగలనా ?,, యని మైత్రేయి యడుగగ యాజ్ఞ వల్క్యుడు ,,బడయజాలవు, అపుడు నీ జీవితము ధనవంతులజీవితమును బోలినది మాత్రమగును, ధనమునుండి జీవిత మెన్నడు నమరము కాదు,, ని సమాధాన మొసగెను.

[3] అనిన మైత్రేయి ,,అమరత్వము నొసగని పదార్థముల దీసికొని నేనేమిజేయగలను. నాకుస్వామియగు మీరే ముక్తిమార్గము బోధింపు'' డని ప్రార్థించెను.

[4] యాజ్ఞవల్క్యుడు ,,నీవు నాకు నిజముగ ప్రియమైనదానవు. నీ వింపగు మాటలాడితివి. రమ్ము, ఇటుగూర్చుండుము. నే జెప్పుమాటలను సావధానచిత్తవై యాలకింపుము చెప్పెద''ననెను.''

ఆతడుపనిషత్తులలో మాటి మాటి కుద్ఘోషింపబడిన ,,సర్వాంతర్యామి యగు నీశ్వరుడు పతిపత్ని సుతాదులందును, బ్రాహ్మణ క్షత్రియులందును, విశ్వమందంతటను నిండియున్నా,,డను జ్ఞానము మైత్రేయి కుపదేశించెను. మైత్రేయి విద్య, బుద్ధి, సుగుణములు గలదగుట నీ గొప్పసిద్ధాంతమును స్వీకరించి, తెలిసికొనినది. ఆమె ప్రపంచమునొకెత్తుగను, నీ దివ్యోపబోధను నొకెత్తుగను దలంచుచుండినది.

## బృహదారణ్యకోపనిషత్

విదేహ దేశపు జనకమహారాజు నాస్థాన పండితులతో సంబంధముగల యుపనిషత్తులోని రెండవ భాగము నే యిట నుదహరించుచున్నాను.

„విదేహ దేశపు జనకుడొక యశ్వమేధయాగమును జేసెను. అందు యాజ్ఞికుల కతడసంఖ్యాక ద్రవ్యమును దక్షిణగ నొసంగెను. అచటికి కురు, పాంచాల దేశపు బ్రాహ్మణులు వచ్చిరి. వచ్చినవారిలో నధిక పాండిత్యము గలవారెవరో రాజు తెలియగోరి, అట్టి వారికిచ్చుటకై యలంకరింపబడి, కొమ్ములకు పదిపది సువర్ణనాణెములగట్టిన వేయియావులను జూపెను.

„అపుడు జనకుడు సభవారితో నిట్లనెను—'పూజ్య విప్రులారా, మీలో నిందరికన్న పాండిత్యము గలవారీయావుల వదలించుకొని పోండు" ఈ మాటలనువిన్న బ్రాహ్మణులు సాహసింపరైరి. అట్టియెడ యాజ్ఞవల్క్యుడు తన శిష్యునితో 'కుమారా' ఈ యావుల మందనదలించికొని పొమ్ము„ న నతడు 'సామవిదునకు జయమగు గాక' యని పలుకుచు బసులగొం పోయెను.„

బ్రాహ్మణులిది చూచి మిక్కిలి కోపముచే, గర్వితుడగు యాజ్ఞ వల్క్యునిపై ప్రశ్నల గురిపింప సాగిరి. అప్పుడు వారి ప్రశ్నలన్నింటికి నతడొక్కడె సమాధానములనీయ సమర్థుడు; హోతయగు నశ్వలుడు, జరత్కారుడు, ఆరతభాగుడు, భూజ్యులాహ్యాయని, ఉషస్త చాక్రాయనుడు, కేహోల, కౌషీతక్య, ఉద్దాలక, ఆరుణి మున్నగువారు యాజ్ఞ వల్క్యుని ప్రశ్నింపసాగిరి. ఆతడెందును లొంగకుండుటచే పండితులొక్కరొక్కరే శాంతివహించిరి.

ఇంతగొప్ప సభలో నాడువిద్యా పాండిత్యములలో నారితేరిన యొకే యొకవ్యక్తి గార్గి అను స్త్రీ మాత్రముండినది. (ఆకాలపువారి రీతిని దెలుపు నపూర్వ విషయము) ఆమె యీ సభలో నిలిచి „ఓ యాజ్ఞవల్క్య! కాశీ లేక విదేహ దేశపు యోధపుత్రుడొకడు తన వింటికి నల్లెత్రాడు బిగించి, బాణ ములు రెంటిదొడగి పగతురను జీల్చుటకు నిలుచుభంగి, నేను రెండు ప్రశ్నల నైగొని నీతో పోరాడుటకు నిలచియున్నాను. నా యీ ప్రశ్నల కుత్తర మిమ్ము„ నికఠినముగ బలికెను. ప్రశ్నలు వేయబడెను, యాజ్ఞవల్క్యుడు త్తరమీయ గార్గి [వాచక్నవీ] నిరుత్తరయయ్యెను.

హైందవ నారీరత్నములు తమ భర్తల బుద్ధి విషయికములలోను, జీవితమున వారికి ముదము గూర్చుటయందును, ధర్మకార్యములలోను భాగినులుగ దలచబడుచుండిరి. దీని ననుసరించి వారికి పేరు ప్రతిష్ఠలును గలుగుచుండినవి. వారు భర్తల యాస్తికివలె తండ్రుల యాస్తికిని యజమానులగుచుండిరి. దీనివలన వారికి గల నాటి యాదరము ప్రకటమగుచున్నది.

అనేక పురాతన జాతులవలె హిందువుల యందును బహుభార్యాత్వముండినది. ఒకని కేదగో స్త్రీలుందురు, కాని యొక స్త్రీకొకే కాలమున ననేకులు భర్తలుండరు.,, [ఐతరేయ బ్రాహ్మణము 3.23.]

ఐతరేయ బ్రాహ్మణము [1,8,3,6] లో నొక యద్భుత వాక్యమున్నది. దానిలో:3 లేక 4 తరములవరకు ఆత్మీయ బంధువులలో వివాహమాడుట నిషిద్ధమైనది. ,,కావున ననుభవించువాడు [పతి] మరియు ననుభవింప బడునది [పత్ని] యు నొకే పురుషునినుండి యుద్భవింతురు,, ,,వీలన బంధువులు, 3 లేక 4 తరములలో. మేము మరల గలిసెదమని సంతోషపడుచు గూడియుందురు.,,

# వేదాంగములు

ముండకోపనిషత్తులో పరాపరలను ద్వివిధ భేదములతో విద్యయొప్పుచున్నది. అక్షయ బ్రహ్మజ్ఞానము నొసంగునది ,,పరా,, విద్యయైన, ,,నపర,,లో ఋగ్యజుస్సామాథర్వణములును, శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త చ్ఛందో జ్యోతిషములును గలవు. ఇది వేదాంగములాకింటి ప్రాక్తలెక్క తోలుత వీనిని గురించిన గ్రంథములుగాని, విశేషశాఖలుగాని లేక కేవలము విషయము మాత్రమే యుండినది. దాని యధ్యయనము వేదములతో బాటు జరుగుచుండినది. వేదాంగముల యారంభమును గురించి బ్రాహ్మణారణ్యకములనుండి తెలియవచ్చును. తరువాత సమయమొదగినట్లెల్ల నీ విషయములపై గ్రంథములు వెలసి ప్రత్యేకశాఖలుగ వేదముల నంటిపెట్టుకొని యుండినవి. ఆరువేదాంగములలో ,,కల్పము,, ,,జ్యోతిషము'' లు

దప్ప తక్కిన నాలుగంగములును వేదముల సమ్యగుచ్చారణమునకును, విషయ గ్రహణమునకును తోడ్పడును. ధార్మికయజ్ఞములను "కల్పము", సరియగు సమయమును "జ్యోతిషము" తెలుపుట కేర్పడియున్నవి.

శిక్షా విషయమును తెలుపుటకై యేర్పడిన "శిక్షా సూత్రములు" "కల్పసూత్రము" అంత ప్రాచీనములు. బ్రాహ్మణ గ్రంథముల కుత్తర భాగములుగ కల్ప సూత్రములున్నచో, వేదాంగశిక్షా విషయమును వేద సంహితలకు చేరువగ నుండుటయే నీరెంటి యంతరము.

శిక్షా :

ఈ వేదాంగమును గురించిన మిక్కిలి ప్రాచీనమగు వర్ణన తైత్తిరీయా రణ్యకమున [7. 1], తైత్తిరీయోపనిషత్తు [1.2] నందును లభించును. దానిలో నక్షరములు, ఉదాత్తానుదాత్త స్వరములును. శబ్దవిభాగ సంఖ్య, క్రమబద్ధమగు పాఠములలో శబ్దసమూహములు శిక్షాక్రమమున సారధ్యా యములలో విభక్తమైనవి. యజ్ఞములవలెనే ధార్మికావశ్యకతల బట్టి "శిక్షా"యును బుట్టినది. యజ్ఞకార్యముల పూర్ణమొనర్చుటకు వాటిని గురించికాని, యజ్ఞములను గురించికాని తెలియుట మాత్రమే సరిపోదు. అయిన వేదమంత్రముల సమ్యగుచ్చారణయు, తప్పులులేక వల్లించుటయు నావశ్యకములు. దీనివలన శిక్షాగ్రంథములు పొందుపడియుండుట పరిణమించినది. ఏలన ఋగ్వేదమంత్రములు తొలుత వెలువడిన రూపముననే మనకిప్పుడు లబ్ధములు గావు; వాటిసంపాదకు లాశబ్దములనే మాత్రము తారుమారు సేయకున్నను వానియుచ్చారణా వైశిష్ట్యము, ఉదాత్తానుదాత్త స్వరక్రమముల ప్రయత్నముగ శిక్షా పద్ధతిలో నమరియున్నవి. ఉదాహరణార్థము మనము సంహితలో నిట్లు చదువుదుము– "త్వంహ్యంగే."

ప్రాచీన సూత్రకారులు దీనిని "త్వంహిఅంగే" అనినట్లు మనము సిద్ధపరచవచ్చును. అయిన వైదిక సంహితలే శైక్షికులచే విరచితములు. సంహితలలోనున్న పాఠములకు విశేషముగ పదపాఠముకూడ చేయబడును. దక్షిణమున "ఘన", "జట" ఇత్యాది పాఠములు వాడుకలో నున్నవి. సంహిత పద పాఠముల భేదమొక యుదాహరణముచే స్పష్టమగును. ఒక ఋగ్వేదమంత్ర మిట్లున్నది–

ఐతరేయారణ్యకమున వర్ణింపబడిన శాకల్యుడే ఋగ్వేదమునకు పద పాఠ మొనర్చినట్లు తెలియుచున్నది.

పద, సంహితా పాఠములు శిక్షా సంప్రదాయము మిక్కిలి ప్రాచీన కార్యములకై యున్నవి. ఈ విషయమును తెల్పు గ్రంథములలో మిగుల పురాతన మైనది "ప్రాతిశాఖ్యము", దానిలో చెప్పబడిన నియమముల సహాయమున నే సంహితా పాఠము నుండి పద పాఠ మొనర్పవచ్చును. ఇది గాక ఉచ్చారణము, శబ్దము లేర్పరచుట, వాక్యములందలి శబ్దముల యావశ్యకత, దీనికి స్వరనియమములాది సంహిత యొక్క ఉచ్చారణా క్రమ పద్ధతు లేర్పరచబడినవి. వేదప్రతి శాఖ యందును శిక్షాగ్రంథము లుండెడివి. కావున నీ విషయము ప్రాతిశాఖ్యము [ఒకశాఖకు సంబంధించిన పుస్తకము] అని పేరైనది. ఈ ప్రాతిశాఖ్యలు పాణిని కన్న ప్రాచీనములని తలచబడు చున్నవి. ఇట్లనుటకన్న నేటి ప్రాతిశాఖ్యల ప్రయోగమొక ప్రాచీనరూప మున పాణిని జేసి యుండెనని చెప్పుటయెంతయు సమంజసమైనది. ఉదాహరణార్థము అతడెప్పుడైన నొక వైదిక సంధిని దీసికొనిన నది యసంపూర్ణముగ నతని వర్ణనలో మిగిలిపోవును. ఇతర ప్రాతిశాఖ్యలు విశేషముగ నథర్వణవేద ప్రాతిశాఖ్య వైయాకరణుల పారిభాషికత యధీనములో నున్నవి.

అన్నిటికన్న పురాతనమైనది ఋగ్వేద ప్రాతిశాఖ్యము. దీనిని శౌనకీయ ప్రాతిశాఖ్యమనియునందురు. (ఈ శౌనకుడే యాశ్వలాయనుని యధ్యాపకుడని తలచబడుచున్నాడు.) ఈ గొప్పగ్రంథమున మూడు కాండములున్నవి. ఈ ప్రాతిశాఖ్యలు పద్యములలో నున్నవి. ఇదియేదో ప్రాచీన గ్రంథపు రూపాంతరమైనది. అనేక గ్రంథములలో దీనిని సూత్రమని పేర్కొనిరి.

తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రములో ననేకాధ్యాపకుల పేర్లుండుటచే మిక్కిలి యందమైనది. దీనిలో సుమారిరువదిమంది యాచార్యులు వర్ణింపబడిరి.

వాజసనేయ ప్రాతిశాఖ్య సూత్రములు కాత్యాయనునిచే విరచితములై నటుల విశదపరచుచున్నది. పూర్వాచార్యులలో శౌనకుని నిది పేర్కొ

నును. దీనిలో నెనిమిది యధ్యాయములుండి 'ప్రతిశ' సూత్రమీ ప్రాతిశాఖ్య కుపసంహారమై యున్నది.

శౌనకుని సంప్రదాయములతో సంబంధముగల అథర్వ ప్రాతిశాఖ్యయు నిట్టివేయగు నితర గ్రంథములకన్న నధిక వ్యాకరణపూర్ణమైనదని చెప్పవచ్చును.

ఒక 'సామ' ప్రాతిశాఖ్యము గలదు. 'పుష్ప సూత్ర'మనునది సామవేదపుటుత్తర గణమున కొక విధమగు ప్రాతిశాఖ్యగనున్నది. సామవేద మంత్ర గాయనములను గురించి వేరొక గ్రంథము 'పంచవిధ సూత్ర'మనునదియు కలదు. ప్రాతిశాఖ్యముల మహత్వము రెండువిధములుగ నున్నది. ఒకటి – వీనిలో భారతములోని వ్యాకరణమునకు సంబంధించిన పాఠముల ఇతిహాస మడగియున్నది. ఇది మనకు తెలిసినంతవరకు ప్రాతిశాఖ్యలకు వెనువెంటనే యారంభమగును. రెండవది – ఇవి నేడు మనకు లభ్యములగు సంహితల యథాతథ రూపములను ప్రమాణించి చూపుచున్నవి. ఋగ్వేద ప్రాతిశాఖ్యను గురించి విచారించగా ఋక్ప్రాతిశాఖ్య సమయమున ఋగ్వేదము పదిమండలములలోనే విభక్తము గాక; దానిమంత్రములు మనకు నేడు లభించు క్రమమునసే యుండినవి.

ఈ ప్రాతిశాఖ్యలు వేదాంగ శిక్షకు సంబంధించిన మిక్కిలి ప్రాచీన రూపములు. ఇవిగాక నెన్నియోనవీన రూపములును గలవు. అవికూడ శిక్షలనబరగి భారద్వాజుడు, వ్యాసుడు, వశిష్ఠుడు, యాజ్ఞవల్క్యాది గొప్ప గొప్ప ఋషులచే విరచితములయినవి. ఇవి ధర్మసూత్రముల ననుసరించు స్మృతులవలెనే ప్రాతిశాఖ్యల ననుసరించును. వీనిలో గొన్ని శిక్షలు ప్రాచీనములై ఏదో యొక ప్రాతిశాఖ్యతోడనో సంబంధపడియున్నవి. ఉదాహరణార్థము వ్యాసశిక్ష; తైత్తిరీయ ప్రాతిశాఖ్యతో సంబంధపడి యున్నది. అయిననే యితర గ్రంథముల కంటె నిది మహత్వముగలది కాదు.

కల్పము :

శిక్ష తరువాత రెండవ వేదాంగము కల్పము– దీనిని గురించి తరువాతి యధ్యాయములలో సవిస్తరముగ వర్ణింపబడును.

వ్యాకరణము :

పదపాఠములనుండి వాని రచయితలు కేవలముచ్చారణ, సంధులను మాత్రమేగాక, శబ్దవ్యుత్పత్తినిగురించియు మిగుల తెలిసియుండిరి. వారు రెండు సమాన భాగములను - క్రియ, ఉపసర్గలను, శబ్దప్రత్యయములను వేరుజేయుచుండిరి. ఈ విధానము వారికి మొదటినుండియు తెలియును. యాస్కుడు నామ, అఖ్యాత, ఉపసర్గ, నిపాతములను తన "నిరుక్త"మున వర్ణించినాడు. భాషా సంబంధమైన పరిశోధనను గురించి బ్రాహ్మణములందును నిదర్శనములున్నవి. వానిలో గూడ విభిన్న వ్యాకరణ సంబంధములగు పారిభాషిక పదములు దొరుకును. వర్ణ, లింగ, వచన, విభక్తులు ఆరణ్యక, ఉపనిషత్ సూత్రములలో విశేషముగ గానవగును. కాని, మనము యాస్కుని నిరుక్తమునుండియే పాణినికి పూర్వపు వ్యాకరణములను గురించి బాగుగ తెలియగలుగుచున్నాము.

యాస్కునకుముందు వ్యాకరణాధ్యయనము చాల జరిగియుండెను. ఆతడు తనకు ముందున్న నిరువదిగురు వ్యాకర్తలను పేర్కొనుటయేగాక పూర్వోత్తర సంప్రదాయములను గూడ నుల్లేఖించియున్నాడు. అతడుదాహరించిన వారిలో శాకటాయన, గార్గ్య, శాకల్య అతి ముఖ్యులు. యాస్కుని కాలమున వైయాకరణుల శబ్ద, రచనాక్రమములు వ్యవహారమున నుండెను. వారు పురుష, కాల, వాచకరూపముల నడుపుచు కృత్, తద్ధిత ప్రత్యయములనుగూడ తెలిసియుండిరి. యాస్కుడు ధాతువులనుండి పుట్టు శబ్దములను గురించి యుత్కృష్టమగు వ్యాఖ్య వ్రాసియున్నాడు. గార్గ్యాదులు అన్ని శబ్దములును ధాతువులనుండి పుట్టినవను సిద్ధాంతము నంగీకరింపరని యాస్కుడు చెప్పినాడు. పాణినీయ వ్యాకరణముకూడ శాకటాయనుని "ధాతువులనుండి సర్వశబ్దోత్పత్తి" సిద్ధాంతము పైననే యాధారపడియున్నది. పాణినీయ వ్యాకరణమున కొన్ని వైదిక రూపములుకూడ సాధింపబడియున్నను నది ప్రధానముగ లౌకిక సంస్కృత భాషకై వ్రాయబడినది. నేటి సాహిత్యము పాణినీయము నాధారముగ చేసికొని వెలసియున్నది. పాణిని సూత్రకాలపు మధ్యయుగములో నున్నను అతని కాలమును వేదానంతర కాలముగ పరిగణింప వచ్చును. పూర్వా

చార్యుల మతముల నన్నిటిని ఖండించి వ్రాయబడినదగుటచే పాణినీయము మిగుల ప్రామాణికమై యున్నది. పూర్వుల గ్రంథములన్నియు నష్టమై పోయినవి. వ్యాకరణముగగాక నిరుక్తరూపముననున్న యాస్కుని గ్రంథము మాత్రము మిగిలియున్నది. శాకటాయనుని పేరనొక వ్యాకరణము కనబడుచున్నది. కాని యింతవరకే విద్వాంసుడును దానియందు యాస్క పాణినుల ఖండన మండనములకు లోనైన మతములన్నియు నెంతవరకున్నవో విమర్శింప లేదు.

## నిరుక్తము:

యాస్క "నిరుక్తము" వాస్తవముగ నొక వైదికటీక. వేదార్థమును దెలుపు గ్రంథము లన్నిటికంటె నిది చాల ప్రాచీనమై యున్నది. ఇది వైదికకోశ మనదగినది. యాస్కుడు నిఘంటువును రచించెనని దంతకథలు చెప్పుచున్నవి. వేదార్థము సులభముగ దెలియుటకై ప్రాచీన మహర్షులు నిఘంటువు రచించిరనియు, దాని యాధారముచే తాను టీకను వ్రాసితి ననియు యాస్కుడు చెప్పికొనియున్నాడు. ఇందు మూడు కాండములు గలవు. మొదటి నైఘంటిక కాండమున పృథివ్యాది పదార్థములను, నైగమ కాండమున వేదమునందలి అతికఠిన శబ్దముల కర్థములను, మూడవ దైవత కాండమునందు స్వర్గ, దేవాదులును వివరింపబడినవి. ఈ రచన వేదార్థము వైపు దృష్టి సారించుటకు చేసిన ప్రయత్నమై యున్నది. యాస్కునకు ముందెన్నియో నిరుక్తము లుండియుండును. కాని, వానిలో నొక్కటియు నిప్పుడు మిగులలేదు.

నిరుక్త ప్రథమాధ్యాయము కేవల వ్యాకరణ సిద్ధాంతములచే నిండి వేదభూమికయై యున్నది. రెండు, మూడధ్యాయములు నైఘంటిక కాండము, నాలవ యధ్యాయమునకు నైగమ కాండము, పండ్రెండవ యధ్యాయము వరకు దైవత కాండము వ్యాఖ్యానింపబడినవి. నిరుక్తమతి సుందరమై పాణినీయ భాషకంటె సరళమై యున్నది. యాస్కుని కాలము క్రీస్తుకు పూర్వ మైదువందల యేండ్లగుటచే నతడు సూత్రకాల ప్రారంభమునగల యాచార్యుడై యున్నాడు.

### ఛందస్సు:

బ్రాహ్మణములలో ఛందస్సును గురించిన యనేక ఉల్లేఖనము లున్నవి. సాంఖ్యాయన శ్రౌత సూత్రములందును, ఋగ్వేద ప్రాతిశాఖ్యమందును, సామవేద నిదాన సూత్రములలోను కేవలచ్ఛందో విషయముగాక "ఉక్థ" "స్తోమ" "గణము" అను గురించి తెలుపబడి యున్నది. "పింగళ" ఛందస్సు వేదాంగములలో నొకటని యనుమానించుట సరికాదు. దీని యందు కొన్ని వైదికచ్ఛందస్సులును, ఎక్కువగ వేదోత్తరకాలపు సంస్కృతచ్ఛందస్సులును వివరింపబడి యున్నవి.

కాత్యాయనుని యనుక్రమణికలలో నొక ఖండము వేదచ్ఛందస్సును గురించి తెలుపుచున్నది. అది ఋగ్వేద ప్రాతిశాఖ్య మందలి 16 వ పటలముతో సరిపోవుచున్నది. ప్రాతిశాఖ్యము అనుక్రమణికకంటె ప్రాచీనమైనదని తలచుచున్నారు.

### జ్యోతిషము:

వేదాంగ జ్యోతిషమొక చిన్న పద్యగ్రంథము. దీనిని "లగధు"డను విద్వాంసుడు రచించెను. ఇందలి ఋగ్వేద సంస్కరణ భాగమున 36 ను, యజుర్వేద భాగమున 43 శ్లోకములు గలవు. ఇందలి ముఖ్యవిషయము సూర్యచంద్రుల స్థానములను గుర్తించుట, 27 నక్షత్రముల చక్రమునందు పూర్ణిమా, అమావాస్యలను తెలియుటలై యున్నది. జ్యోతిషమును గురించి తెలుపు ఆదిగ్రంథమిదియే యైయుండును. కాని, దీని ప్రాచీనత్వమును దెలుపు నితర గ్రంథాధారములు దొరకలేదు.

### అనుక్రమణికలు :

వేదములు, బ్రాహ్మణములు, వేదాంగములను గురించి యెంత తెలిపినను అనుక్రమణికలను గురించి తెలుపక పోయినచో వైదిక సాహిత్యమును సంపూర్ణముగ తెలిపినట్లు కాదు. వీనిలో మంత్రములు, రచయితలు, ఛందస్సులు, దేవతలను గురించి సంహితలతో లభించు క్రమమునందే సూచింపబడినవి.

శౌనకుని యేడు గ్రంథములును ఋగ్వేదముతో సంబంధము గలవి. ఇవి ఋగ్వేద ప్రాతిశాఖ్యవలె సమములగు శ్లోకములతో నొప్పుచున్నవి. కాత్యాయన కర్తృకమగు స్వరానుక్రమణిక యొకటున్నది. అర్షానుక్రమణిక 300 శ్లోకముల గ్రంథము. దీనిలో ఋగ్వేదఋషుల సూచిక కలదు. ,,అనువాకానుక్రమణిక'' కేవలం 40 శ్లోకముల చిన్న గ్రంథము. ఇది ఋగ్వేదపు 85 అనువాకముల సాంకేతిక శబ్దములను, మంత్రసంఖ్యను తెలుపును.

,,పాదానుక్రమణిక'' యను నదొక మిశ్రచ్ఛందముల గ్రంథము. ,,సూక్తానుక్రమణిక'' ప్రతీకముల యనుక్రమణికగ నుండినది. కాని, ఇది ,,సర్వానుక్రమణిక'' ముందు వ్యర్థమగుటచే నష్టమై పోయినది. ,,దేవతానుక్రమణిక'' ప్రత్యేకముగ లభింపకున్నను ,,షడ్గురు'' శిష్యుడు దానిని తన ,,అర్షానుక్రమణికా వ్యాఖ్యానము'' లో పదిసారులుదహరించు కొనినాడు. ,,బృహద్దేవతానుక్రమణిక'' అన్నిటికన్న గొప్పది. దానిలో 1200 శ్లోకములున్నవి. ఇది ఋగ్వేదాష్టకములకు సమములగు నెనిమి దధ్యాయములలో విభక్తమై యున్నది. ఋగ్వేదక్రమమును తెలిపి ప్రత్యేకమంత్ర దేవతను చూపుటయే దీని యుద్దేశమై యున్నది. ఇది యాస్కుని ,,నిరుక్త''ము నాధారముగ జేసుకొని వెలసినది. అంతేగాక దీని రచయితయు యాస్కుడే. అతడు ,,భాగురి,'' ,,అశ్వలాయ''నా ద్యనేక ఋషులను గురించి వ్రాయుచు ,,నిదాన'' సూత్రములను గురించి వాకొనినాడు- అందతడు ఋగ్వేదమున కానరాని కొన్ని ఖిలభాగములను గూడ నుల్లేఖించెను.

పైదాని తరువాత కాత్యాయనుని ,,సర్వానుక్రమణిక'' సూత్ర రూపమున నున్న గొప్పగ్రంథము. ఇందు 12 ఖండములపై భూమిక కలదు. వీనిలో తొమ్మిది ఖండములలో కేవలము ప్రాతిశాఖ్య వర్ణనతో పరిపోలు వేదచ్ఛందస్సుల వర్ణన కలదు. శౌనకుని ఋగ్విధానము కూడ ఛందోబద్ధ గ్రంథము.

సామవేద పరిశిష్టములగు రెండనుక్రమణికలుగలవు. ఒకటి ,,ఆర్షము'', రెండవది, ,,దైవతము''. వీనిలో క్రమముగ సామవేదపు త్రైగేయ శాఖా

ఋషులను, దేవతలను గురించి తెలుపబడినది. ఆ ఋషులలో యాస్క, శౌనక, ఆశ్వలాయనాదు లున్నారు.

కృష్ణయజుర్వేదపు రెండనుక్రమణికలు గలవు. ఒకటి ,,ఆత్రేయ'' శాఖకు సంబంధించినది. రెండవది ,,చారాయణీయ'' శాఖకు సంబంధించినది. ఆత్రేయ శాఖానుక్రమణిక గద్యాత్మకము, శ్లోకాత్మకము అను రెండుభాగములు కలది. చారాయణీయ శాఖానుక్రమణికలో భిన్నభిన్న మంత్రరచయితల లెక్క కలదు. దానిని ,,అత్రి'' రచించి ,,లౌగాక్షి'' కొసగె నను ప్రతీతి యున్నది.

కాత్యాయనుని ,,మాధ్యందిని'' శాఖానుక్రమణికలో నైదు ఖండము లున్నవి. మొదటినాలుగు ఖండములందును రచయితలు, దేవతలు, ఛందములను గురించి తెలుపబడినది. ఐదవదానిలో ఛందస్సుల సంక్షిప్త వర్ణనమున్నది. కాత్యాయనుని మరికొన్ని శుక్లయజుర్వేద పరిశిష్టము లుండినవి. కాని, నేడు మూడుమాత్రమే లభించుచున్నవి. వానిలో ,,నిగమ'' పరిశిష్టమందు శుక్ల యజుర్వేద శబ్దములను గురించియు, ప్రవరాధ్యాయమునందు వివాహాదులలో స్మరించు కొన్ని బ్రాహ్మణ వంశములను గురించియు, ,,చరణవ్యూహము'' నందు విభిన్న వేద సంప్రదాయములను గురించియు విపులీకరింపబడి యున్నవి. ఈ గ్రంథత్రయము తరువాత రచియింపబడి యుండును.

అథర్వ వేద పరిశిష్టములందును, నొక చరణ వ్యూహము కలదు. అథర్వవేదమునందు 70 పరిశిష్టములున్నవి.

## కల్ప సూత్రములు

బ్రాహ్మణములకు, నారణ్యకములకు విషయసంబంధము గలిగి మిక్కిలి ప్రాచీనములైన సూత్ర గ్రంథములు వెలయుచున్నవి. ఐతరేయారణ్యకమున సూత్రములు దప్ప మరేమియు లేవు. వాటిని ఆశ్వలాయనుడు, శౌనకుడు రచించినట్లు దెలియుచున్నది. బ్రాహ్మణములు కల్పములతో నేరుగ

సంబంధపడి యున్నవి. అయినను ఋషులీ విషయమును గూర్చ మొదట్లోనే తమ ధ్యానమును అగ్నిపరచిరి. వారీ విషయమున ననేక గ్రంథముల రచించి కల్పసూత్రములని పేరిడిరి.

## కల్పసూత్రముల మూడు విభాగములు :

శ్రౌత, గృహ్య, ధర్మసూత్రములు. శ్రౌతయజ్ఞముల వర్ణించు గ్రంథము „శ్రౌత" సూత్రమనియు, గృహస్థులకు దగిన సంస్కారములు, రీతుల వర్ణనలు గలది „గృహ్య" సూత్రమనియు, ధర్మ, నియమముల వర్ణించునట్టి గ్రంథము „ధర్మ" సూత్రమని యన బరగెను. ఈ విషయమును బోలునట్టి సాహిత్యమింకొకటి కలదు. దానిని „శుల్బ" సూత్రమని యందురు. దానిలో యజ్ఞశాలాదికముల నిర్మాణమభివర్ణితము.

## శ్రౌతసూత్రము :

శ్రౌతసూత్రరచనా కాలము క్రీ॥ ముందు 500-800 వర్షములై యున్నదని అధునిక పండితులనుచున్నారు.

ఋగ్వేదమునకు సంబంధించిన రెండుసూత్రములు మాత్రమిప్పటికి లభించినవి. ఒకటాశ్వలాయననిది, రెండవది సాంఖ్యాయననిది. అశ్వలాయన శ్రౌత సూత్రములో 12 అధ్యాయములును, సాంఖ్యాయనుని గ్రంథములో 18 అధ్యాయములును గలవు. మొదటిది ఐతరేయ బ్రాహ్మణముతోడను, రెండవది సాంఖ్యాయన బ్రాహ్మణము తోడను సంబంధము కలిగియున్నది. „వెబ్బర్" పండితుని యనుసారము ఆశ్వలాయనుడు బ్రాహ్మణకాలమునగాక, పాణినికాలమున నుండియుండును. ఏ అ న 'అయిన' ప్రత్యయముల కలిపి పేరు బెట్టుట బ్రాహ్మణ కాలపు పరిపాటి కాదు. అశ్వలాయనుడు, అశ్మరథ్య, శైలవలీ ఋషులను గురించి వ్రాసెను. వారి పేర్లు పాణిని యష్టాధ్యాయిలో నగుపించుచున్నవి. చివరలో నతడు బ్రాహ్మణ పరివారనామావళి నొసగియున్నాడు. వారిలో భృగు, అంగిర, అత్రి, విశ్వామిత్ర, కశ్యప, వశిష్ఠ, అగస్త్యాదులు గలరు. సరస్వతీ తటమున జరిగిన యజ్ఞ వర్ణన మిక్కిలి సంక్షిప్తముగ జేయబడినది. ఈ

యాశ్వలాయనుడే ఐతరేయారణ్యకపు నాలుగవ కాండమును రచించెను. ఇతడు శౌనకుని శిష్యుడు.

సాంఖ్యాయన సూత్రము దీనికన్న కొంత ప్రాతదని తెలియుచున్నది. 15, 16 అధ్యాయములలో నీమాట స్పష్టమయినది. ఈ యధ్యాయములు బ్రాహ్మణ పద్ధతిలో రచింపబడె, 17, 18 అధ్యాయములు దరువాత విరచితములైనది. ఆశ్వలాయన సూత్రము మరియు ఐతరేయ బ్రాహ్మణము రెండును భారత దేశపు పూర్వభాగమందలి రచనలై యొప్పుచున్నవి. వీనికి ప్రతిగ సాంఖ్యాయన సూత్రము దాని బ్రాహ్మణములుత్తర గుజరాత్ దేశ రచనలుగ గన్పట్టు చున్నవి. ఈ రెంటియందును నొకే యజ్ఞక్రియలు వర్ణింపబడినవి. యజ్ఞములన్నియు బాలామట్టుగ రాజులకొరకేర్పడినవి. ఆ యజ్ఞములేవియన—

వాజపేయము రాజసూయము అశ్వమేధము పురుషమేధము సర్వమేధములు. సాంఖ్యాయనుడీ యజ్ఞములను విస్తారముగ వర్ణించియున్నాడు. సామవేదపు నాలుగు శ్రౌతసూత్రములు లభించినవి. వానిలో నొకటి "మశకము"నది, రెండవది "లాట్యాయను"నిది, మూడవది "ద్రాహ్యాయను"నిది, నాల్గవది "జైమినీయము" నది.

మశక సూత్రములలో ప్రపాఠకములున్నవి. వానిలో మొదటి 5 టిలో నేకాహయజ్ఞము, తరువాతి నాల్గింటిలో నహీనయజ్ఞము, కడపటి రెంటిలో సత్రములు వర్ణింపబడినవి.

లాట్యాయన సూత్రము "కౌథుమ" శాఖదై యున్నది. మశక సూత్రమువలె నిదియు పూర్ణముగ బ్రాహ్మణములతో సంబంధపడియున్నది. దీనిలో బ్రాహ్మణముల యుదాహరణములు పెక్కు నుండి, దీనికి "శాండిల్యుడు", "ధనంజయుడు", శాండిల్యాయనుడు' నాచార్యులుగ జేర్కొన బడిరి. వీరు మాత్రమేగాక లాట్యాయనుడు పెక్కుమంది యాచార్యుల పేళ్ళను గూడ వివరించియున్నాడు. "అక్షేయకల్ప", "గౌతమ", "సౌచవృక్ష" "క్షైక్ష్యలంబీ" "కౌత్స", "వార్షగణ్య". "భాండితాయన", "లామకాయన". "రాణాయనీపుత్ర" "శాట్యాయనీ", "శాలి

శాయనీ" మొదలగువారు. ఈ సూత్రకాలమున గోత్రములు, సమాదుల పరిస్థితి తరువాత కాలమున చేసినంతగ జెడియుండలేదు. అప్పుడువారు యజ్ఞవాటికలలోనికి వచ్చుచుండిరి. లాట్యాయన సూత్రములో 10 ప్రపాఠకములు గలవు. వాని మొదటి 7 టిలో సన్నిపథములగు సోమ భాగముల సాధారణ నియమములు గలవు 8, 9, ప్రపాఠకములలో గొంతవరకు ఏకాహ యజ్ఞము వర్ణింపబడినది. 9 వ ప్రపాఠకములో దక్షిణ భాగమున నహీనయాగము, 10 వ దానిలో సత్రయాగ వర్ణనలు గలవు.

ద్రాహ్యాయన సూత్రము రాణాయనీయ శాఖదై యున్నది. రాణాయన వంశము వశిష్ఠుని నుండి యుత్పన్నమైనది. ఈ సూత్రమునకు వశిష్ఠ సూత్రమనియు పేరుగలదు. దీనిని గురించి యెక్కువేమియుదెలియదు.

శుక్లయజుర్వేద సంబంధము కాత్యాయన సూత్రములతో గలదు. దీని 26 వ అధ్యాయములో శతపథ బ్రాహ్మణ యజ్ఞక్రమము వర్ణింపబడినది. 22 నుండి 23 అధ్యాయముల వరకు సామవేదయజ్ఞములు వర్ణింపబడినవి. ఈ గ్రంథరీతి, పరిపాకములను బట్టి యిది సూత్రకాలపు చివరలో నున్నట్లూహింప వచ్చును.

కాత్యాయన శ్రౌత సూత్రముల మొదటి 18 అధ్యాయములు శతపథ బ్రాహ్మణములోని మొదటి 9 కాండముల విషయముతో పోలుచున్నవి. 9 వ అధ్యాయములో సౌత్రామణీ యజ్ఞము, 20 లో అశ్వమేధము, 21 లో పురుషమేధము, సర్వమేధ, పితృమేధ యజ్ఞములు వర్ణితములు. 25లో ప్రాయశ్చిత్తము, 26లో ప్రవర్గ్యయజ్ఞములు వర్ణింపబడినవి. „వెబ్బరు" వైజవాద శ్రౌత సూత్రముగూడ శుక్ల యజుర్వేదములోనిదని నమ్మిరి.

కృష్ణ యజుర్వేదముతో సంబంధముగల 6 శ్రౌత సూత్రములు సురక్షితములు. అయిన వానిలో కేవలము రెంటికే భాష్యములేదు. ఆపస్తంబ, హిరణ్యకేశులు కల్ప సూత్రముల బూర్ణముగ వ్రాసిరి. వానిలో నాపస్తంబుని 30 యధ్యాయములలో 24 టియందును, హిరణ్యకేశి రచించిన 29 అధ్యాయములలో 18 అధ్యాయములందును వీని శ్రౌత

సాంఖ్యాయన ఆశ్వలాయన గృహ్య సూత్రములకు ఋగ్వేదముతో సంబంధముగలదు. వీనిలో నాల్గు నాల్గధ్యాయములు గలవు. శౌనకుడును గృహ్య సూత్రముల రచించినట్లు దెలియుచున్నది. అయిన నవి లభించుట లేదు. సాంఖ్యాయనుని గృహ్యసూత్రము ,,కౌషీతకీ,, శాఖకును సంబంధపడియున్నది ఇది పూర్ణముగ లభింపక పోయినను కౌషీతకీ గృహ్య సూత్రము వేరుగ ప్రకటితమైనది.

సామవేదమునకు సంబంధించిన ప్రధాన గృహ్యసూత్రము ,,గోభిల,, సూత్రము. ఇదియన్నిటికన్న ప్రాచీనము, పూర్ణము, మనోహరమునై యున్నది. దీనిని సామవేదోభయ శాఖలును ప్రయోగించుచున్నవి. ద్రాహ్యాయణశాఖయొక్క ,,కదర,, గృహ్యసూత్రములను సామవేద రాణాయనీయ శాఖవారు నుపయోగించుకొనుచుండిరి. అయిన నిది గోభిలసూత్ర పరిష్కృతరూపము. జైమినీయ గృహ్య సూత్రము గూడ సామవేదమునకు సంబంధించినదే.

శుక్ల యజుర్వేదమునకు పారస్కర, కాత్యాయన సూత్రములు గృహ్య సూత్రములు. ఈ పారస్కర, కాత్యాయన సూత్రములే వాజసనేయ గృహ్యసూత్రములనబడును. కాత్యాయన గృహ్యసూత్రములతో దీనికి మిక్కిలి సంబంధము గలదు. కావుననే యీ రచయిత పేరుతో ననేక ప్రదేశములలో నుదాహరణము తీయబడినవి. యాజ్ఞవల్క్యుని ధర్మ శాస్త్రము పైనను దీని ప్రభావమున్నది. దీనిలో 3 కాండలుగలవు.

కృష్ణ యజుర్వేదపు 7 గృ. సూ. ములలో నింతవరకు 3 మాత్రమే ముద్రితములయినవి. ఆపస్తంబ, హిరణ్యకేశి గృ. సూ. ముద్రితములై యున్నవి. బౌధాయన, భరద్వాజ గృ. సూ. విషయము మృగ్యము. మానవ గృ సూ. మానవ శ్రౌత సూత్రములతో ఘనమగు సంబంధము గలిగి యున్నవి. ఈ గృ సూ. అనేక పర్యాయములు శ్రౌతావతరణములనే వల్లెవేసినవి. ఈ సూత్రములోని వినాయక పూజ యేయితర సూత్రములందును గానరాదు. యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రములో నీ యంశముతే వివరింపబడి నలుగురి వినాయకులకొకే వినాయకుని అనగా నేటి గణపతి వర్ణన గలదు. కాఠక గృ. సూ., మానవ గృ. సూ. ల బోలియున్నవి. దీనికి

విష్ణుధర్మ శాస్త్రముతో సంబంధము కలదు. ప్రాచీన పద్ధతిలో రచింపబడినది వైఖానస గృ. సూత్రము. వారాహ గృ. సూత్రము కూడ మైత్రాయణీయ సంప్రదాయమునకు చెందినట్టి గ్రంథము.

అథర్వ వేదముతో కౌశిక గృ. సూ. ల సంబంధముగలదు. ఇవి కేవలము గృహ్యసూత్రములే గాక అథర్వవేద తాంత్రిక విషయములతోకూడ విశేషములు గలిగియున్నవి. వీనిలో వైదిక భారతీయ జీవన దృశ్యములు బాగుగ చిత్రింపబడినవి.

ఈ గృ. సూత్రములలో 40 సంస్కారముల వర్ణనలున్నవి. గర్భధారణనుండి వివాహమువరకు 18 సంస్కారములు శారీరక అనబడుచున్నవి. తక్కిన 22 ఒకవిధమగు యజ్ఞరూపములై యున్నవి. వీనిలో 5 గృహ్య సంస్కారములున్నవి. ఇవి పంచమహాయజ్ఞములు, 7 పాకయజ్ఞములై యున్నవి. తక్కినవి శ్రౌత సంస్కారములతో సంబంధము గలిగి యున్నవి. ఈ విషయములేగాక వర్షఋతుప్రారంభములో నాగపూజ, గృహనిర్మాణ గృహప్రవేశ సంస్కారములు మున్నగునవి కలవు. ఇంకను, భూమిదాని నిర్మాణముల విస్తృత నియమములు గలవు. ఇంటికి పశ్చిమమునకు ద్వారముండకూడదనియు, కలపలేక వెదురుతో నిల్లుగట్టిన తరువాత పశుబలినిచ్చు వర్ణనలు గలవు. పశువులను గురించి అనేక వర్ణనలున్నవి. జాతిహితమునకై యాబోతును వదలుటయు, కృషిసంబంధ రీతులు వర్ణితములు, కృషివలన నుత్పన్నమగు ప్రథమ ఫలము నితరులకు బంచుకొనుటయు, దుస్వప్న, అపశకున, రోగాదికములు దెలుపబడినవి. శవసంస్కార విషయమున చితిపై యావునుగాని మేకనుగాని వేసి కాల్చవలెననియు, శ్రాద్ధములగూర్చియు విస్తారముగ జెప్పబడినది. ఇది గృహ్యసూత్రములను గురించిన సంక్షిప్త పరిచయము.

## ధర్మసూత్రములు :

సూత్రసాహిత్య శాఖలలో ధర్మసూత్రము మూడవది. దీనిలో నిత్యజీవన నియమములు వర్ణితములు. ఇవి మిక్కిలి ప్రాచీనార్య ధర్మములై యున్నవి. కృష్ణయజుర్వేద తైత్తిరీయశాఖతో సంబంధముగల ధర్మసూత్ర

ములు మూడు ప్రసిద్ధములు. యాస్కాచార్యుడు ధార్మిక నియమముల గురించి సూత్రపద్ధతులపై వ్రాయుటచే నంతకుముందే ధర్మసూత్రములలో నొకటిరెండు విరచితములై యుండవచ్చును. కావుననే యివి మిక్కిలి ప్రాచీనములని తలచబడుచున్నవి.

ఆపస్తంబ ధ. సూ. లింతవరకును సురక్షితములు. వీనిని ప్రాచీన సంప్రదాయకులు పరివర్తించుటగాని, నేటి సంపాదకులు క్రొత్తవాటితో జతపరచుటగాని జరుగలేదు. ఆపస్తంబ కల్ప. సూ. ల మొదటి మూడధ్యాయములలోను, 28, 29 అధ్యాయములందే ధర్మసూత్రమే గలదు. దీనిలో విశేషాంశముగ వైదిక విద్యార్థి, గృహస్థుల కర్తవ్యములు, నిషిద్ధ భోజనము, శౌచాచార ప్రాయశ్చిత్తములు, వివాహ, ఉత్తరాధికారాపరాధములు మున్నగునవి వివరింపబడినవి. ఔత్తరాహుల గురించి వికృతపు మాటలిందుండుటచే దీని సంబంధము దక్షిణ దేశీయులతో గలదని యూహింపవచ్చును. ఈ సూత్రములలో భాష పాణినికన్న పూర్వముది.

హిరణ్యకేశి ధర్మసూత్రమీ గ్రంథములో సంబంధము గలిగియున్నది; రెండును సమానములనియే చెప్పవచ్చును. ఇట్లుండుటకాక నైతిహ్యమిట్లున్నది. ఆపస్తంబునితో గొట్లాడి కొంకణ ప్రాంతమున నొక నూతనశాఖను హిరణ్యకేశి స్థాపించి కల్పసూత్రపు 26, 27, 29, అధ్యాయములనుండి ధర్మ సూత్రముల వ్రాసెనని యొక శిలాలిపి వర్ణించుచున్నది.

మూడవది బౌధాయనుని ధర్మ సూత్రము. దీనిని ధర్మశాస్త్ర గ్రంథమని వర్ణించిరి. ఈ శాఖా కల్పసూత్రముల వివరము తెలియదు. ఇది పైరెండు ధర్మసూత్రములకన్న ప్రాతది. దీనిని గురించి నేడంతగ తెలియకున్నను దీని సంబంధము మాత్రము దక్షిణదేశముతో నుండెనని చెప్పవచ్చును. సుప్రసిద్ధ భాష్యకారుడగు సాయణాచార్య డీశాఖానుయాయి. ఈ ధర్మసూత్రములలో నాలుగాశ్రమములయు, నాలుగు వర్ణములయు నియమములు, అనేక విధముల యజ్ఞములు శౌచాచార, ప్రాయశ్చిత్త, రాజ ధర్మాపరాధముల న్యాయము, సాక్షుల పరీక్ష, ఉత్తరాధికారుల నిర్ణయము, వివాహములు, అందు స్త్రీలకుగల స్థానము వర్ణింపబడినవి. పూర్తిగ శ్లోకములతో విరచితమగు నాలుగవ ఖండము క్రొత్తగ రచింపబడినది.

త్తైనవి. ఈ గ్రంథమును విషయములలో నొక గొప్ప ధర్మ [ Law ] గ్రంథమని పారాశరుడు వక్కాణించి యున్నాడు. ఇది వాజసనేయముతో సంబంధపడినదని కుమారిలుడు చెప్పెను.

నాలుగు ప్రశ్నలలో వ్రాయబడిన వైఖానస ధర్మసూత్రము ప్రాచీనము కాదు. దీనిలో ధార్మిక విషయములకన్న గృహధర్మములే విశేషముగ జెప్పబడినవి. నాలుగాశ్రమములు - వానిలో ముఖ్యముగ వర్ణితములు వానప్రస్థ నియమములు. ఈ వైఖానసులు వానప్రస్థులుగ నుండుటే దీనికి గారణము. ఇది తైత్తిరీయ సాంప్రదాయమున నొకచిన్నశాఖ.

ఇంకనెన్ని యిట్టిధర్మసూత్ర గ్రంథములు కాలగర్భమున లీనమైనవో తెలియదు. నేటి స్మృతులన్నియు ధర్మసూత్రముల శ్లోకములను దారుమారొనర్చి విరచితములైనవి. ఈ విషయము వశిష్ఠ, ఆపస్తంబ ధర్మసూత్రములను, వీని స్మృతులనుగలిపి చూచినప్పుడే తేటపడినది.

శుల్బసూత్రము :

ధర్మాచరణమున సహాయ మొనర్చు నింకొక సూత్రసాహిత్యము కలదు - దానిని శుల్బసూత్రమందురు.

ఆపస్తంబ కల్పసూత్రపు 30వ ప్రశ్న యాపస్తంబ శుల్బసూత్రమై యున్నది. ఈ ప్రశ్నలలో వేదిక, యజ్ఞకుండాదికముల రచనాక్రమముండును. వీనిలో రేఖాగణిత [ Geometry ] విజ్ఞానమున్నట్లు తెలియుచున్నది. నిజముగ భారతీయ గణిత శాస్త్రములలోనిది మిక్కిలి పురాతనమైన గ్రంథము. దీని సంబంధము కృష్ణయజుర్వేదముతో గలదు.

బౌధాయన కల్పసూత్రము గూడ కృష్ణ యజుర్వేద గ్రంథమే. శుక్ల యజుర్వేదమునకు కాత్యాయన శుల్బసూత్రములతో సంబంధము గలదు. హిరణ్యకేశ కల్పసూత్రములలోని కడపటి రెండధ్యాయములు హిరణ్యకేశ శుల్బసూత్రములు. ఇవిగాక వేరు శుల్బసూత్రము లుండవచ్చును. అవి యింతవరకు పలబ్ధములుగాలేదు.

**పరిశిష్టములు :**

ఈ విధమగు సాహిత్యము తరవాత ''పరిశిష్టములు'' వచ్చును. వానిలో సూత్రములలో సంక్షిప్తముగ వ్రాయబడిన విషయములు విస్తారముగ వ్రాయబడినవి. వీనిలో గోభిల గృ. సూ. పరిశిష్టము మిక్కిలి మహత్వపూర్ణమైనది. వానిలో నొకటి గోభిల పుత్రుని గృహ్యాసంగ్రహపరిశిష్టమనబడుచున్నది. రెండవది కర్మప్రదీపము. అథర్వవేదపరిశిష్టములు ధార్మిక చరిత్రను చిత్రించుటలో జేర్పబడినవి. ఇవి యనేకరీతుల మంత్రతంత్రాదికముల దెలుపుచున్నవి. మిక్కిలి ప్రాచీన పరిశిష్టములలో ప్రాయశ్చిత్త సూత్రములు ముఖ్యములు. ఇవి వైతాన సూత్ర భాగములు.

**ప్రయోగాదికములు :**

ఈ విషయమున కన్నిటికి దరువాత ప్రయోగ పద్ధతి, కారికలు వచ్చును. ఈ యన్ని గ్రంథములు వైదిక యజ్ఞ సంస్కారాదిక విశేషముల దెలుపును. ఒకప్పుడవి విశిష్టపద్ధతుల దెలుపును. వివాహ పద్ధతి, అంత్యేష్టి కల్పము, శ్రాద్ధాదికములను దెలుపు గ్రంథములీ పట్టున జేర్చబడును. ఈ సాహిత్యమింకను వ్రాత రూపముననే బడియున్నది. కొన్ని గ్రంథములు మాత్రము సంస్కరింపబడి ముద్రితములైనవి.

# వైదిక యజ్ఞములు

రాజకీయోద్దేశములచే వైదికయజ్ఞములారంభమయ్యెనని తోచును. ప్రథమున నార్యులు భరత ఖండమున తమ నాగరకతను విస్తరింప జేసినప్పుడే చిన్నచిన్న మాండలిక రాజ్యములేర్పడెను. బలసాహసములతో గూడిన కొందరు తమచుట్టును గల జనులపైనను, స్థానములపైనను స్వామిత్వము నెరపసాగిరి. అయిన నట్టి మాండలిక రాజ్యములు చాలాపట్టుకు నశాంతినిలయములు, బాధ్యతారహితములునై యుండెను. వానిలో పరస్పరము స్పర్ధలే సాగుచుండినవి. ఆకాలపు మేధావులలో గొందరీ సాంఘిక రీతినీతులరసి పరాక్రమవంతులగు రాష్ట్రపతులను బురికొలిపి,

అప్రయోజకులను, నసమర్థులునగు వారి మండలాధిపత్యములను నైవస మొనర్చు కొనుట ధర్మకార్యమని ప్రవచించిరి. రాజసూయము మరియు నశ్వమేధ యజ్ఞములిటనుండియే ప్రారంభమైనవి. రాజసూయ యజ్ఞమున రాజు పరిసరములలో గల రాజుల నందరిని నిష్కారణముగ దాడిచేసి, యోడించి తన యధీనమున నుంచుకొనును. వారినుండి కప్పములగొని, యజ్ఞముల కాహ్వానించి, వారికిని వారివారి ప్రజలకును తాను ప్రభువను విషయమును జాటుకొనును. ఈ యజ్ఞముల పరిణామము నిన్న మొన్న జరిగిన యాంగ్ల ప్రభువుల లార్డ్ కర్జన్, అయిదవ జార్జి చక్రవర్తిగారి యాజమాన్యమున ఢిల్లీ దర్బారులలో జరిగిన పరిణామముల బోలియుండినది. వీనిలో సమస్త రాజులును వాంగ్లేయ సామ్రాజ్యమున కధీనులమని యొప్పుకొనక తప్పినది కాదు. లార్డ్ కర్జన్ పదునార్గురు రాజులచే తన పరిధానము నెత్తించి కొని పోవుట వెనుకటి రాజసూయమున పరాజితులగు రాజుల జ్ఞప్తికెల యించును.

రాజనైతిక సన్నివేశముల దృష్ట్యా యజ్ఞములును, నిష్కారణ జయాపజయములు నేర్పడినవి. ప్రతాపశాలురగు రాజులు తరచు యజ్ఞము లొనర్చుటకివియే కారణములు. ఒకవైపిట్టి యజ్ఞములలో దుర్బలులగు రాజుల సర్వస్వము హరింపబడిన నందే బ్రాహ్మణులకును, ఋత్విజులకును నంతయు దానరూపకముగ నీయబడుచుండెను. అనేక రాజులు సర్వస్వమును దానము చేసి తమయింట మట్టి పాత్రలనుంచుకొనిరి. దానమాహాత్మ్యమ మధికమై సాధు జనులకు దానమిచ్చుటలో పేదవడినను దమకది గర్వకారణ మనియే వారు దలచుచుండిరి.

వీని పరిణామముగ యజ్ఞాదికముల జేయువారును, దానముల గొను వారును నెక్కువైరి. ఒక సంస్థ పెరిగి విజయవంతమగుటను జూచి యితర కృత్రిమ సంస్థలెక్కువ బయల్వెడలునట్లే యజ్ఞములును మొదట సామ్రాజ్య కాంక్షచే నొనర్పబడునవి. క్రమముగ జీవన్ముక్తి, సర్పనాశనము, శత్రునాశనము, పుత్రకామేష్టి, వరుణేష్టి, రోగనాశాదికములగు నెన్నియో యజ్ఞములు బయలుదేరెను. క్రమక్రమముగ వానిలో పశువధయు ప్రవేశపెట్ట బడినది. వేదములలోని సంహితా భాగమునందు దమకనుకూలములగు విషయముల

సాంఖ్యదర్శన కర్తయగు మహర్షి కపిలుడు తీవ్రముగ నిట్టి కర్మ ఫలము విరోధించెను. కేవలము జ్ఞానమే ముక్తిమార్గమని చాటెను.

భగవద్గీత [2,42,43,45]లో నీ కర్మకాండను లక్ష్యమందుంచుకొని వేదముల విషయమున నిట్లు చెప్పబడియున్నది.

"యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥
త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
వ్యామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్।
క్రియావిశేష బహులా భోగైశ్వర్య గతింప్రతి॥"

ఓ అర్జునా! వేద మంత్రపాఠములలో జెప్పబడని విషయములుండగ వీనికన్న నింకేవియు లేవనుట మూర్ఖ్యమేయగును. వివిధ యజ్ఞకర్మలు చేయుటచే జలరూప ఫలమును నైశ్వర్య ప్రాప్తియు గలుగునని గొప్పగ జెప్పుదురు. కావున నోపార్థ వేదమున త్రైగుణ్య విషయములే నిండి యున్నవి. నీవు గుణాతీతుడవు గమ్ము.

యజ్ఞములును, వాని పద్ధతులను గురించి ఋగ్వేదమున నస్పష్ట వివరణలరుదుగ గలవు. యజ్ఞములువిశేషముగ ఋగ్వేదకాలమున సాగినవి. ఋగ్వేద రచనాప్రారంభమున భరతవర్షమున జనసముదాయము కొలదిగ నుండినది. ఈవరకు దెలిపినట్లు కేవలము పంజాబుప్రాంతము మాత్ర మభివర్ణితము. దానిలో తరువాతి భారతదేశపు సంగతిలేదు. దానిలో నన్ని యుద్ధములు, సాంఘిక సంస్కారములు, యజ్ఞముల స్థానములు కేవలము సింధు, సరస్వతుల తటములే యైయుండినవి.

యజ్ఞపరిపాటిని వర్ణించు యజుర్వేదమున—యజుర్వేదమని పేరుగాని, ప్రపంచకారణముగాని కేవలము యజ్ఞములకొరకే గలిగినది. సమాజ శాస్త్రమును గురించి మిక్కిలిగ వర్ణింపబడినది. తొలుత జెప్పబడినట్లుగ యజుర్వేద కాలమున సంఘము సర్వాంగ సుందరమై యుండినది. నగరము

ఏర్పడి యుండినవి-వర్ణవ్యవస్థ జరుగుచుండినది. ముఖ్యముగ బ్రాహ్మణ క్షత్రియ వర్ణములుగ నేర్పడు చుండినవి.

ఋగ్వేదములో పంజాబు ప్రసక్తిమాత్రమే కలదని యిదివరకే తెలుపబడినది. అయిన బ్రాహ్మణములలో నాధునిక ఢిల్లీ పరిసరములందలి ప్రబలురగు కౌరవ్యులను, ఉత్తర ప్రాంతములందలి విదేహులను, అయోధ్య లోని కోసలులను, కాశీప్రాంతమందలి కాశేయులను గురించి పయింబడి వ్రాయబడినది. నిజమునకు వీరేయిట్టి యజ్ఞాడంబరముల కివకాశ మొసగూర్చిరి. వీరిలో జనకుడు అజాతశత్రు పరీక్షిత జనమే జయాది ప్రతాపశాలురును, విద్వాంసులునగు రాజులుండిరి. ఋగ్వేదములో "సుదాసు"ను గురించి తెలిపినచోట బ్రాహ్మణములలో మనకీరాజుల గురించిన విషయమే యెక్కువగ లభించును. పంజాబులోని యేరాజును గురించియు బ్రాహ్మణములలో నుల్లేఖింప బడమి వారు వెనుకటి పంజాబునే మరచి యున్నట్లు తోచుచున్నది.

యజ్ఞములకు మూలస్తంభమైన యజుర్వేద సూత్ర సంస్కారములకు జనకునాస్థాన విద్వాంసుడగు యాజ్ఞవల్క్య వాజసనేయు డొనర్చెను. కావున నది యతని పేర "శుక్లయజుర్వేద వాజసనేయ సంహిత" మనబడు చున్నది. ఈ యాజ్ఞవల్క్యుడు జనకుని సభలో ముఖ్యపురోహితుడుగ నుండెను. ఇతడు పురాతన క్రమమును సవరించి వ్యాఖ్యలనుండి మంత్రముల వేరుజేయుటకే ఈనూత్న వాజసనేయ సాంప్రదాయమును స్థాపించెను. దీనికి ఫలితముగ నొకక్రొత్త సంహిత, మరియు నొక ప్రసిద్ధమగు శతపథ బ్రాహ్మణము వెలసెను. యాజ్ఞవల్క్యుడు తలపెట్టిన యజుర్వేద సంస్కారణమతని జీవితకాలమున పూర్తిగాక తరువాత ననేకులచే నది పూర్ణమైయుండ నోపును.

బహుదినముల నుండి యజ్ఞము లాచరించుట ఈకాలపు వారికి పరిపాటియై యుండెనది. వీరి వైదిక యజ్ఞవిధానము వాస్తవమునకు ఋగ్వేదమునాటిది కాదనియు, తరువాతి కాలపుదనియు బోధపడును. సుదాసుని యుద్ధానంతరము-కురు, పాంచాలురు ఢిల్లీ, కన్నౌజుల వరకు పారివచ్చినప్పుడు-గొప్పరాజ్యము ఏర్పడి యుండెను. ఈ యజ్ఞములు

రాజుల కోర్కెలనెట్లు దీర్చుచుండినవో ఐతరేయ బ్రాహ్మణమున వర్ణింప బడిన వాక్యములవలన తెలియనగును.

బ్రాహ్మణుల క్రియాసంస్కారములను పెంచుచు, ప్రత్యేక క్రియ లను స్వతంత్రముగ కారణముల జూపుచున్నపుడు కఠినములగు రాజ్య వ్యవస్థల నెదుర్కొనుచున్న క్షత్రియులు విచారశీలురును, అనుభవముగల వారగుటచే వారల సరకు గొనకుండిరి. విచారపరులు, జిజ్ఞాసువులగు వారందరు కేవలమిట్టి క్రియా సంస్కారాదికములే విధులదెలియ జేయునా యని ప్రశ్నించు కొనసాగిరి. అయినను వారిట్టి సంస్కారములను మాత్రము బాహాటముగ వదులుకొనక వాని నాడంబరములుగ జేయుచుండిరి. ఇట్లున్నను వారాత్మోద్దేశమును, ఈశ్వరీయ విజ్ఞానమును గురించి పరిశీలనలొనర్చిరి. ఈక్రొత్త విషయములు తెలివితేటలపై నాధారముగలిగి గర్వించుచున్న వారలను తమమోటమి నొప్పుకొనునట్లు చేసినవి. క్షత్రియుల చెంతనున్న నీనూత్నజ్ఞానమును బడయుటకై వారువచ్చిరి. ఉపనిషత్తులీ విషయమును పుష్టీకరించు రూపములే. అప్పుడప్పుడు రాజులు, పురోహితులు పరస్పరము కర్మకాండను గురించి వాదోప - వాదముల సల్పుచుండిరి. దీనికి శతపథ బ్రాహ్మణమున ( II ప్ర,4,5,11.6,29 )లో చక్కని యుదాహరణము లున్నవి. అప్పుడప్పుడే గురుకులము వీడి శ్వేతకేతు,ఆరుణేయుడు, సోమశుష్ముడు, సత్యయజ్ఞి, యాజ్ఞవల్క్యులను బ్రాహ్మణులు విదేహరాజగు జనకునాస్థాన మునకు వచ్చిరి. అతడు వారిని జూచి యిట్లు ప్రశ్నించెను '- మీరు అగ్నిహోత్రమును గురించి తెలియునా ?" అందు నలువురుందమకుందెలిసిన విధమున బదులు నెప్పిరి. అయిన నెవరి యుత్తరము సరియైనది కాదు. యాజ్ఞవల్క్యుడు మాత్రము యథార్థమునకు చేరువగ నుండునట్లుత్తరమిచ్చెను. అప్పుడు జనకుడు మీకేమియు తెలియదని నుడివి యొచటికో రథము నెక్కి పోయెను. బ్రాహ్మణులందరు రాజు తమ్మవమానించెనని తలచిరి. యాజ్ఞ వల్క్యుడు మాత్రమాతనితో రథముపై బయనించి తన శంకానివృత్తి జేసి కొనెను. నాటినుండి జనకుడు బ్రాహ్మణుడనబరగెను.

వాస్తవమున నిరర్థకములై పెచ్చుపెరిగిన నగ్నిహోత్రముల వర్ణనలు క్రియాకలాపముల యాడంబరము యాజ్ఞవల్క్యునంతటి బ్రాహ్మణుని జ్ఞాపక శక్తిని తగ్గించినవి. ఈ యవక తవకల మాన్పించుటకై యతడు శుక్ల యజు

ర్వేద సాంప్రదాయమును వెలయించెనేమో! దీనికి స్వతంత్రముగ బ్రాహ్మణ శతపథమును విరచించుటలో తన జీవితము నంతయు ధారబోయవలసివచ్చెను.

పురోహితులు సరే, తాపస జీవనములు గడపుట మానిరి. వీరికి దక్షిణల ఆశ పెరుగ నారంభించెను. ఛాందోగ్యోపనిషత్తు [5. 12. 17. 19 .7. 24]. శతపథ బ్రాహ్మణము [3. 2 43], తైత్తిరీయోపనిషత్ [1. 5. 12 ము||]లలో దానము. బంగారు, వెండి, నగలు, వస్త్రములు, బండ్లు, ఆవులు, గోఖరములు, దాసదాసీజనము, భూమి, ఇండ్లు, ఏనుగులను గురించి చెప్పబడినది. యజ్ఞములలో సువర్ణ దానము శ్రేష్ఠ మని తలచబడెను. వెండి దానము నిషేధింపబడెను. బ్రాహ్మణములలో దీని కొక విచిత్రమగు కారణము చెప్పబడినది.

“దేవత లగ్ని కొప్ప జెప్పిన ధనమును మరలనడుగగా నతడేడ్చెను. కారిన నతని కన్నీరు వెండిగ మారినది. ఈ కారణముచేతనే, ఒకవేళ ఎవరైన వెండిని దక్షిణగా నొసంగిన వారియింట కన్నీరు దప్పదు.”

ఇంకొక విషయమిట్లున్నది :—

జనకుడొక అశ్వమేధ యజ్ఞమును చేసెను. దానిలో యాజకులకు మిక్కిలిగ దక్షిణలొసగబడెను. కురు, పాంచాల భాగములనుండి బ్రాహ్మణులనేకులచటికి వచ్చిరి. వచ్చిన వారిలో నెవరు గొప్ప పండితులో రాజు తెలిసికొనదలచెను. తరువాత నతడు వేయి యావులను రప్పించి ఒక్కొక్కదాని కొమ్ములకు 18 బంగారు నాణెములను గట్టించి బ్రాహ్మణులందరితో నిట్లనెను. “మీలోనందరికన్న బుద్ధిమంతులగు వారీయావుల దోలుకొని పొండు”. దానికెవరును సాహసింపరైరి. అది చూచి యాజ్ఞవల్క్యుడు తన శిష్యునితో “వత్సా! వీనిని మరల్చుకొని మన ఇంటికి గొంపొమ్ము”-నెను. అపుడు వాడు “సామవిదునకు జయమగుగాక” అని యాలమందను మరల్చికొనిపోయెను.

ఇది చూచి బ్రాహ్మణులు కుపితులైరి. వారు యాజ్ఞవల్క్యునిపై ప్రశ్నావర్షమును గురిపించిరి. అయిన యాజ్ఞవల్క్యుడొక్కడే వారి

నెదిరింపజాలెను. హోత్రి, అశ్వలుడు, జరత్కారువు, ఉద్దాల కారుణి, ఆర్తభాగుడు, ఉషస్తచాక్రాయణుడు, కహోలుడు, కౌశీతకేయుడు మున్నగు వారు యాజ్ఞవల్క్యుని ప్రశ్నింప నాతడు వారినందరిని నిరుత్తరుల గావించెను.

అంత గార్గిలేచి „ఓ బ్రాహ్మణుడా! నీవందరికన్న విద్వాంసుడవా”? యని అడిగెను. „నా కావుల యవసరము డి వానిని మకల్పించితి” నని యతడు బదులుపలికెను. అప్పుడామె „కాశీ, లేక విదేహరాజకుమారులెట్లు ధనస్సుల సజ్జితము గావించుకొని, తమ హస్తములలో శత్రుచ్ఛేదకములగు రెండు పదునైన బాణములగొని యుద్ధము జేయుటకు నిలుతురో ఆరీతి నేనును రెండు ప్రశ్నలబూని నీతో యుద్ధమొనర్చుటకు నిలువబడియున్నాను. నాప్రశ్నల కుత్తరమిమ్ము”ని యడిగెను.

ఈ వర్ణనలు ప్రాచీన మంత్రద్రష్టలగు ఋషులకును, క్రతుకర్మల విశేషముగ జేయుంచు బ్రాహ్మణులకును నడుమగల అంతరమును సూచించుచున్నవి. ఈ యాజ్ఞవల్క్యునకిరువురు భార్యలుండిరి. వీరిలో విద్యా యోగ్యతయున్నను నైతికపతన మగుపించుచున్నది. వీరుధనవంతులై భోగలాలసులుగ నుండిరి.

గొప్పయజ్ఞములు వసంతఋతువున జరుప బడుచుండెనను విషయము ఐతరేయ బ్రాహ్మణమున స్పష్టమొనర్పబడి యున్నది.

అనేక విద్వాంసులు, జ్ఞానులు యజ్ఞయాగాది కర్మలనుండి విముఖులగు చుండిరను విషయము పైన తెలుపబడినది. ఇదికారణముగ హఠవాదులు కొందరీ యజ్ఞకర్మలగైకొని వానిలో పశువధ, మాంసము నాహుతిగ వ్రేల్చుటలను దోషకార్యముల నొనరింపసాగిరి.

ఐతరేయ బ్రాహ్మణము (1, 15) లో రాజు మహాత్ముడగు వానికి నాతిథేయ సత్కారమును జేయవలసి వచ్చినప్పుడొక ఎద్దునో, ఆవునో జంపవలసి యుండెను. అధునిక సంస్కృత కోశమున నతిథికి ‘గోఘ్న’ డను నొక పేరుకూడ కలదు.

కృష్ణయజుర్వేద బ్రాహ్మణమున అనేక ప్రదేశములలో చిన్న చిన్న యజ్ఞములలో అనేక దేవతలను బలిసమర్పించుటకై పశువులు జంపబడుచుండు టయు గోపథ బ్రాహ్మణమున వాని వివిధ భాగముల బలులను పంచుకొనుట యను వ్రాయబడినది. పురోహితులు నాలుక, గొంతు, కంఠభాగములు, తొడలు కాళ్లు మున్నగు భాగముల గైకొనుచుండిరి. యజమాని వీపును తీసికొను చుండెను. అతఁడు తనభార్యకు పృష్ఠభాగమునే ఇచ్చుచుండెను.

,,అథాతః సవనీయస్య పశోర్విభాగం వ్యాఖ్యాస్యామః, ఉద్ధృత్యావదానాని హనూ సజిహ్వే ప్రస్తోతుః కణ్ఠః సకాకుదః ప్రతిహర్తుః । శ్యేనం వక్ష ఉద్గాతుర్దక్షిణం పార్శ్వం సాంసమధ్వర్యోః సవ్యముపగాతౄణాం సవ్యోంసః ప్రతిప్రస్థాతుర్దక్షిణా శ్రోణీ రథ్యా స్త్రీ బ్రాహ్మణోవస్యక్షిత్యం, బ్రాహ్మణాచ్ఛంసినః ఊరుః పోతుః సవ్యా శ్రోణి హోతురపర ఊరుః నేష్టుర్మైత్రావరుణస్య దక్షిణాస్కన్ధః సవ్యాస్కన్ధస్య స్కన్ధం చానూకం చ గృహపతేర్జాఘనీ పత్న్యైస్తాసాం బ్రాహ్మణేన ప్రతిగ్రాహ యతి, వనిష్ఠుం హృదయం వృక్కౌ చాంగుల్యాని దక్షిణో బాహురాగ్నీధ్రస్య సవ్య ఆత్రేయస్య దక్షిణౌ పాదౌ గృహపతేర్వ్రతప్రదస్య సవ్యౌ పాదౌ గృహపత్న్యై వ్రతప్రదాయః'' గో, 2.18.

శతపథ బ్రాహ్మణము [3. 1. 2. 29] లో పురోహితుడు ఎద్దు, ఆవుల యొక్క మాంసములలో దేనిని తినవలయునో చర్చింపబడినది. చివరకు రెండును తినరాదని తేల్చబడినది. అయినను ఒకచో యాజ్ఞవల్క్యుడు ,,అది మృదువుగానుండిన తినవచ్చు''నని చెప్పియున్నాడు. [1.క].

,,..........స ధేన్వై చానడుహశ్చ నాశ్నీయాత్ । ధేన్వనడుహౌ వా ఇదగుం సర్వం బిభ్రతస్తే దేవా అబ్రువన్ ధేన్వనడుహౌ వా ఇదగుం సర్వం బిభ్రతో హన్త యదన్యేషాం వయసాం వీర్యం తద్ధేన్వనడుహయోర్దధామేతి...... తదుహోవాచ యాజ్ఞవల్క్యోఽశ్నామ్యేవాహమంసలం చేద్భవతీతి''.

[శ.3.1.2.29]

శతపథ బ్రాహ్మణమున [1.2.3.7 8] యజ్ఞములో పశుబలిని గురించి యొక అద్భుత వాక్యమిట్లున్నది :—

"తొలుత దేవతలు మనుష్యుని బలిగానొసంగిరి. వాడు బలిగానొసంగబడినప్పుడు యజ్ఞతత్వము వానినుండి వెడలి గుఱ్ఱములో ప్రవేశించెను. అప్పుడు వారు గుఱ్ఱమును బలిపెట్టిరి. గుఱ్ఱము బలిపెట్టబడినప్పుడు యజ్ఞతత్వము వానినుండి వెడలి ఎద్దులో బ్రవేశించినది. అపుడు వారు ఎద్దును బలినిచ్చిరి. దానినుండి యజ్ఞతత్వము బయల్వెడలి గొఱ్ఱెలో జేరెను. అదియు బలిగానీయబడినప్పుడ ద్దానినుండి యజ్ఞతత్వము వెడలి మేకలో జొచ్చెను. అదియు బలిగానొసంగ బడినప్పుడు యజ్ఞతత్వమెడలి పుడమిని జేరెను. అపుడు వారు భూమిని త్రవ్వి ఆ యజ్ఞతత్వమును వరి మరియు యవలలో గాంచిరి...... ఏరును ఋడికథను దెలియురో వానికి [బియ్యము మొదలగునవి] ద్రవ్యముల నొసంగుటలో పైజెప్పిన పశువుల బలియిచ్చుటవలన కలుగు ఫలమే కలుగును". [అగ్నిమంథంతి సోమే రాజత్యాగతే।].

బ్రాహ్మణముల తరువాత సూత్రకాలమున వైదిక బలిదానముల గురించిన విపుల వర్ణనలను సంక్షిప్తములుగ వ్రాయబడిన గ్రంథములు శ్రౌత సూత్రము లనబరగెను. ఋగ్వేదమునకు రెండు, సామవేదమునకు మూడు, కృష్ణయజుర్వేదమునకు నాలుగు. శుక్లయజుర్వేదమునకు సంబంధించిన వన్నియు లభ్యములు. బౌద్ధ యుగమువరకు నీ సూత్రముల రచన సాగుచునే యుండినది. [అంధానుకరణముగ యజ్ఞములలో హింసాకాండ జరుగుచున్నంతవరకు.]

ఈ మాంస భక్షణ ప్రభావ ముపనిషత్తుల వరకును ప్రబలినది. బృహదారణ్యకోపనిషత్తులో [8.4.8] "ఎవడైనను తనకొమరుడు జయశాలియు, వేదవిదుడు, విద్వాంసుడు కావలెనని కోరునెడల నతడెద్దు మాంసమును బియ్యముతో కలిపివండి నేయితో భుజింపవలె"నని వ్రాయబడియున్నది.

"అథ య ఇచ్ఛేత్ పుత్రో మే పండితో విజిగీతః సమితింగమః సుశ్రూషితాం వాచం భాషితా జాయేత సర్వాన్వేదానుబ్రువీత సర్వమాయురియాదితి మాంసౌదనం పాచయిత్వా సర్పిష్మంత మశ్నీయాతామీశ్వరౌ జనయితవా ఔక్షేణవా ఋషభేణవా" బృ.ఉ. 8.4.18.

శ్రౌత సూత్రములలో రెండువిధములగు యజ్ఞములు పేర్కొనబడినవి. ఒకటి హావిర్యజ్ఞము—దానిలో నెయ్యి, పాలు, పేయి, మాంసాదికముల అర్పణమీయబడును. రెండవది సోమయజ్ఞము—దీనిలో సోమరసము సర్వ్యముగ నీయబడును.

హావిర్యజ్ఞములు :— 1. అగ్న్యాధానము, 2. అగ్నిహోత్రము, 3. దర్శపూర్ణమాస, 4. ఆగ్రయణము, 5. చాతుర్మాస్యలు, 6. నిరూఢపశుబంధము, 7. సౌత్రామణి యనునవి.

**సోమయజ్ఞములు :—**

1. అగ్నిష్టోమము. 2. అత్యగ్నిష్టోమము, 3. ఉక్థ్య, 4. షోడశి, 5. వాజపేయము, 6. అతిరాత్రము. 7. అప్తోర్యామములు.

ఇవిగాక చలికాలములో చేయబడు అష్టకములు, తొలిపూర్ణిమ నాడొనర్పబడుచుండిన పార్వణేత్యాద్యల్పక్రియలును గలవు. శ్రాద్ధము—పితృలకు బలిదానము. మార్గశిరమున "ఆగ్రహాయణీ" చేయబడుచుండినది. చైత్రీ"యనునది చైత్రమున నొనర్పబడుచుండినది. ఆశ్వయుజి—ఆశ్వయుజ మాసమున చేయబడు చుండినది. వీనిలో పెక్కు—ధార్మిక క్రియలు తిథులు ఇప్పుడు పండుగలుగ మారినవి. సర్వసామాన్యముగ జేయబడు పూజలు, యజ్ఞముల శ్రేష్ఠమును ధర్మకార్యములుగ నేడు పరిగణింపబడు చున్నవి. స్వర్గప్రాప్తికి కర్మలేక మాత్రద్వారముగ తలపబడుచుండెను.

గౌతముడు "ఈ పవిత్రకర్మల జేయునప్పటికి ఆత్మలో మేలు దలపనివాడు స్వర్గమును బొందజాల"డనియు "....ఈ కర్మలలో నేకొన్ని టినో యథార్థములుగ జేయుచు నాత్మలో మేలుదలచువాడు తప్పక స్వర్గమున నివసింప జాలు"నని నుడివియున్నారు. [8.24,25]

పూర్వమీమాంసలో యజ్ఞములను గురించి మిక్కిలి వాదవివాదములు జరిగియున్నవి. వానిలో మూడు పద్ధతులు వివరింపబడినవి: పవిత్రాగ్నిని స్థాపించుట, హవన మొనర్చుట, సోమరసమును సిద్ధమొనర్చుటలు. ఈ ప్రశ్నలు, వీనికై జరుపబడిన వాదోపవాదములు ముఖ్యములైనవి.

కొన్ని యజ్ఞములలో యజమాని తనకుగల సర్వస్వము నొసంగవలసి యుండును. ఇట్టిచో రాజుకూడ తన భూమి, గ్రామక్షేత్రము, చెఱువు, కుంటలు బ్రాహ్మణుల కొసంగవలెనాయను ప్రశ్న వేయబడినది. దీనికి భూమి రాజు యొక్క ఆస్తి కాదు కనుక దాని నతడొసంగ జాలడనియు, రాజు కేవలము దేశము నేలగలడు; అయిన దేశమతని సంపద కాదు. అది యటులేయగుచో తన రాజ్యమందలి ప్రజల గృహక్షేత్రాదికములు తనవే యైయుండవలెను. ఏరాజ్యములోనైనను అట్టి భూమిని రాజొసంగ జాలడు. అయిన, రాజేయింటినైన, భూమినైన గొనియుండిన చో దానినతడొసంగగలడు.

ఇదేవిధమున అగ్నిలో తన్ను బలియొసంగుటను గూర్చియు, ఇతరులకు హాని గలిగించు యజ్ఞముల నొనర్చుటను గూర్చియు ప్రశ్నలు వేయబడి మిక్కిలి తెలివితేటలతో విచారింపబడినవి.

పూర్వమీమాంసలో గొప్పయజ్ఞములలో కార్యకర్తలు పదునేడ్గురుండవలెనని—ఒకయజమాని, 16 గురు పురోహితులు—అయిన కొద్ది కార్యములలో నలుగురు బ్రాహ్మణులు మాత్రమే చాలునని చెప్పబడియున్నది. యజ్ఞము ననుసరించి బలిసంఖ్య చెప్పబడినది. అశ్వమేధ యజ్ఞమున గన్ని విధములగు ప్రాణులు—పెంపుడు జంతువులు, వన్యములు, జలచర, ఖేచరములు, నీటిపైనీదగలవి మున్నగు నారునూట తొమ్మిది ప్రాణులకు తక్కువ గాకుండగ బలియొసంగ బడవలెను.

యజ్ఞములలో హింసా కాండ పెరిగిన కొలది క్రమముగ ప్రజలు దానిని విరోధించుచు నసహనమును ప్రకటింప సాగిరని తెలియుచున్నది. మహాభారతములో—"వేదములో చెప్పబడిన 'అజముతో యజ్ఞమొనర్పుము' అనుదానికి 'అజ'మనగా బీజముగాని, మేక కాదు—అజైర్యజ్ఞేషు యష్టవ్యమితి వై వైదికీ శ్రుతిః అజసంజ్ఞాని బీజాని ఛాగన్నో హన్తుమర్హథ"
[మహా.అను]

"గోవులవధ్యములు వీనిని జంపగూడదు—అఘ్న్యా ఇతి గవాం నామక ఏతాన్ హన్తు మర్హతి........"

„హింస ధర్మము కాదు—నహింసాధర్మ ఉచ్యతే"

పశువు చంపబడినచో ధర్మమగునందురు—వైదికకర్మ. సతాం దేవా యత్రవధ్యేత నైవ పశుః। పశునిష్టేచ్ఛాహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి, స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హింస్యతే"

యజ్ఞములలో పశుహింస ఎక్కువ జరుగు చున్నప్పుడు దానిని గర్హించుట కేర్పడిన చార్వాక సాంప్రదాయమిట్లు పరిహసించుచున్నది— „పశువును చంపుట చేతనే స్వర్గమువారికిని యజమాని తన తండ్రినేల చంపి యాజ్ఞమున వ్రేల్వజాలకున్నాడు ?"

మత్స్యపురాణము అధ్యాయము 143లో యజ్ఞవిషయమున సంబంధించిన వర్ణన లభించుచున్నది.

„స్వాయంభువ మను కాలమున త్రేతాయుగారంభమున యజ్ఞముల ప్రచారమెట్టులయ్యెనని ఋషులడిగిరి. సత్యయుగముతో నాయుగ సంధి కాలము ముగిసిన పిమ్మట త్రేతాయుగ మారంభమైనప్పుడు వృష్టిప్యవస్థ ఆరంభమైనది ? గ్రామ, పుర, నగరాదికము లేర్పడిన పిమ్మట కృషిఫలితముగ నోషధుల కనుగొనిన పిదప జీవనోపాయముల నేకములు పనిపాటులు మొదలైన తరువాత నావేదోక్త మంత్రములచే యజ్ఞ ప్రచారమేరీతి యారంభమైనది ?"

ఇదివిని సూతపురాణికు డిట్లనెను:— „వైదిక మంత్రముల వినియోగము యజ్ఞకర్మలనుండి చేయుచు విశ్వభుగింద్రుడు యజ్ఞప్రచార మొనర్చెను. దేవతల రావించి యజ్ఞసాధనములన్నియు సేకరింపబడి అశ్వమేధ యజ్ఞమారంభింపబడెను. వారిలో నెందరో మహర్షులుండిరి. పలుదినములు హవిస్సులను ఋత్విజులనేకులు వ్రేల్చుచుండిరి. శ్రావ్యముగ సామగానము లాలపింప బడుచుండినవి. పశువులచటికి తేబడుచుండినవి. యజ్ఞభోక్తలగు దేవత లాహ్వానింపబడిరి. అప్పుడు దీన పశుగణమును జూచి, మహర్షులు లేచి ఇంద్రునితో మీయజ్ఞవిధి యెట్టిదని ప్రశ్నించిరి.

ఇటు ధర్మము పేరిట గొప్ప యధర్మ మాచరింప బడుచున్నది. ఈ పశువిశసనవిధి యనుచితమైనది. నీవు ధర్మమును నశింపజేయు నుద్దేశముతో పశువధచేసి యధర్మ మారంభించితివి. ఇది ధర్మముకాదు అధర్మము. నీవు యజ్ఞము చేయవలసియున్న ధాన్యబీజములతో యజ్ఞ మొనర్పుము" ఈ విధముగ ఋషులు చెప్పిరి. కాని ఇంద్రుడు వినడయ్యెను.

అప్పుడు ఋషులకును, ఇంద్రునకును గొప్పవాద వివాదములయ్యెను. యజ్ఞము జంగమముల తోడనా, స్థావరములతో జేయబడవలయునా? అను ప్రశ్న యుదయించెను. ఋషులు విజితులై చింతతో వసుచక్రవర్తి యొద్దకేగిరి.

"ఉత్తాన పాదవంశతిలకా! నీవెట్టి యజ్ఞవిధుల జూచితవో వివ రింపు"మని ఋషులడిగిరి.

"ద్విజులకు మేధ్యములగు పశువులచేతను, ఫలమూలములచేతను యజ్ఞము జేయుటొప్పును. యజ్ఞస్వభావమే హింస. ఇది నేను జూచితి"నని వసురాజు బలికెను...........

"రాజుపలుకులు విని క్రుద్ధులై ఋషులతనికి శాపమిడిరి. నీవు పతి తుడవగు" మనుటతో నతడు పతితుడయ్యెను,

కొద్దిమార్పులతో నిట్టి కతయే వాయుపురాణములో కలదు. దీని నుండి నాటి విద్వాంసులు గొందరు పశుబలి మహాపాతకమని తలంచినట్లు తెలియుచున్నది.

మహాభారతము శాంతిపర్వము [345]లో గూడ నిట్టిదే యొక మనోహరమగు గాథ కలదు. "ఇంద్రుడు" పుడమికి వచ్చియొక యాగము చేసెను. పశువు కావలసి వచ్చినప్పుడు బృహస్పతి యతనితో 'పశువుకై పిండి తెండ'ని అనెను. ఇదివిని మాంసలాలసులగు దేవతలు పదే పదే యతనితో మేక మాంసముతో హవన మొనర్పుడని ప్రార్థించుచుండిరి.

"అప్పుడు బృహస్పతి—యజ్ఞములలో బీజములతో [ధాన్యములతో] యజ్ఞమొనర్ప వలయును. 'యజ్ఞము' న బీజము. మేకను జంపుట సజ్జన లక్షణము కాదు. ఇది శ్రేష్ఠమగు "కృతయుగము. దీనిలో పశువెట్లు బలిపెట్టబడును?" అని ప్రశ్నించెను.

"అప్పుడందరుపరిచర" వసువును మధ్యస్థునిగ నొనర్చి, యతనితో నిట్లనిరి :— ఓ రాజా! యజ్ఞము మేక మాంసముతో జేయవలయునా, లేక నదివనస్పతులతో జేయబడునా? దయచేసి మీరు తీర్పొసంగుడు". రాజందులకు మీరెవరి యభిప్రాయమెట్టిదో తెలుప నాకు విశదపరచు" డనెను.

"ఋషులు ధాన్యహవనము మాపక్షము, పశుబలియీయవలెనను వారు దేవత" లని తెలిపిరి.

"అయిన మేక మాంసమునే వేల్చవలెనని వసువనెను. ఇదివిని ఋషులు వానినధః పతితుడగునట్లు శపించిరి. వాడటులయ్యెను.

"వసువు యజ్ఞముచేయ తలపెట్టెను. దానిలో బృహస్పతి ఉపాధ్యాయుడుగను, ప్రజాపతి పుత్రులు సదస్యులుగనుండిరి. ఎక్రతు, ద్విత, త్రితులు, ధనువ, రైభ్య, అర్వావసు, పరావసు, మేధాతిథి, తాండ్య, శాంతి, దేవశిరా, కపిల, ఆద్యకఠ, తైత్తిరి, కణ్వ, దేవహోత్రులను పదునారుగురు ఋత్విజులుగ నుండిరి. ఈ యజ్ఞమున పశుబలి నీయలేదు. ఈ యజ్ఞమహింసతో గూడి పవిత్రమైయుండినది. దీనివలన వసని కభ్యున్నతి చేకూరెను". [మ.భా. శాం.ప. అ, 336].

పశుబలి వేదకాలమునకన్న మిక్కిలి ప్రాచీన కాలములో జరుపబడుచుండెనని మహాభారతము తెలుపుచున్నది.

"ఇది కృతయుగము. దీనిలో యజ్ఞమున పశువవధ్యము. దీనిలో నాలుగు కాళ్లతో ధర్మమొప్పుచున్నది. దీని తరువాత త్రేతాయుగమగును. దానిలో త్రయీవిద్యయైయుండి యజ్ఞ పశువులు ప్రోక్షింపబడి వధింపబడును". [మ.భా.శాంతి,అ,340].

శ్రీమద్భాగవతమున నొకచోట [4.25.7.8] ఒక యజ్ఞమును గురించి యిట్లు వ్రాయబడినది—"ఓరాజా! నీయజ్ఞములో మిక్కిలి నిర్దయతో నీచే జంపబడు పశువులన్నియు క్రౌర్యమును దలపోయుచు, కోపమూని తీక్ష్ణములగు కరవాలములచే నిన్నునరకుటకెదురు చూచుచున్నవి".

"ఈ దయావిహీనమతిచే యజ్ఞములలో వధింపబడిన పశువులే కోపముచే నీ యసౌగ్యని కృత్యముల దలపోయుచు గొడ్డలిచే నీతనని ఛిన్నాభిన్నముల జేయసాగినవి.

ఈపాప భూయిష్ఠములగు యజ్ఞముల నశింపజేయుటకు మహానుభావుడగు బుద్ధభగవానుడత్యంత పురుషార్థమును జూపెననుటలో సందియము లేదు. అయినను హిందువులలో బలిపెట్టు పద్ధతి పూర్తిగా మాసిపోలేదు. ఇప్పటికిని గొందరు అంధానుకరణముగ నిట్టి క్రూరకర్మములను యజ్ఞములని, విహితములని నమ్ముచున్నారు. కొంతకాలమునకు ముందు పూనానుండి వెలువడు ప్రసిద్ధ "కేసరీ" పత్రికలో నొక యుత్తరము ప్రకటితమైనది. పాఠకులకై యథాతథముగ దానినిచ్చుట బొందుపరచుచున్నాను. ఈ యుత్తరము దాక్షిణాత్యుడను "బాపట ధుండీరాజ గణేశసోమయాజి"చే వ్రాయబడినది.

"గడచిన ఫిబ్రవరి నెలలో ఔంధ సంస్థానమున అగ్నిష్టోమమను పేరనే నొక యజ్ఞము జేసితిని. దానిలో పశువు వివిధాంగములతో వ్రేల్చబడెను. వేదవిహితమగు నా పశుహవనమును గురించి వేదవాక్యముల పాటింపని వారు కొందరు పత్రికలలో నేమేమొ వ్రాసిరి.

"బ్రాహ్మణాది త్రైవర్ణికులకు విహితములగు వర్ణాశ్రమధర్మములలో యజ్ఞకర్మము ముఖ్యమైనది. యజ్ఞములో హవనము ముఖ్యమైనది. హవనములో ననేక దేవతలనుద్దేశించి మంత్రపఠన పూర్వకముగ వివిధ పదార్థము లాహుతి యొసంగబడును. [ఆజ్యము, చరుపురోడాశము, సోమరసాదిక ద్రవ్యములు] వీనితో బాటు అజ, మేషాదిక పశువుల అంగముల మాంసమును జెప్పబడియున్నది.

"భారత యుద్ధమునకు తరువాత జైనులు వైదికధర్మముల గురించి గొప్పగ పోరాడిరి. దాని మూలముగ వైదికధర్మములకు మిక్కిలి యాఘాతము సంభవించెను. ఆతరువాత గుప్తవంశీయులగు రాజులు అశ్వమేధ యజ్ఞముల గావించి (దీనిలో 300 పశువుల హననము విధింపబడినది.) వైదిక పరంపరను స్థిరీకరించిరి. జయసింహరాజుకూడ అశ్వమేధ యజ్ఞమును చేసెను. యజ్ఞములలో జేయబడినది హింసయనబడదు. ఛాందోగ్యోపనిషత్తులో నిట్లున్నది.

"మాహింస్యాత్సర్వ భూతాని అన్యత్ర తీర్థేభ్యః"

"శంకర భాష్యము-తీర్థనామ శాస్త్రానుజ్ఞావిషయః, తతోఽన్యత్రేత్యర్థః'

శాస్త్రాజ్ఞానుసారము చేయబడు కర్మయే తీర్థము. ఈ విశేషకర్మల మాని వేరుకర్మలలో హింస యొనర్పగూడదు. దీనివలన శంకరాచార్యులు కూడ యజ్ఞములయందలి హింసను విరోధించలేదని తాత్పర్యము.

"దేవతలనుద్దేశించి యజ్ఞప్రసంగములలో వేదవిధిననుసరించి చేయబడు పశుహననము "హింస" యనబడదు. తమ కడుపుల నింపుకొనుటకై మాంసము తినునిమిత్తముతో చేయబడు పశుహననము "హింస" యనబడును. వేదోక్త పశుహింసలో దేవతలకై మాంసహుతుల నిచ్చుటయే ముఖ్యోద్దేశము. హుతశేషమాంసమును భక్షించుటకూడ విధివిహితమే. కావున శాస్త్రాజ్ఞను రక్షించు నిచ్ఛతో నీ హుతశేషమాంసము భక్షింప బడుచున్నది.

"వర్ణాశ్రమముల దెలియుటచేతనే యజ్ఞీయ పశుహింస చేయబడుచున్నది. సోమభాగమున పశుహింసలేనియెడ కర్మ పరిపూర్తి కాజాలదు. కొందరు విచార శూన్యులు వేదమర్యాదల పాటింపని వారివిధేనులగు సోమయాగాది వైదిక కర్మలనపహసింతురు. వారిచే యజ్ఞముల జేయువారు తక్కువ అహింసాపరులని జెప్పబడరు. "అహింస" పరమ ధర్మమనునది సత్యము, అయిన నపవాదమందును గలదు. క్షత్రియులు మృగయా, యుద్ధములలో హింసయొనర్చు నట్లే యాజ్ఞికర్తలు యజ్ఞవిధిననుసరించి పశుహననము గావింతురు.

యజ్ఞములందు జేయబడు పశుహననరీతి-పశువధయే కన్న తక్కువ దుఃఖమును కలిగించును.

పశువును ఉత్తరదిక్కునకు గాళ్లుచాపి పరుండ బెట్టవలెను. తరువాత శ్వాసాది ప్రాణవాయువుల నిరోధించి ముక్కు, ముఖములను మూయవలెను. ఇత్యాది సూచనలు శామితులకు జెప్పబడినవి.

„ఉదీచీనాం అస్యపదోనిదధాత్
అంతరే వోష్మాణం వారయతాత్." [ఐ. బ్రా. 6, 7]

మరియు,

„అమాయుకృణ్వంతం సంజ్ఞయతాత్." (తై.బ్రా.3.6.6)

అనగా :— పశువునకు చాల తక్కువ దుఃఖమును కలిగించి వధింపవలెను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

# ఆధార గ్రంథములు

## ఋగ్వేదము

(క) భాష్యములు:

[1] సాయణ భాష్యము, శబ్దాను క్రమణిక ప్రతీక సూచి సహితము. మ్యాక్స్‌మూలర్ సంపాదితము. [ 1859 - 75 ద్వి. సం. లండన్ 1890-92 ].

[2] ల్యాటిన్ అనువాదము ( By Rosen 1830-38 ).

[3] ఫ్రెంచి అనువాదము [ By Longlois 1848,51 ].

[4] జర్మను అనువాదము [ By A. Ludwig 6 Vols పూర్ణము Prag 1876-88 [భూమిక, భాష్యము మరియు Index సహితము].

[5] జర్మని అనువాదము [ By H. Grassman, Leipzig 1876-77 ].

[6] జర్మనీ అనువాదము [By K. F. Gilder Tubingen 1908].

రెండవ సంస్కరణ—Gonttengen 1923.

[7] అనువాదము By Rudolf Roth.,

[8] Roors edition of text of translation in Bible India no, 1-4 (Calcutta 1849) రెండవ అధ్యాయము వరకు.

(9) ఇంగ్లీషు అనువాదము By Wilson.

(10) Do Do By Arrowsmith Boston 1886.

[11] Do Do By R. H. T. Griffith వారణాశి 1889-92.

[12]. శ్రీ ఆనంద తీర్థుల భాష్యము (విశేషించి ఒకభాగముపైనె)

దీని ప్రథమ, ద్వితీయ, తృతీయాష్టక భాష్యములకు శ్రీజయతీర్థుల టీక కలదు. ఇది ఇండియన్ హౌస్, లండన్ పుస్తకాలయములో కలదు.

[13] సాయణ భాష్యము Bombay Theosophical Publi. cation fund Bombay.

[14] దయానంద సరస్వతి భాష్యము.

( తక్కిన ఆర్య భాష్యములు )

[ఖ] ఋగ్వేద బ్రాహ్మణములు :

1. ఐతరేయ బ్రాహ్మణము — సాయణ భాష్య సహితము, సంపాదకులు కాశీనాథ శాస్త్రి, ఆనందాశ్రమము పూనా, సం. 1396 ఖండము 1, 2.

2. ఐతరేయ బ్రాహ్మణము సాయణ భాష్య సహితము. సత్యవ్రత సామశ్రమీ సంపాదితము. ఏషియాటిక్ సొసైటీ, కలకత్తా సంవత్. 1952-62 ఖండములు [1-4].

3. ఐతరేయ బ్రాహ్మణమున కింగ్లీషు అనువాదము:- అనువాదకులు A. B. Keith Harward Griental Series vol 25. 1920.

4. ఐతరేయ బ్రాహ్మణము Martin Hang సంపాదితము బొంబాయి ప్రభుత్వ ప్రకాశనము 1863.

5. Das Aitariya Brahman సంపాదకుడు Theodor Aufreight Bombay 1879.

6. సాంఖ్యాయన కృతికి ఆంగ్లానువాదము — అనువాదకుడు A. B. Keith Harward Oriental series Vol 25. 1920.

7. కౌశీతకి బ్రాహ్మణము— సంపాదకుడు B. Lindner gena 1837.

8. సాంఖ్యాయన బ్రాహ్మణము—గులాబ్ శంకర్ జయశంకర్ సంపాదితము. ఆనందాశ్రమము సంస్కృతగ్రంథావళి పూనా 1911.

శిక్షా :

[1] జర్మను అనువాద సహితమగు ఋగ్వేద ప్రాతిశాఖ్య, సంపాదకుడు మాక్సుమూలర్, లీప్జిగ్ 1856 -69.

2. శిక్షా సంగ్రహము — చౌఖంబా సంస్కృత సీరీజ్ బెనారస్ 6.

(ఘ) కల్పములు :

1. ఆశ్వలాయన శ్రౌతసూత్రములు. Bible India Calcutta

2. Do Do Harward Oriental series vol 25

3. సాంఖ్యాయన శ్రౌతసూత్రము. A. Hillebrandf సంపాదితము. Bible India 1888.

4. సాంఖ్యాయన శ్రౌతసూత్రము, Keith Journal of the Royal-Asiatic Society 1907 P. N. 40.

5. సాం. శ్రౌ. సూత్రము. Harward Oriental series vol 25 P. 50.

2. గృహ్య సూత్రములు :

1. ఆశ్వలాయన గృహ్య సూత్రములు సటీక, గార్గ్య నారాయణ సంపాదితము. Bible India 1869.

2. ఆశ్వలాయన గృ. సూ. హరదత్తాచార్యుల టీకతో కూడినది—గణపతిశాస్త్రి, త్రివేంద్రం సంపాదితము [సంస్కృత సీరీజ్] నంబరు 78-1923.

3. ఆ. గృ. సూ. జర్మను అనువాద సహితము :— అను : A.B. Stazler, Indisdu Hausuagel Germany 1865—8.

4. ఆ. గృ. సూ. ఆంగ్లానువాదము—అను :— H. Oldenberg, Sacred Books of the East vol. 29.

5. సాంఖ్యాయన గృహ్యసూత్రములు సంస్కృతము మరియు జర్మనీఅనువాదములు. H. Oldenberg Indische Studies, heransgegelrem Awelud.

6. ఆంగ్లానువాదము (Sacred Books of the East) vol 29.

7. కౌశీతకీ గృహ్యసూత్రములు:— రత్నగోపాలభట్ట బనారస్ సంపాదితము. సంస్కృత సీరీజ్. 19. 7.

8. ఆశ్వలాయన సూత్రప్రయోగ టీకాదికములు. మంజనాచార్య భట్టకృతము. చౌఖంబా సంస్కృత సీరీజ్ కాశి.

9. సాంఖ్యాయన గృహ్యసూత్రము. వాసుదేవకృతము.

3 పరిశిష్టములు:

1. భాష్యసహితమగు చరణవ్యూహము. శౌనకీయ పరిశిష్టము.

ఙ. వ్యాకరణము:—పాణినీయ స్వరవైదిక ప్రక్రియా.

చ. నిరుక్తము:

1. నిరుక్తభాష్యము రెండు భాగములు. కాంగ్డీగురుకులము.

2. నిఘంటు.

ఛ. ఛందము:...పింగళ ఛందస్సూత్రము.

జ. జ్యోతిషము లగధ

ఝ. అనుక్రమణిక :

1. సర్వాను క్రమణిక కాత్యాయన కృతము.

2. ఆర్షాను క్రమణిక శౌనక కృతము.

3. ఛందోను క్రమణిక శౌనక కృతము.

4. అనువాకాను క్రమణిక Do

5. పాదాను క్రమణిక Do

6. సూక్తాను క్రమణిక Do

7. దేవతాను క్రమణిక [అనుపలబ్ధము.]

8. ఋషిధ్యానము శౌనక కృ.

# యజుర్వేదము

[క] సంహితలు—భాష్యములు :

1. కాఠక సంహిత Edited by L.V. Schroeder, Leipzig 1900—1910.

2. కాఠక సంహిత Text and its interpretation S.Keith, Journal of the Royal Asiatic Society 1910—18.

3. కాఠక సంహిత By Caland L. D. M. G. 72. 1918.

4. కపిష్ఠల కఠ సంహిత—అప్రకాశితము చూడు L. V. Schroeder W. Z. K. M. L. 362.

5. మైత్రాయణీ సంహిత— L. V. Schroeder ,Leipzig 1881—86.

6. తైత్తిరీయ లేక ఆపస్తంభ సంహిత [ రోమాయలిపి ] A. Weber, industud vol 11 & 12.

7. తైత్తిరీయ సాయణ భాష్య సహితము Bible India 1860—1899.

8, Do ఆనందాశ్రమము పూనా No. 42.

9. తైత్తిరీయ లేక ఆపస్తంభ సంహిత సాయణ భాష్య సహితము—ఆంగ్లాను వాదము, A. B. Keith, Harward Oriental series vol 18, 19. , 1914.

శుక్ల యజుర్వేదము :

10. వాజసనేయ సంహిత—మహీధర భాష్య సంహితను. A. B. K. Berlin London 1852.

11. Do ఆంగ్లాను వాదము Griffith వారణాశి. 1899

12. Do మహీధర భాష్య సహితము Weber London, Berlin 1852.

13. Do ఉబ్బటు మహీధర భాష్యము (నిర్ణయసాగర ప్రెస్)

14. తైత్తిరీయ సంహిత—భట్ట భాస్కర మిశ్రుని భాష్యము [అప్రకాశితము].

15. శుక్లయజుర్వేద సంహిత—పం. జ్వాలా ప్రసాదమిశ్ర భాష్యసహితము.

16. కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత.

17. అజమేరు యజుర్వేద భాష్యము — స్వా. దయానంద కృతము.

ఖ. బ్రాహ్మణములు :

1. తైత్తిరీయ బ్రాహ్మణము — సాయణ భాష్య సహితము రాజేంద్రలాల్ మిశ్ర సంపాదితము. Asiaitic Society of Bengal, Calcutta.

2. తైత్తిరీయ బ్రాహ్మణము—నారాయణశాస్త్రి సంపాదితము. భా. 1-3. ఆనందాశ్రమము, పూనా 1899.

3. తైత్తిరీయ బ్రాహ్మణము—భట్ట భాస్కర భాష్యము— మహాదేవశాస్త్రి, శ్రీనివాసాచార్య సంపాదితము 1908-21 మైసూరు.

4. శతపథ బ్రాహ్మణము [ మాధ్యందినీయము ] సంపా. A. Weber Repring 1924.

5. మాధ్యన్దినీయ శతపథ బ్రాహ్మణము—అజమేరు 1859.

6. శతపథ బ్రాహ్మణము—సాయణ భాష్య సహితము కాండము 1-3,5,7,9 సత్యవ్రతసామ శ్రమీ సంపాదితము 1903—11 Asiatic Society of Bengal, Calcutta vol 1—VII.

7. శతపథమున కాంగ్లాను వాదము —అను : Julines Eggeling (Sacred Books of the East vol 12,26,41,43 & 44).

8. కాణ్వీయ శతపథ బ్రాహ్మణము [లాహోరు] D. G. P. కాలేజి.

క. శిక్షా :

1. తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రములు—ఆంగ్లాను వాదసహితము. Journal of the American Oriental Society vol 1. New Havan 1871.

2. వాజసనేయ ప్రాతి శాఖ్యసూత్రములు—సంపా: పి.వి. పాఠక్ బనారస్ 1883-880.

3. వాజసనేయ ప్రాతి శాఖ్యసూత్రములు జర్మనీ అనువాదము— Weber Indstud 4,65,160,177.33.

4. ప్రతిజ్ఞా సూత్రములు—సంపా: Weber A.B.A.17-69.

5. కాత్యాయన శుక్ల యజుర్వేద ప్రా. శా. భాష్యసహితము.

ఘ. కల్పము :

శ్రౌతసూత్రములు.

1. కాత్యాయన శ్రౌత, శుల్బసూత్రములు—వ్యాఖ్యాచార్యుని భాష్యముతో సంపా: మదనమోహన పాఠక, విద్యావిలాస ప్రెస్, కాశీ.

కృష్ణయజుర్వేద శ్రౌతసూత్రములు :

2. కాత్యాయన శ్రౌ. సూ.—సంపా: A. Weber.

3. Do Do భాష్యసహితము విద్యావిలాస ప్రెస్, కాశీ.

4. బోధాయన శ్రౌ. సూ.—సంపా: W. క్యాలెండ్ Bible India 1904-26.

5. ఆపస్తంభ శ్రౌత. సూ—సంపా: R. Gorbe Bible India 1882-1903.

6. హిరణ్యకేశీయ శ్రౌ. సూ --సటీక; ఆనందాశ్రమము, సం. గ్రంథావళీ పూనా.

7. మానవ శ్రౌ. సూ —Books 1-5 Elited By F. Knaver St. Pitersburg 1900.

8. మానవ శ్రౌ.సూ. చయనము—By J. M. VanGelder Leyden 1921.

## 2. గృహ్యసూత్రములు

**శుక్లయజుర్వేదము :**

1. పారస్కర గృహ్యసూత్రములు. కాత్యాయన సూత్రీయ శ్రౌతశాఖ, విద్యావిలాస్ ప్రెస్, కాశీ.

2. పారస్కర గృహ్యసూత్రములు హరిహర భాష్యసహితము— లక్ష్మీవేంకటేశ్వర బొంబాయి 1890.

3. పారస్కర గృహ్యసూత్రములు అధీరామశర్మ సంపాదితము; జర్మనీ అనువాదము — అనువాదకుడు: A. F. Steynet Indisobe, Hawregelin A. K. M. VI. 2 & 4, 1876-8.

[పారస్కర గృ. సూ. భాష్య చతుష్టయముతో గుజరాతీ ప్రెస్, బొంబాయి].

4. పారస్కర గృ.సూ.ఆంగ్లానువాదము—కర్త: H. Oldenbery S. B. E. vol 29.

**కృష్ణయజుర్వేదము :**

5. ఆపస్తంబ గృహ్యసూత్రములు—సంపా: M. Winternitz Vienna 1887.

6. అనువాదము ఆపస్తంబ పరిభాషా సూత్రసహితము-S.B.E. vol 30.

7. హిరణ్యకేశి గృ సూ,—సంపా: J. Kireste Vienna 1889.

8. ఆంగ్లానువాదము—S.B.E. vol 30.

9. బౌధాయన గృ. సూ.—సంపా: శ్రీనివాసాచార్యులు, మైసూరు 1908. Bibliothica Sanskrita No. 32.

10. భారద్వాజ గృ. సూ.—సంపా: Hewiette J. W. Salomons Leyden 1913.

11. మానవ గృహ్యసూత్రములు—సంపా: F. Knauer St. Petersburg 1897.

12. కాఠక గృహ్య సూత్రములు—సంపా: W. Caland D. A. V. College Lahore.

13. వైఖానస గృ. సూత్రములు—Leipzig 1896.

14. వారాహ గృ. సూ.—సంపా: R. శ్యామశాస్త్రి గాయక్వాడ్, Oriental Series No. 18 Baroda 1921.

### 3. కల్ప—ధర్మసూత్రములు

1. ఆపస్తంబ ధర్మసూత్రములు
2. బౌధాయన ధ. సూ.
3. వశిష్ఠ ధ. సూ.
4. గౌతమ ధర్మసూత్రములు.
5. వైఖానస ధ. సూ. (Leipzig 1896)
6. హిరణ్యక ధ. సూ.

## 4. కల్ప—శుల్బసూత్రములు (Sculpture)

1. అపస్తంబ శుల్బసూత్రములు. జర్మనీ అనువాదముతో-కర్త Albert Burke Zoitschriblider Dentachen morgen Tandischan Gesellsohft Z.D.M.S. 12. 1918.

2. బౌధాయన శుల్బసూత్రములు — ఆంగ్లానువాద సహితము G. Thibant "పండితుడు" vol IX.

3. కాత్యాయన శుల్బసూత్రములు—[కాశీనుండి శ్రౌతసూత్రముతో బాటుముద్రితము.]

4. హిరణ్యకేశీయ శుల్బసూత్రములు.

## 5. కల్పములు—శ్రాద్ధకల్పములు

1. మానవ శ్రాద్ధ కల్పము—సంపా: W. Caland Atlindischer Ahnencut PP 228 FF.

2. శౌనకీయ శ్రాద్ధ కల్పము—PP 243 FF.

3. పిప్పలాద Do Do—కొన్ని అంశములు PP 243 FF.

4. కాత్యాయన Do Do—PP 245.

5. గౌతమ శ్రాద్ధ కల్పము--S. Calandin By dragen.

## 6. కల్పములు—పితృమేధ సూత్రములు

| | | | సంపాదకుడు |
|---|---|---|---|
| 1. బౌధాయన పితృమేధ సూత్రములు. | | | W. Caland A. K. M. X. 3. 1869. |
| 2. హిరణ్యకేశి | Do | Do | |
| 3. గౌతమ | Do | Do | |

## 7. కల్పములు—పరిశిష్టములు

1. కర్మప్రదీపము 2 భాగములు జర్మనీ అనువాద సహితము. Q. S. 1889, 1900.

ఇ. అనుక్రమణికలు :

1. కాత్యాయన శుక్లయజుర్వేద సర్వానుక్రమ సూత్రము భాష్య సహితము, కాశీ.

2. నిగమ పరిశిష్టము. 3. ప్రవరాధ్యాయము.

4. యజుర్వేద చరణవ్యూహము.

5. కృష్ణయజుర్వేద ఆత్రేయానుక్రమణిక.

6. Do చారాయణీయానుక్రమణిక.

## సామ వేదము

క. 1. రాణాయనీయ సంహిత — సంపా ; అను : Stencuson London 1842.

2. కౌథుమ సంహిత — జర్మనీ అనువాదయుక్తము. By The Benfey Leipzig 1848.

3. కౌథుమ సాయణ సంహిత—By సత్యవ్రత సామశ్రమీ Biblind 1871.

4. జైమినీయ సంహిత—By W. Caland (Indische for Schumgen Boreslaw 1907.

5. సామవేద సంహిత—ఆంగ్లాను వాదకుడు Griffith వారణాశి 1893.

6. సామవేద తులసీరామ స్వామి కృతము.

## ఖ. సామవేద బ్రాహ్మణము

1. తాండ్య మహాబ్రాహ్మణ సాయణ భాష్యసహితము-సం. ఆనంద చంద్ర వేదాంత వాగీశ Asiatic Society of Bengal Calcutta 1870

2. దైవత షడ్వింశ బ్రాహ్మణములు సాయణ భాష్యముతో- సంపా. జీవానంద విద్యాసాగరుడు కలకత్తా 1881.

3. షడ్వింశ బ్రాహ్మణము విజ్ఞాపన భాష్యసహితము-సంపా. H. F. Ealsing Leyden 1908.

4. షడ్వింశ సాయణభాష్యయుక్తము [ప్ర. ప్రపాఠకము] సంపా. Kurt Klemn Guteslah 1898.

5. మంత్ర బ్రాహ్మణము - సంపా. సత్యవ్రత సామశ్రమీ, కలకత్తా సంవత్ 1947.

6. మంత్ర [ప్ర. ప్రపాఠకము] సంపా. Heiurich Stonner Halle 1901.

7. సంహితోపనిషత్తు బ్రాహ్మణ భాష్యయుక్తము. సం.పా A. C. Burnell మంగళూరు, 1876.

8. ఆర్షేయ బ్రాహ్మణము-సంపా. A. C. Burnell మంగళూరు 1876.

9. వంశ బ్రాహ్మణము-సాయణ భాష్యయుక్తము-సంపా. సత్యవ్రత సామశ్రమీ, కలకత్తా వి. సం. 1951.

10. సామవిధాన బ్రాహ్మణము - సాయణ భాష్యయుక్తము-సంపా. వి. సం. 1951.

11. సామవిధాన బ్రాహ్మణము సాయణభాష్యయుక్తము-సంపా A. C. Burnell London 1873.

12. జైమినీయ ఉపనిషద్ బ్రాహ్మణము-సంపా. Haus Oertel దేవనాగరీ సంస్కరణము లాహోరు 1921.

13. జైమినీయ ఆర్షేయ బ్రాహ్మణము-సంపా. A. C. Burnell మంగళూరు. వి. సం. 1878.

14. జైమినీయ బ్రాహ్మణము లేక తలవకార బ్రాహ్మణము. [సంపా. వేదవ్యాస M. A. ప్రకాశితము D. J. V. కాలేజి, లాహోరు].

## X. శిక్షా

1. సామప్రాతిశాఖ్య-సత్యవ్రత సామశ్రమీద్వారా [“ఉషా” కార్యాలయం కలకత్తా, 1890.]

2. పుష్పసూత్రము - అజాత శత్రుకృత టీకాసహితము-సంపా లక్ష్మణశాస్త్రి కాశి.

3. పుష్పసూత్రము జర్మనీ అనువాదము సంపా. R. Simon A. Bay. A 1909 PP. 48-1780.

4. పంచవిధ సూత్రములు-జర్మనీ అనువాదము By R. Simon 1903.

## ఘ. కల్పములు

### 1. శ్రౌతసూత్రములు:

1. మశక కల్పసూత్రములు. సంపా. W. Caland; Abhand XII. 3. Leipzig 1908
2. లాట్యాయన శ్రౌ.సూ. Biblika Indica Calcutta.
3. ద్రాహ్యాయణ శ్రౌ.సూ. సంపా. J. N. Renter Part I London 1908.
4. జైమినీయ శ్రౌ. సూ. [అగ్నిష్టోమాహ్వయనము] Leyden 1906.

### 2. గృహ్యసూత్రములు:

1. గోభిల గృ. సూ. సంపా. చంద్రకాంత తర్కాలంకార. ద్వి.సం. Bible India కలకత్తా 1906.
2. గోభిల గృ.సూ.జర్మని అనువాదము By F. Kuner Dorpat 1884-6.
3. గోభిల గృ.సూ.ఆంగ్లాను వాదము. Sacred booksof the East 13/29.
4. ఖదిర గృహ్య సూత్రములు ఆంగ్లాను వాదము S.B.E.15/29.
5. జైమినీయ గృ. సూ.-సంపా; అను: W. Caland Lahore 1922. పంజాబు సంస్కృత సీరీజ్.

### 3. కల్పములు—పరిశిష్టములు

1. గోభిల పుత్ర గృహ్య సంగ్రహ పరిశిష్టము By M. Bloom-fino Z. D. M. Q. vol. 35.
2. గోభిల పుత్రి గృహ్య సంగ్ర పరిశిష్టము :By చంద్రకాంత తర్కాలంకార Bibli India 1910.
3. గోభిల్లీయ పరిశిష్టము [సంధ్యాయా ధ్యాయము, స్నాన సూత్రము, శ్రాద్ధ-కల్పాదికములు] Bibli India 1909.

### జ. అనుక్రమణికలు:

1. సామవేదార్షానుక్రమణిక.
2. సామవేద దేవతాను క్రమణిక.

## అథర్వవేదము

క. 1. అథర్వ సంహిత సాయణ భాష్యము 4 vols Bombay.

2. Do ఆంగ్లానువాదము By Griffith (Benaras 1895-9).

3. Do By W.P. Whitney Edited By C.R. Laman (H.O.S. vol 7 & 8 Cambridge 1905.

3. క్షేమకరణ దానకృత భాష్యము:

ఖ. అథర్వవేద బ్రాహ్మణము:

1. గోపథ బ్రాహ్మణము సంపా. హరచంద్ర విద్యాభూషణ కలకత్తా 1870.

2. గోపథ బ్రాహ్మణము సంపా. డాక్టర్ డింకేగస్ట్రా లీడెన్ 1919.

గ. శిక్షా:

1. అథర్వవేద ప్రాతిశాఖ్య ప్ర. భా. సంపా. విశ్వబంధు విద్యార్థీ శాస్త్రి పంజాబు విశ్వవిద్యాలయము.

ఘ. కల్పములు:

1. శ్రౌత సూత్రములు—1. వైతాన శ్రౌత సూత్రములు జర్మనీ అనువాదము. అనువాదకుడు R. Garoe London & Stratesburg. 1878.

2. గృహ్యసూత్రములు -2. కౌశిక గృ.సూ.సంపా. M.Bloom Field New Havan 1890.

3. పరిశిష్టము—1. అథర్వవేద పరిశిష్టము-సంపా. G.M. Bolling J. Ron Negelion Leipzig 1909-10.

2. అథర్వవేద శాంతికల్పము Translation of the American Philological Association vols 35. 1904. 77 FF.

4. అథర్వ ప్రాయశ్చిత్తాని సం.—J. B. Negelium New Haven 1915.

జ. అనుక్రమణికలు:

1. అథర్వవేద చరణ వ్యూహము.

—: సంపూర్ణము :—

